ఓం శ్రీగురుభ్యోనమః ఓం శ్రీమహాగణపతయేనమః
ఓం శ్రీ శారదాచంద్రమౌళీశ్వరస్వరూప
మహాత్రిపురసుందర్యైనమః
శ్రీః

# శ్రీ చక్ర విల సన ము

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు



త్రి వేణి పబ్లిషర్సు
మచిలీపట్నం - 1 & మదరాసు - 1



# విషయసూచిక

శ్రీః

# సమర్పణము

శ్రీ విద్యాసమయదక్షిణాచారగురుమండలత్రయ దివ్యమూర్తులై శ్రీమదద్వైతప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారి నుండి అవిచ్ఛిన్న పరంపరాప్రాప్త శ్రీశృంగేరీ శారదాపీఠమునందు జగద్గురు పదస్థులై ఆసేతుశీతనగ పర్యంతభూమియందు వసించు ఆస్తికమహాజనులకు అభ్యుదయ నిశ్శ్రేయసములు కలుగుటకై అనుగ్రహ కటాక్షములు ప్రసరించుచు శ్రీమజ్జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వాముల కరకమల సంజాతులైన.

## శ్రీమదభినవవిద్యాతీర్థమహాస్వాములవారి

శ్రీచరణ పద్మములకు

సభక్తికముగ సమర్పితము.



ఓమ్

# శ్రీశృంగేరి శ్రీజగద్గురు సంస్థానమ్

## శ్రీ వి ద్యా శ ం క ర

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్యపదవాక్య ప్రమాణ పారావార పారీణయమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణా సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠతపశ్చక్ర వర్త్యనాద్య విచ్ఛిన్న శ్రీశంకరాచార్య గురు పరంపరాప్రాప్తషడ్దర్శన స్థాపనాచార్య వ్యాఖ్యానసింహాసనాధీశ్వర సకలనిగమాగమసార హృదయసాంఖ్య త్రయ ప్రతిపాదకవైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యానగర మహారాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజ గురుభూమండలాచార్య ఋష్య శృంగపురవరాధీశ్వర తుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీజగద్గురు చంద్రశేఖర భారతీస్వామి గురు కరకమలసంజాత శ్రీ జగద్గురుశృంగేరి శ్రీమదభినవవిద్యాతీర్థ స్వామిభిః ॥

అస్మదత్యంతప్రియశిష్య-తుమ్మలపల్లి శ్రీరామలింగేశ్వర రావు విమయే నారాయణ స్మరణపూర్వకం విరచితా ఆశిషః సముల్లసన్తు ।

భవద్భిః ప్రేషితః 'శ్రీచక్రవిలసనము' నామకః ఆంధ్ర భాషోపనిబద్ధః గ్రంథః అస్మాభిః అవలోకితః । పురుషైః అర్థ్యమానేషు హి అభ్యర్హితం స్థానం మోక్షాఖ్యస్య పురుషార్థస్య। స చ ఆత్మజ్ఞానైక-సమధిగమ్యః । ఆత్మజ్ఞానం చ ఉపాసితస్య భగవతః కృపయైవ సమవాప్యతే। తచ్చోపాసనమస్తి నానావిధం శాస్త్రదృష్టమ్। భగవత్యాః శ్రీమహాత్రిపురసుందర్యాః రాజరాజేశ్వర్యాః యంత్రోత్తమే శ్రీచక్రయంతే ఉపాసనం జ్ఞానసాధనం శాస్త్రేషు బహుధా ప్రశస్యతే । శ్రీచక్రస్య తత్త్వం అవిజానానైః విధీయమానం ఉపాసనం న వీర్యవత్తరం భవితు మర్హతి । అపరిశీలిత తంత్రాణాం తత్త్వం దురవగాహం భవతి । అస్మిన్ హి గ్రంథే తత్ తత్త్వం అకుశాగ్రమతోఽపి వినాయాసం సుష్ఠు జానీయుః అత్ర హి ప్రతిపాదనశైలీ నితరాం సరళా సరసా చ । బహూనాం గ్రంథానాం పరిశీలనస్య పరదేవతా కృపాయాశ్చ పక్వం ఫలమిదం మన్మహే వయమ్ । ఆశాస్మహే చ గ్రంథోఽయం శ్రీశారదా చంద్రమౌళీశ్వరయోః అకమ్పానుకమ్పాపరమ్పరయా పరదేవతోపాసక - జనపాణిపల్లవ - భూషణం భూయాదితి ।

(25-11-1968 స్కందషష్ఠి

శృంగగిరిక్షేత్రమ్

ఇతి నారాయణ స్మరణమ్.

శ్రీ

# పరిచయము

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు 'శ్రీచక్ర విలసనము' అని ఈగ్రంథమునకు నామకరణము చేసిరి. కానిచో శ్రీవిద్యాకోశము అని నామకరణము చేయవచ్చును. ఇట్టి గ్రంథము సంస్కృతమునందే లేదు. తెలుగులో లేదని చెప్ప నక్కరలేదు. అనేకములైన ఉపనిషత్తులు, పురాణములు ఆగమములు, భగవత్పాదుల రచనలు మొదలైన పలుచోట్లనుండి తీసి ఈ గ్రంథమునందు గుంఫించిరి. అట్లు గుంఫించుట తేలిక యనవచ్చును. తేలిక యేమియు కాదు. ఏది ఎచ్చట నున్నదో తెలియవలెను. తెలిసినంతలో సరిపోలేదు. దేనితో దేనికిసంబంధమో తెలియవలెను. వానిలోని రహస్యములు తెలియవలెను. శ్రీ విద్యాసమష్టిరూపమును తెలిసినవారుగాని యీపని చేయలేరు. ఏచక్రమం దెన్ని దళములు, ఏచక్రముల నడుమ నేయే సూక్ష్మచక్రములు, సమయ మెట్టిది, కౌళ మెట్టిది- దేవి కెన్ని యావరణము లున్నవి. ఇవి అనంతమైనవిషయములు. ఏయావరణయందే దేవతలున్నారు. ఇవియన్నియు శ్రీచక్రమునందున్నవి. అనగా శ్రీచక్రము సర్వమైన శ్రీవిద్యకు పరమసూక్ష్మమైనరూప మని యర్థము. దేశమున శ్రీవిద్యాపూర్ణదీక్షాపరులు చాలమందికలరు. పండితులు కానివారికింత గ్రంథావలోకనము చేయుటకు సామర్థ్యములేదు. ఈయన పూర్ణదీక్షాపరుఁడు, పరమసిద్ధులు, శృంగేరీపీఠాధిపతులు శ్రీమజ్జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామివా రితనికి దీక్షాగురువులు. ఇది అదృష్టము.

పూర్వజన్మపుణ్యపరిపాకము. ఇట్టివానికి శ్రీవిద్యారహస్యములు కరతలామలకములుగా నున్నవనుటలో నాశ్చర్యమేమున్నది ?

ఈయన నాకవితాభిమాని. అచ్చట నాతో స్నేహము. నేనును కొన్ని శ్రీవిద్యాగ్రంథములను చదివితిని. చదువుట విషయములు తెలియునుగాని రహస్యములు తెలియవు. ఈయన రహస్యములు తెలిసినవాడు. వయసులోన నాకంటె చాల చిన్నవాడు. కవితావిషయమున నాకు శిష్యుఁడనను. నే నాయనకు నమస్కార మెట్లు చేయుదును ?

సర్వదేవ నమస్కారాః కేశవం ప్రతిగచ్ఛతి. ఒక్క దేవతలే కాదు. దేవతారూపవంతములైన ప్రతిష్ఠలమునందలి నమస్కారమును పరమేశ్వరునే పొందును. పూర్ణదీక్షాపరునికి ఏమని యాశీర్వచనము లెందుకు ? ఈ గ్రంథములోని రహస్యము లసంఖ్యాతీతములు. కొన్ని చెప్పినను తెలియవు. చదివి మననముచేసి వానివాని వివేకమునుబట్టి పరదేవతానుగ్రహమున తెలిసికొనవలసినదే. తెలియవలసినదే. శ్రీ విద్యాప్రపంచమున నొక రహస్యమున్నది. పరాశక్తి బ్రహ్మపదార్థము. తక్కినవన్నియు నుపనిషద్రహస్యములే. శ్రీ విద్యాంగరూపమున వెలయింపబడినవి. చదివినచో తెలియును. తల్లి లోకము ననుగ్రహించును గాక.

విజయవాడ. విశ్వనాథ సత్యనారాయణ.

ఓం శ్రీ గురుభ్యోనమః   ఓం శ్రీ మహాగణపతయేనమః
ఓం శ్రీ లలితా మహాత్రిపురసుందర్యైనమః

# శ్రీ చక్ర విలసనమ్

శ్లో. గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్ ।
దాతారం సర్వకామానాం కామేశ్వరముపాస్మహే ॥

కామేశ్వరీం పరామీడే కాదిహాదిస్వరూపిణీమ్ ।
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్ ॥

సదాశివసమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరమ్పరామ్ ॥

యన్నామకీర్తనమిహ ప్రవదంతి సంతః సంసారభేషజ మనుత్తమమేవ నిత్యం। యద్దర్శనం పరమతత్త్వదదర్శనం తం శ్రీ చంద్రశేఖరయతీశ్వరమానతోఽస్మి । శ్రీగుర్వవిచ్ఛిన్నపరంపరాయాం భూమండలాచార్యకసార్వభౌమాన్ । వ్యాఖ్యానసింహాసనపట్టభద్రాన్భజే గురూన్ శృంగపురీమఠేశాన్ ॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో వంశర్షిభ్యో నమో గురుభ్యః । సర్వోపప్లవరహితప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి సోఽహమస్మి బ్రహ్మాహమస్మి।

## తంత్ర నిర్వచనము

మన శాస్త్రగ్రంథములందును, మన పురాణములందును, సాంకేతికపద్ధతి యొకటికలదు. ఆ సాంకేతికవిధానమున ప్రపంచ పరిపాలన దివ్యముగానుండుటకై, అనేక కక్ష్యలేర్పరుపబడినవి. ఆ కక్ష్యలకు అధిష్ఠానదేవతలు కలరు. వారిలో నొక్కొక్కరికి నొక్కొక్కలోకము, ఒక్కొక్కవాహనము, ప్రత్యేకమైనఆయుధములుకలవు. ఈ సాంప్రదాయిక సాంకేతిక విధానముపైననే భారతీయమైన చిత్రకళ, శిల్పకళ, సంగీత కళ, సాహిత్యకళ ఆధారపడి దివ్యముగా వికసించి, సౌరభ్య కల్లోలిత కకుప్తటములైనవి.

బాహ్యప్రపంచదేవతానీకమున్నట్లే - ఆంతర ప్రపంచ దేవతానీకమున్నది. మానసికమైన ఆంతరమార్గమును అవలంబించి ఈశ్వరాన్వేషణచేయుటలో, తంత్రశాస్త్రములని చెప్పబడు ఆగమములు పూర్వసాంప్రదాయిక సాంకేతికమార్గమునే అవలంబించుచున్నవి.

'తంత్రము' అనగా శాస్త్రమని యర్థము. "తన్యతే విస్తార్యతేజ్ఞానం ఇతి తంత్రః" అనగా జ్ఞానమును విస్తరింపజేయునట్టిదని వ్యుత్పత్తిభావము. తత్త్వమును, మంత్రార్థమును విస్తరింపజేయునదికూడ తంత్రమే. తంత్రమునకు త్రాణ మొనరించునదను వ్యుత్పత్తికూడ కనుపించుచున్నది, తంత్రనిర్వచనమున ప్రసిద్ధోక్తిగా (1) జ్ఞానము అనగా తత్త్వసిద్ధాంతములు, (2) యోగము అనగా ధ్యానవిధానము, (3) క్రియ అనగా కర్మవిధానము, (4) చర్య అనగా ప్రవర్తన (సాంఘికవిధులను గురించిన ఉపదేశములు) యీ నాలుగునకు, వీటిని బోధించు

గ్రంథమునకు తంత్రమని పేరు వచ్చినది.* ఆగమములని పేరు వచ్చుటకు కారణము భోగమోక్షములకు ఉపాయములను బోధించుటే. (ఆగతాన్ శంభువక్త్రేభ్యః గతాంచగిరిజా ముఖే మతం చ వాసుదేవేన తస్మాదాగమ ఉచ్యతే - ఆగమద్వైతనిర్ణయ) వేదములు నిగమములు. అవి భక్తి (ఉపాసన) జ్ఞానకర్మములయొక్క రూపములను తెలుపుచున్నవి. ఆగమములనబడు తంత్రములు వాటికి సాధనోపాయములను నిరూపించుచున్నవి. కృతయుగమువారికి వేదాచారము, త్రేతాయుగమువారికి స్మార్త (స్మృతిసంబంధము) చారము, ద్వాపరయుగమువారికి పురాణాచారము, కలియుగమువారికి ఆగమాచారము అని వేత్తలు పలుకుచున్నారు. మన నిత్యాచరణమునందుగల వ్రతములన్నియు ఆగమసంబంధములే. వేదములు ఈశ్వరముఖసంభూతములు కాగా, ఆగమములు వేదముఖసంభూతము లని మహాభారత శాంతిపర్వమునందు కలదు.

దేవతంత్రము లని పిలువబడే బ్రాహ్మణతంత్రములు గాక బౌద్ధతంత్రములు జైనతంత్రములుకూడ కలవు.

## తంత్ర వివరములు

ఉపాస్యదేవతాసంబంధముగా దేవతంత్రములు మూడు విధములు. అవి వైష్ణవతంత్రములు, శైవతంత్రములు, శాక్త తంత్రములు. వైష్ణవతంత్రములు పాంచరాత్రాగమము,

---

* వారాహితంత్రమున శ్రుతి, ప్రళయ, దేవతానామార్చనము, సాధన, పునశ్చరణ, షట్కర్మ, ధ్యానయోగము అనునవి ఏడు తంత్ర గుణము లని యున్నది.

వైఖానసతంత్రము మొదలగునవి. ఇవి ద్వైత, విశిష్టాద్వైత ములను బోధించునవిగా నున్నవి. శైవతంత్రములలో ద్వైత, విశిష్టాద్వైత అద్వైతపరమైన బోధలు కలవు. శాక్తతంత్ర ములు అద్వైతమునుమాత్రమే బోధించుచున్నవి. శివ విష్ణు (మోహినీ) పుత్త్రుడైన అయ్యప్ప (శాస్త) సందర్భముగా కారణాగమ మనుతంత్రము కలదు.

దక్షిణభారత స్మార్త దేవాలయముల నిర్మాణ ప్రతిష్ఠా నిత్యార్చన ఉత్సవాదులకు ప్రమాణభూతముగా నున్నది కేరళీయ తంత్రసముచ్చయము.

శాక్తతంత్రములు బహుళముగా నున్నవి. వీటియందు సాత్త్వికములు, రాజసములు, తామసములు అని కలవు. సాత్త్వికములకు తంత్రములని, రాజసములకు యామలములని, (రుద్ర, బ్రహ్మసిద్ధియామలములు) తామసములకు డామరము లని (భూత, దేవ, యక్షడామరములు) నామాంతరములు కలిగినవి. సామాన్యముగా నన్నిటిని తంత్రములని చెప్పుట కూడ వాడుకలో నున్నది. మహాభారత శాంతిపర్వమున శ్రీకృష్ణుడు శివశక్తులను తాంత్రికోపాసనచేసినట్లు కలదు.

శాక్తేయ తంత్రములలో కౌలవామాచారమునకు సంబంధిచినవి అరువదినాలుగు కౌలతంత్రములు. మిశ్రమ మార్గమునకు చెందిన ఎనిమిది మిశ్రతంత్రములు. సమయ దక్షిణాచారమునకుచెందిన శుభాగమ పంచక మని నామాంత రముగల సమయతంత్రము లైదు. అవి వాసిష్ఠ, సనక, సనందన, సనత్కుమార, శుకసంహితలు. తంత్రగ్రంథసము దాయమునకు మంత్రశాస్త్రమని వ్యవహారములో కలదు.

తంత్రశాస్త్రములలో శక్తులకు చిహ్నములుగా యంత్రములనబడు రేఖాచిత్రము లుపయోగింతురు. బలసత్వ ప్రధానమైనశక్తిని రేఖాచిత్రమున, సరళరేఖలతోగాని, వక్ర రేఖలతోగాని, లేక సరళవక్ర రేఖా సంపుటీకరణముచేతగాని చిత్రించుట ఆచారము. దేవతాస్వరూపమును మానవస్వరూపమువలె శిల్పమునందు వర్ణచిత్రములందు నిర్మించుటకంటె రేఖలతో, బిందువులతో, సాంకేతికముగా నిర్మించుట ఉత్తమ మార్గమని నిస్సంకోచముగ అంగీకరింపవలసియున్నది. యంత్రోపాసన ప్రతీకోపాసనకంటె శ్రేష్ఠతమమైనదని ఆగమాది శాస్త్రముల యభిప్రాయము. తాంత్రికమతమున నన్ని యంత్రములందును శ్రీచక్రము సర్వోత్కృష్టమైనది శ్రేష్ఠతమమైనది. శ్రీచక్రమును మించిన యంత్రములేదని మంత్రశాస్త్రవేత్తల, ఆగమవిదుల అభిప్రాయము. (యమభూతాది సర్వేభ్యో భయేభ్యోఽపిత్రాయతే సతతంచ 'తస్మాద్ యంత్రమితీరితమ్.')

## శ్రీ చ క్ర ఉ ద్ధా ర ము

శ్రీచక్రమున నొకదానియందొకటిగానున్న త్రికోణములున్నవి. ఇది వలయాకారముగ నున్నది. కేంద్రమునబిందువు, అయిదు త్రికోణములు అధోముఖముగా నున్నవి. నాలుగు త్రికోణములు ఊర్ధ్వముఖముగా నున్నవి. అధోముఖములైన త్రికోణము లైదును శక్తికి, ఊర్ధ్వముఖములైన నాలుగు త్రికోణములు శివునకు చిహ్నములు. ఇవి శివశక్తులు. ఈ తొమ్మిది త్రికోణములు నొక వలయమునందున్నవి. ఈ వలయమునుచుట్టి ఏకకేంద్రీయములైన రెండు వలయములున్నవి. వీటికి సాంకేతికముగ పద్మము లని పేరు. లోపలి వలయము

అష్టదళపద్మము. పై వలయము షోడశదళ పద్మము. దాని పై వలయముయొక్క రేఖగాక మూడు రేఖలు. ఈ చిత్ర మంతయు నొక చతుర్భుజముచేత చుట్టబడినది. ఈ చతుర్భు



జమునకుకూడ నాలుగుప్రక్కల సమానాంతరముగ గీయబడిన మూడు రేఖలు కలవు. నాలుగు దిశలందు, రేఖల మధ్యభాగ మున ద్వారములు - అనగా మొత్తము నాలుగు ద్వారములు కలవు. శ్రీచక్రముయొక్క సమష్టి చిత్రమును తొమ్మిది ఆవర ణలు(నవావరణలు) కలిగిన దని భావించెదరు.

## న వా వ ర ణ లు

తొమ్మిది ఆవరణలను వివరించు సాంప్రదాయిక శ్లోక మిట్లున్నది:—

శ్రు. "బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్ర నాగదళషోడశ పత్రయుక్తం ।
వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ
శ్రీ చక్రరాజ ఉదితః పరదేవతాయాః। (త్రిపురతాపినీ ఉపనిషత్.)

దీనికి పాఠాంతర మున్నది. కాని పాఠాంతరమువలన అర్థప్రతీతికి భంగము గలుగుట లేదు.

"బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వశ్ర నాగదళ సంయుత షోడశారమ్।
వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ
శ్రీచక్రమేత దుదితం పరదేవతాయాః ।

ఈ వివరములనే శ్రీ గౌడపాదాచార్యులవారు తాము రచించిన శ్రీ సుభగోదయ స్తోత్రమున వర్ణించిరి.

శ్లో. త్రికోణై రష్టారం త్రిభిరపి దశారం సముద భూ
ద్దశారం భూవేశ్మాదపిచ భువనాశ్రం సమభవత్ ।
తతోఽభూన్నాగారం నృపతి దళమస్మా త్త్రివలయం
చతుర్ద్వాః ప్రాకారత్రితయ మిదమేవాంబ శరణమ్ ॥

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరిలో శ్రీచక్రము నిట్లు వర్ణించిరి:—

శ్లో. చతుర్భిః శ్రీకంఠై శ్శివయువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభిశ్శంభోర్నవభిరపి మూలప్రకృతిభిః ।

చతుశ్చత్వారింశ ద్వసుదళ కళాశ్రితవలయ
త్రిరేఖాభిస్సార్థం తవ శరణకోణాః పరిణతాః ॥

(శ్రీచక్రమున నాలుగు శివచక్రములును, అయిదు శక్తి చక్రములును, అష్టదళ పద్మమును, షోడశదళ పద్మమును, మేఖలాత్రయమును, రేఖాత్రయమును చేరి సిద్ధించుచున్నది. అట్లు యేర్పడిన శ్రీచక్రమునందు బిందువుతో నలుబదినాలుగు కోణము లున్నవి. బిందువును విడచిన నలుబదిమూడని యీ శ్లోకము చెప్పుచున్నది.)

మరియు శ్రీచక్రమునుగురించి 'రుద్రయామళము'నం దిట్లున్నది

"పృశ్న యో నామమునయస్సర్వే చక్ర సమాశ్రియాః ।
సేవమానాశ్చక్ర విద్యాం దేవగంధర్వ పూజితామ్ ॥
అగ్నిషోమాత్మకం చక్రమగ్నిషోమమయం జగత్ ।
అగ్నావంతర్బభౌ భానుః అగ్నిషోమమయంస్మృతమ్ ॥
త్రిఖండం మాతృకాచక్రం సోమసూర్యానలాత్మకమ్ ।
త్రికోణం బైందవం సౌమ్యమష్టకోణం చమిశ్రకమ్ ।
చక్రం చంద్రమయం చైవ దశారద్వితయం తథా ।
చతుర్దశారం వహ్నేస్తు చతుశ్చక్రం చ భానుమత్ ॥
ఏతత్ప్రసాదా దింద్రాద్యా వసవోఽష్టౌ మరుద్గణాః ।
యేయే సమృద్ధాలోకేఽస్మిన్ త్రిపురాచక్ర సేవకాః ।
పురత్రయం చ చక్రస్య సోమసూర్యానలాత్మకమ్ ।
మహాలక్ష్మ్యాః పురం చక్రం తత్రైవాస్తే సదాశివః ॥"

రుద్రయామళమునందలి విషయములే స్వల్ప భేదములతో అరుణోపనిషత్తునందున్నవి. అరుణ యనగా భగవతి (అరుణాం

కరుణాంతరంగితాక్షీం.) భగవతియైన అరుణను ప్రతిపాదించు నట్టి యుపనిషత్తు అరుణోపనిషత్తు.

శ్రు. "ఇమానుకం భువనాసీషధేమ ఇన్ద్రశ్చ విశ్వే చ దేవాః । యజ్ఞం చ నస్తన్వం చ ప్రజాం చ ఆదిత్యైరింద్ర స్సహాసీషధాతు । ఆదిత్యై రిన్ద్రస్సగణోమరుద్భిః । అస్మాకం భూత్వవితా తనూనామ్। ఆప్లవస్వప్రప్లవస్వ । ఆణ్డీ భవజమా ముహుః సుఖాదీం దుఃఖనిధనామ్ ప్రతిముంచ స్వాస్వాం పురమ్ మరీచయ స్స్వాయంభువాః। యేశరీరాణ్య కల్పయన్ । తేతేదేహంకల్పయంతు మాచతేఖ్యాస్మతీరివత్ అష్టాచక్ర నవద్వారా ।"

(పృశ్నులను మునులు పరస్పరము భాషించుకొను చున్నారు. "శ్రీచక్రమును ఆశ్రయించుకొనియే భువనములున్న వనితలచెదము. ఇంద్రుడు, విశ్వేదేవతలు శ్రీచక్రము నాశ్ర యించి యున్నారు. అగ్నిష్టోమాది యజ్ఞమును, అర్ధశరీరయగు ధర్మపత్నిని, సంతానమును, సర్వసంపదలను, మరుద్గణముతో ఇంద్రుడు శ్రీచక్రమువలన పొందెను. ఆయన మనకు నుపదే శించెను. మరుద్గణసహితు డగు ఇంద్రుడే పుత్త్ర మిత్ర కళత్ర ములతోడ మన యోగక్షేమములను చూచువాడు. శ్రీచక్ర స్మరణమువలనఆపాదమస్తకము అమృతముచేత తడుపబడును. ఆ స్మరణ డెబ్బదిరెండువేల నాడీమార్గములను అమృతముచేత తడుపును. శ్రీచక్రవిద్యా ! పిండాండ రూపమైన మా దేహ మును బ్రహ్మాండరూపమైన భవదీయ బాహ్యదేహముతో చేర్పుము. సుఖాత్మకమును దుఃఖరహితము నగు స్వదేహము నధిష్ఠింపుము. భగవతి శరీరమునుండియే కాలముత్పన్నమగు

చున్నది. ఆ మరీచులు సూర్య చంద్రాగ్నులకు ప్రకాశంబు నొసగుచు దేవీచరణ సంభూతములై యున్నవి. నీ జ్ఞానము మమ్ము విడువకుండునుగాక. శ్రీచక్రము 1. అష్టకోణము, 2. దశ కోణములు, 1. చతుర్దశకోణము, 1. అష్టపత్రము, 1. షోడశ పత్రము, 1. త్రివలయము, 1. భూపురత్రయము-అను యెనిమిది చక్రములను కలిగి నవద్వారములను త్రికోణములను కలది.)

(శ్రీ)చక్రమున తొమ్మిది ఆవరణలు ఆరోహణ క్రమమున నున్నవి. (1) భూపురము, (2) షోడశదళపద్మము, (3) అష్టదళ పద్మము, (4) చతుర్దశారము, (5) బహిర్దశార మను దశ త్రికోణ చక్రము, (6) అంతర్దశారము, (7) అష్టకోణచక్రము, (8) త్రికోణము, (9) బిందువు.

అవరోహణలో బిందువునుంచి భూపురము వరకు తొమ్మిది. కేంద్రమందలి బిందువు, లోపలనున్న త్రికోణము కలసి మొదటి రెండు ఆవరణ లగును. ఆ తరువాత అష్టకోణ చక్ర మున్నది. పిమ్మట అంతర్దశార మను లోపలి దశత్రికోణ చక్ర మున్నది. దీనికి పదికోణము లున్నవి. ఆ పిమ్మట బహిర్దశార మను వెలుపలి దశత్రికోణ చక్ర మున్నది. తరువాత చతుర్దశార మని పిలువబడు పదునాలుగు త్రికోణములు గల చక్ర మున్నది. తరువాత అష్టదళపద్మము. పిమ్మట షోడశదళ పద్మ మను పేరుగల ఆవరణము. ఆ తరువాత భూపుర మను పేరుగల మూడు రేఖలు గల చతుర్భుజము కలదు. భూపురము మొదలు యీ తొమ్మిది ఆవరణల నొకదానిపై యొకటి నిలిపిన శ్రీచక్ర రూపము సిద్ధించును. దూర్వాసోఋషి విరచిత

మైన శ్రీలలితా స్తవరత్నమున శ్రీపురవర్ణనము సాహిత్య రమణీయముగా నున్నది.

## శ్రీ చ క్ర భే ద ము లు

శ్రీచక్రము మూడు ప్రస్తార విధములు. భూప్రస్తార, మేరుప్రస్తార, కైలాస ప్రస్తారము లని ప్రస్తార విశేషములు. ప్రస్తారత్రయమును గురించి శ్రీ గౌడపాదాచార్యులవారు సుభగోదయస్తోత్రమం దిట్లు వ్రాసిరి.

"ఇమానిత్యా వర్ణాస్తవ చరణసమ్మేళన వశా
న్మహా మేరుఖ్యాః స్యుర్మను మిళనకైలాస వపుషః
వశిన్యాద్యా ఏతా అపి తవ సబిందాత్మకత యా
మహీప్రస్తారోయం క్రమ ఇతి రహస్యం సమయినామ్."

నిత్యాషోడశ తాదాత్మ్య మనునది మేరుప్రస్తారము. మాతృకాతాదాత్మ్య మగునది కైలాసప్రస్తారము వశిన్యాది తాదాత్మ్యమనునది భూప్రస్తారము.

భూప్రస్తారమును గురించి సనత్కుమార సంహితయం దిట్లు చెప్పబడినది.

"శ్రీచక్రాంగములైన నిత్యల పదునాఱింటిని రెండేసి చొప్పున వశినీ మొదలుగాగల అష్టదేవతలతోడకలపి బిందు స్థానమైన త్రికోణమును విడచి తక్కినకోణము లెనిమిదింటియం దుంచునది బిందుస్థానమునందు త్రిపురసుందరిని భావించునది. ఎనిమిదివర్ణములును వశిన్యాది [1]దేవత లెనమండ్రును, షోడశ నిత్యలును, [2]ద్వాదశయోగినులును, [3]గంధాకర్షిణ్యాదులును,

1. వశిన్యాదు లెనమండ్రుగురు : వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, సర్వేశ్వరీ, కౌలినీ.

నాలుగునుచేరి నలువదియెనిమిది దేవతలు. ఇందు త్రిపుర సుందరిమాత్రము బైందవస్థానమునకు క్రిందుగా భావించునది గంధాకర్షిణ్యాదులను నాలుగింటిని నాలుగు ద్వారములందు భావింపవలెను. మిగిలిన నలువదిమూడు దేవతలను నలువది. మూడుకోణములందు భావించుకొనవలెను. దీనిని భూప్రస్తార రూపమైన శ్రీచక్రమనెదరు.

## మే రు ప్ర స్తా ర ము

షోడశనిత్యలు ఎనిమిదివర్గములుగానున్నవి. ఆయెనిమిది వర్గములు శ్రీచక్రమున అష్టదళపద్మమునందు గల యెనిమిది దళములందును క్రమముగా తూర్పుదళము మొదలుకొని ప్రతి దళమునందు నున్నవి. ఇట్లు ప్రతిదళమునందు రెండువంతున యెనిమిదిదళములం దున్నవి పదునారగుచున్నవి. ఈ నిత్యలు పదునారే పదునారుస్వరములుగా (అ ఆ మొదలైనఅచ్చులు) షోడశదళ పద్మమునందుండి దశారచక్రముల రెండిటనంతర్భూతములైనవి. ఈ షోడశనిత్యలలో మొదటి నిత్యాద్వయము (రెండును) త్రికోణమునందలి బిందురూపముగానున్నవి. తక్కిన పదునాలుగును మన్వస్రము (చతుర్దశారము) నందున్నవి. మేఖలాత్రయము, భూపురత్రయము యీ రెండును బైందవ త్రికోణముల రెంటియందు నంతర్భూతములు. శ్రీచక్రమందు

---

2. ద్వాదశయోగినులు : విద్యా, రేచికా, మోచికా, అమృతా, దీపికా, జ్ఞాన, ఆప్యాయనీ, వ్యాపినీ, మేధా, వ్యోమరూపా, సిద్ధిరూపా, లక్ష్మీ, యోగినులు.

3. గంధాకర్షిణ్యాదులు : గంధాకర్షిణి: రసాకర్షిణి, రూపాకర్షిణి, స్పర్శాకర్షిణి.

షోడశనిత్యలకు నంతర్భావము, ఈ యంతర్భావమునే మేరు ప్రస్తార మనుచున్నారు.

## కై లా స ప్ర స్తా ర ము

కైలాసప్రస్తారమును గురించి సనందన సంహితయం దిట్లున్నది. షోడశనిత్యలును శ్రీచక్రవిద్యకంగములు. స్వరాత్మకములైన యీపదునారు నిత్యలును పంచదశాక్షరీమంత్రమం దున్న 'ఏ' అను వర్ణమునందు మొదటనున్న (అ + ఇ=ఏ) 'అ' అను వర్ణముచేతను, విసర్గరూపమైన 'స' అను వర్ణముచేతను సంగృహీతములై జీవకళారూపమునంది బైందవస్థానమునం దుంచబడుచున్నవి. (పంచదశాక్షరీమంత్రమనగా శ్రీవిద్యలో ప్రముఖమైన 15అక్షరముల మంత్రము. బాల, పంచదశి, షోడశిమంత్రములు ముఖ్యమైనవి.) స్పర్శములు (కకారము మొదలు మకారమువరకుగల వర్ణములు) పాశాంకుశ బీజ యుక్తములయి అష్టదళచక్రమునందును, దశారచక్రద్వయము నందును (పదికోణముల చక్రములు రెంటియందు) అంతర్భూతము లగుచున్నవి. యకారము మొదలు తక్కిన తొమ్మిది వర్ణములును ద్విరావృత్తిచేత (యకారము మొదలుకొని తొమ్మిదివర్ణములు నొక్కొక్కదళమునం దొక్కొక్కవర్ణము చొప్పున వ్రాసి మరల యకారము మొదలుకొని పూర్వము లాగున వ్రాయుట) మన్వస్రమునందలి పదునాలుగు కోణము లందును పదునాలుగు వర్ణము లంతర్భూతము లగుచున్నవి. మిగిలిన నాలుగు వర్ణములును శివచక్రములు నాలుగింటియందు నంతర్భూత మగుచున్నది. దీనిని కైలాసప్రస్తారమందురు.

షోడశ నిత్యలు:—మేరుకైలాసప్రస్తారములలో షోడశ

నిత్యలను గురించి చెప్పబడినది. షోడశ నిత్యల వివరము లిట్లున్నవి.

## త త్త్వ ము లు

శివాది క్షిత్యంతమైన చరాచరములను బ్రహ్మాండ పిండాండములు చతుర్వింశతి తత్త్వమయములు అతత్త్వములు శివశక్తిస్వరూపములు. కాలముకూడ బ్రహ్మస్వరూపమని నిత్యమని భావింపబడుచున్నది. శ్రీవిద్య యనబడు చిద్విద్యలో పంచదశబీజములును కామేశ్వరీ మొదలగు పంచదశనిత్యలుగా నున్నవని సంప్రదాయభావము. ఆపంచదశబీజవర్ణములు పరంజ్యోతిస్వరూపమైన 'కామకల' అను నామాంతరము కల ధ్రువ కలనుండి ఆవిర్భవించినవి. పంచదశీమంత్రస్వరూపమైన పంచదశ బీజములు పంచదశనిత్యలై పాడ్యమి మొదలు పంచదశ తిథి రూపములుగా నున్నవి.

## ది వా రా త్ర ము లు

తిథులును దివారాత్రిరూపమైన శివశక్తిరూపము కలిగి యున్నవి. మంత్రవర్ణములును శివశక్తిరూపములే. శివశక్తి రూపమైన తిథులవలన కాలజ్ఞానము కలుగుచున్నది. కాబట్టి కాలము శివశక్త్యాత్మకమైన బ్రహ్మస్వరూపమే.

చంద్రుని మొదటికల ప్రతిపత్తు. రెండవది ద్వితీయ. కాలాత్మకమగు సూర్యమండలమునుండి – ఆ సంఖ్య కల నిర్గమించినప్పుడు శుక్లపక్షమునందా తిథి. కృష్ణపక్షమునందా తిథిలో నా సంఖ్యగల కల సూర్యమండలమును ప్రవేశించు చున్నది. ఇట్లే పౌర్ణమి అమావాస్యలవరకు పంచదశకలలు,

పంచదశతిథులు. పౌర్ణమినాడు సూర్యచంద్రులకు సమస్త కము అమావాస్య దినమున సూర్యచంద్ర సమాగమము. ఆ దినమున పంచదశకలలు చంద్రునివిడిచి సూర్యుని చేరుచున్నవి. ధ్రువకల మాత్రము చంద్రునియందు మిగిలియున్నది. ఇవి జ్యోతిశ్శాస్త్ర విషయములు.*

శ్లో. ప్రతిపన్నామ సా జ్ఞేయా చంద్రస్య ప్రథమాకలా ।
ద్వితీయా వా ద్వితీయాస్యాత్పక్షయో శ్శుక్లకృష్ణయోః।

చంద్రసూర్యగమనమువలన వృద్ధిక్షయములు కలుగుచున్నవి. ఆకారణమున అహోరాత్రములు కలుగుచున్నవి. అహోరాత్ర కాలభేదము లోకత్రయమునందు చక్రసంకేత కూటత్రయమునందు పాటింపబడుచున్నది. తురీయమైన సహస్రారమండలమున చంద్రుడు షోడశకలాసహితుడే.

కలాశబ్దము 'కలాతు షోడశోభాగః' అనుటచేత చంద్ర కలకు అన్వయించుచున్నది. అకారాది పంచాశద్వర్ణములకు కూడ నిది వర్తించుచున్నది.

శుక్లకృష్ణపక్షములలో దివారాత్రములకుప్రత్యేకమైన నామము లున్నవి. తైత్తిరీయమున, కాఠకమున, వాటి నామములు కన్పడుచున్నవి.

శుక్లపక్షదినసనామాని : (తై. బ్రా.) శ్రుతి. "సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జానదభిజానత్, సంకల్పమానం ప్రకల్ప

* ధ్రువ కలానిరూపణము బృహదారణ్యక ఉపనిషత్తునందు (౧ అధ్యా. బ్రా. ౧౪, ౧౫) ఛాందోగ్యమునందు (ప్రపా. ౬ ఖం. ౩) ప్రశ్నోపనిషత్తునందు, ముండకోపనిషత్తునందు కలదు.

మాన ముపకల్పమాన ముపక్ల ప్తంక్ల ప్తమ్ - శ్రేయోవశీయ అయస్సంభూతం భూతమ్."

శుక్లపక్షరాత్రి నామాని: శ్రు. దర్శా, దృష్టా, దర్శితా, విశ్వరూపా, సుదర్శనా, అప్యాయమానాప్యాయ మానాప్యాయానూనృతా ఇరా, అపూర్యమాణా పూర్య మాణా పూరయంతీ పూర్ణా పౌర్ణమాసీ."

కృష్ణపక్షదివసనామాని: శ్రు. ప్రస్తుతం విష్టుతగ్ం సగ్ స్తుతం కల్యాణం విశ్వరూపం శుక్రమమృతం తేజస్వి తేజ స్సమిద్ధం అరుణం భానుమన్మరీచీమదభితప స్తపస్వీత్.

కృష్ణపక్షరాత్రినామాని: శ్రు. "సుతా సున్వతీ ప్రసు తాసూయమానా విషూయమానా పీతీ ప్రపాసంపా, తృప్తి స్తర్పయంతీ కాంతా కామ్యా కామజాతాఽఽయుష్మతీ కామదుఘా."

ప్రతిపదాదితిథులు, నాటి అధిదేవతలైన కామేశ్వరాది నిత్యలు వివరముగా పొందుపరుచుచున్నాను. ఈ వివరములు వశిష్ఠసంహితయందుకూడ కలవు.

## శ్రీ చ క్రా వి ర్భా వ ము

శ్రీచక్రముయొక్క ఆవిర్భావమును గురించి రెండు పౌరాణికగాథలు లభ్యమగుచున్నవి. రేణుకాపురాణమం దొక గాథ కలదు.

ఇక్ష్వాకువంశమున రేణు రాజను పేరుగల రాజొక డుండువాడు. ఆయన శ్రీదేవీభక్తుడు. ఆయన శ్రీదేవిని గురించి ఉగ్రమైన తపస్సు చేసెను. శ్రీదేవి ఆయన తపస్సునకు మెచ్చి

## శుక్లపక్షము

| తిథి | అధిదేవత యైననిత్య | పగటి పేరు | రాత్రిపేరు (చంద్రకళపేరు) |
| --- | --- | --- | --- |
| పాడ్యమి | కామేశ్వరీ | సంజ్ఞానం | దర్శా |
| విదియ | భగమాలినీ | విజ్ఞానం | దృష్టా |
| తదియ | నిత్యక్లిన్నా | ప్రజ్ఞానం | దర్శితా |
| చతుర్థి | భేరుండా | జానత్ | విశ్వరూపా |
| పంచమి | వహ్నివాసిని | అభిజానత్ | సుదర్శనా |
| షష్ఠి | మహావజ్రేశ్వరి | సంకల్పమానం | అప్యాయమానా |
| సప్తమి | శివదూతీ | ప్రకల్పమానం | ఆప్యాయమానా (ప్రాయమానా) |
| అష్టమి | త్వరితా | ఉపకల్పమానం | ఆప్యాయ (ప్యాయా) |
| నవమి | కులసుందరీ | ఉపక్లప్తం | సూనృతా |
| దశమి | నిత్యా | క్లప్తం | ఇరా |
| ఏకాదశి | నీలపతాకా | శ్రేయః | అపూర్యమాణా |
| ద్వాదశి | విజయా | వశీయః | ఆపూర్యమాణా (పూర్యమాణా) |
| త్రయోదశి | సర్వమంగళా | ఆయత్ | పూరయంతి |
| చతుర్దశి | జ్వాలామాలినీ | సంభూతం | పూర్ణా |
| పౌరమి | చిత్రా | భూతం | పౌరమాసీ |

## కృష్ణపక్షము

| తిథి | అధిదేవత యైననిత్య | పగటి పేరు | రాత్రి పేరు |
| --- | --- | --- | --- |
| 1 | చిత్రా | ప్రస్తుతం | సుతా |
| 2 | జ్వాలామాలినీ | విష్టుతం | సూనృతా (సున్వతీ) |
| 3 | సర్వమంగళా | సంస్తుతం | ప్రసుతా |
| 4 | విజయా | కల్యాణం | సూయమానా |
| 5 | నీలపతాకా | విశ్వరూపం | అభిషూయమానా |
| 6 | నిత్యా | శుక్రం | ప్రీతీ |
| 7 | కులసుందరీ | అమృతం | ప్రపా |
| 8 | త్వరితా | తేజస్వి | సంపా |
| 9 | శివదూతీ | తేజః | తృప్తిః |
| 10 | మహావజ్రేశ్వరీ | సమిద్ధం | తర్పయంతీ |
| 11 | వహ్నివాసిని | అరుణం | కాంతా |
| 12 | భేరుండా | భానుమత్ | కామ్యా |
| 13 | నిత్యక్లిన్నా | మరీచిమత్ | కామజాతా |
| 14 | భగమాలినీ | అభితపత్ | ఆయుష్మతీ |
| అమావాస్య | కామేశ్వరీ | తపస్వత్ | కామదుఘా |

హోమాగ్ని మధ్యమున దివ్యరూపముతో సాక్షాత్కార మను గ్రహించినది. ఆమె శ్రీచక్ర మధ్య.

రెండవకథ బ్రహ్మాండ పురాణమునకు చెందినది. భండాసురుని జయించుటకై శ్రీదేవిని ఉద్దేశించి ఇంద్రుడు మహాయజ్ఞము చేసెను. ఆయజ్ఞమున దేవతలు తమతమ శరీరమాంసములనుకోసి హోమద్రవ్యముగా నొసగిరి. దేవతల త్యాగమునకు సంతోషించిన శ్రీదేవి కోటిసూర్యసమమైన తేజముతోను, కోటిచంద్రశీతలమయూఖములతోను ఆ హోమాగ్ని మధ్యమున ప్రత్యక్షమయ్యెను. శ్రీదేవి జ్యోతీరూపమైన శ్రీచక్ర మధ్యగతమై ప్రత్యక్షమైనది.*

శ్రీచక్రము, శ్రీవిద్యామంత్రములు శ్రీదేవీ స్వరూపములే (చక్రేశ్యాపి మహేశ్యాచ) శ్రీదేవి మహాత్మ్యను శబ్దరూపమున వెల్లడిచేయునవి శ్రీవిద్యామంత్రములు. ఆ మహాత్మ్యను రేఖారూపముగా వెల్లడిచేయునది శ్రీచక్రము. శ్రీవిద్య సర్వమంత్ర విద్యలకు ప్రభుస్థానమందున్న బ్రహ్మవిద్య. దీనిని మించిన ఉత్తమమంత్ర విద్యలు లేవు. శ్రీచక్రము కన్న ఉత్తమమైన యంత్రములు లేవు.

---

* ఈ వృత్తాంతమునే లలితాసహస్రనామావళిలో 'చిదగ్నికుండ సంభూతా' 'దేవకార్యసముద్యతా' (4, 5 నామములు) అనునవి వెల్లడించుచున్నవి. ఈ వృత్తాంత సందర్భమైన యజ్ఞము గోదావరి తీరమున నేటి రాజమహేంద్రవరమున గల కోటిలింగక్షేత్రమున జరిగినదనియు అచ్చటనే శ్రీచక్రముతో శ్రీ రాజరాజేశ్వరీదేవి ఆవిర్భవించుట చేత – ఆ ప్రదేశము రాజరాజేశ్వరీ మందిరమై – రాజమహేంద్రవరముగా మారిపోయినదని. స్థలపురాణము.

శివ శబ్దముచేత చతుర్యోన్యాత్మకమైన భాగమును శక్తి శబ్దముచేత మిగిలిన పంచయోన్యాత్మకమైన భాగమును కలసి శివశక్త్యాత్మకమైన శ్రీచక్రము నవయోనియుక్తము. శ్రీచక్రము వలననే ప్రపంచ సృష్టిస్థితిలయములు జరుగు చున్న వని వామకేశ్వర తంత్రము నందిట్లున్నది.

శ్లో. చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః
శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ।
పరోపి శక్తిరహితశ్శక్త్యా యుక్తోభవేద్యది
సృష్టిస్థితి లయాన్కర్తుం అశక్తశ్శక్తఏవ హి ॥
(వామకేశ్వరతంత్రే - చతుశ్శతి)

త్రైలోక్య మోహినియును శ్రీచక్రరూపిణియునగు శ్రీత్రిపురసుందరీ దేవినిపూజించుటచేతనే విష్ణుమూర్తి మోహినీ రూపమును ధరించి పరమశివుని మోహింపజేయగల శక్తిని పొందెను. మన్మథుడును శ్రీ త్రిపురసుందరీదేవిని అర్చించుట వలననే జితేంద్రియులైన మహర్షులను కూడ చలింపజేయగల వాడయ్యెను. శ్రీవిద్యయందొక మంత్రమునకు (త్రిపురసుందరీ ప్రస్తారము) శ్రీమహావిష్ణువే ద్రష్ట. ఈమంత్రము తైత్తిరీయ బ్రాహ్మణమునందు కలదు. శ్రీవిష్ణువు, మన్మథుడు శ్రీచక్రగత శ్రీదేవీపూజా బలమువలన శివుని, మహర్షులను చలింపజేసి నారని శ్రీశంకర భగవత్పాదాచార్యులవారి సౌందర్యలహరి యందును వామకేశ్వర తంత్రమునందలి చతుశ్శతి యందును కలదు.

శ్లో. హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం
పురా నారీభూత్వా పురరిపుమపి క్షోభమనయత్ ।

స్మరోఽపి త్వాం నత్వా రతినయనలేహ్యేన వపుషా
మునీనామప్యంతః ప్రభవతి హి మోహాయ మహతామ్।
(సౌందర్యలహరి)

శ్లో. ఏతామేవ పురాఽఽరాధ్యవిద్యాం త్రైలోక్యమోహినీం
త్రైలోక్యం మోహయామాస కామారిం భగవాన్హరిః।
కామదేవోఽపి దేవేశం దేవీం త్రిపురసుందరీం
సమారాధ్యాఽభవల్లోకే సర్వసౌభాగ్య సుందరః ।
(వామకేశ్వర తంత్రము.)

శ్రీచక్రమునకు వియచ్చక్రమని నామాంతరము కలదు. వియత్పూజ్యమగుటవలన నాపేరు వచ్చినది. వియత్పూజ్య మనగా దహరాకాశజము, బహిరాకాశజము రెండువిధములు. బాహ్యకాశముయొక్క అవకాశమునందు పీఠము నుంచి, అందు భూర్జపత్రమునగాని, తెల్లని వస్త్రమునగాని, బంగారు వెండి రాగిరేకులయందుగాని శ్రీచక్రమును లిఖించి పూజించుట బాహ్యకాశపూజ. దీనికి కౌలపూజయని వ్యవహారము కలదు. దహరాకాశజ మనగా హృదయాకాశముయొక్క అవకాశ మున అంతరముగా శ్రీచక్రమును పూజించుట. దీనికి సమయ పూజ యని వ్యవహారము. దీని వివరములు ముందు ముందు కలవు.

## పరాశక్తి

శ్రీచక్రము శివశక్త్యాత్మకమైన స్వరూపమునకు మాత్రమే గాక, బ్రహ్మాండమునకు, శ్రీవిద్యామంత్రములకు, వర్ణమాలకు, మానవశరీరమునకు కూడ చిహ్నమే.

పరాశక్తి సృష్ట్యాదిలో బిందుస్వరూపముగా నున్నది. ఆ బిందువు శివశక్తి సామరస్యమైనది. అది పరబ్రహ్మస్వరూప మన్నమాట. అది ఏకాకారమైనది. సృష్టిప్రాదుర్భవించు సమయమున, ఆ బిందువునందుగల మాయాస్వరూప ఇచ్ఛాశక్తియొక్క ఉద్రేకమువలన ఆ బిందువు స్ఫుటితమైనది. అప్పుడు పశ్యంతీ మధ్యమా వైఖరీ స్వరూపములను అవలంబించినది. ప్రథమావస్థ పరాబిందువు. ద్వితీయావస్థ పశ్యంతి. తృతీయము మధ్యమ. నాలుగవ అవస్థ వైఖరి. ప్రపంచము వైఖరీయవస్థ యందున్నది. పరావస్థచేరుటకు ఆరోహణము. సృష్టికార్యము అవరోహణ.

వైఖరీరూపశక్తియే 'అకారము' మొదలు హకారము వరకు గల పంచాశద్వర్ణ స్వరూపమాతృకాశక్తి. మాతృక మండలత్రయాత్మకముగా నున్నది. అకారాది పదియారు స్వరములు చంద్రఖండము. కాది భాంతము యిరువదినాలుగు సౌర ఖండము. మాదిక్షాంతము పదియు నగ్నిఖండము. మండల త్రయ, ఖండత్రయ, కూటత్రయాత్మకమైన పంచాశద్వర్ణ రూప మాతృక శ్రీచక్రస్వరూపాకృతిని స్వీకరించినది.

శ్రీ చక్రమధ్యబిందువు పరాస్వరూపము. బిందు వికసనము, త్రిభుజాచక్రము పశ్యంతీస్వరూపము అష్టకోణచక్రము మధ్యమాస్వరూపము. ఇవి కాని శ్రీచక్రభాగము లన్నియు వైఖరీ స్వరూపములు. 

శ్రీ చక్రమధ్య పరాబిందువు బీజము. దీనియందు రెండు దళములు జత అంకురములు కలవు. మధ్యత్రిభుజమున కోణ

బిందువులు మూడు, మధ్యబిందువు కలసి వెరసి నాలుగు బిందువులు కలవు.

శ్రీ చక్రమున 1. బీజము, 2. దళములు, 3. గుణములు (త్రిగుణములు), 4. మండలములు(సూర్యసోమాగ్ని), 5. భూతములు (పంచభూతములు), 6. అధ్వలు(షడధ్వలు*) 7. ధాతువులు (త్వగస్థిమేదోరుధిర మజ్జమాంస శుక్లములను సప్త ధాతువులు) 8 ప్రకృతులు (అష్టప్రకృతులు - బిందు, నాద, రేఫ, ఏకార, ఈకార, హకార, సకార, లకారప్రకృతులు). 9 యోనులు (4 శివయోనులు 5 శక్తియోనులు) 8 చక్రములు (అష్టచక్రములు) 28 మర్మములు (రెండు కంటె యెక్కువ రేఖలు కలిసెడు బిందువు) 18 సంధులు (రెండు రేఖలు కలియుబిందువు) 8 డమరుకములు 25 ముఖ్యదళములు, 5 ముఖ్యయోనులు కలవు.

---

* షడధ్వ లనగా మంత్రాధ్వపదాధ్వ వర్ణాధ్వ తత్త్వాధ్వభువనాధ్వ కళాధ్వములు.

1. మంత్రాధ్వము :-సద్యోజాత, వామదేవ,అఘోర, తత్పురుష, ఈశాన, హృదయ, శిరః, శిఖ, కవచ, నేత్ర, అస్త్రము లని పదునొకండు విధములు మంత్రములు సప్తకోటి భేదములు కలవి. అన్నిమంత్రములను (ఆమ్నాయమంత్రములు) పరమశివునియొక్క సద్యోజాతాది పంచముఖములనుండి ఆవిర్భవించినవే. కాబట్టి సద్యోజాతాది పంచమమును, ఆ మంత్రములకు ప్రధానమైన షడంగదేవతా మంత్రములనుచేరి పదునొకండు విధములని సాంప్రదాయికముగా చెప్పుట ఆచారము. మంత్రమందున్న అక్షరములనుబట్టి మంత్రములు, పిండ, కర్తరి, బీజ, మాలాభేదములైనవి. (మూడవ అనుబంధముచూడుడు.)

2. పదాధ్వము:— ఇవి 81. మహాదేవ సద్భావేశర మహాతేజయోగాధిపతి ముంచ ముంచ ప్రదమ ప్రదమ సర్వసర్వ భవ భవ భవోద్భవ

సర్వభూత సుఖప్రద సర్వసాన్నిధ్యకర బ్రహ్మ విష్ణు రుద్రపర అనార్చితా నార్చిత అస్తుతాస్తుత పూర్వస్థిత సాక్షి సాక్షి తురు తురు పతంగ పతంగ పింగ పింగ జ్ఞాన జ్ఞాన శబ్ద శబ్ద సూక్ష్మ సూక్ష్మ శివ సర్వసర్వ ఓం నమశ్శివ ఓం నమోనమ నమశ్శివ ఓం నమరూపి అరూపి ప్రథమ ప్రథమ తేజస్తేజ జ్యోతిర్జ్యోతి అరూప అనగ్ని అధూమ అభస్మ అనాదినాదానా ధూహూధూ ఓం భూః ఓం భువః ఓగ్ంసువః అనిధననిధన నిధనోద్భవ శివసర్వ పరాపరాత్మ భువనేశ్వర ధ్యానహర ఓం నమశ్శివ సర్వప్రభుశివ ఈశానమూర్ధ్ని తత్పురుష వక్త్రే అఘోరహృదయ వామదేవగుహ్య సద్యోజాతపాద ఓం నమః గుహ్యతిగుహ్య గోప్త అనిధన సర్వయోగాధికృత సర్వవిద్యాధిప జ్యోతిరూప పరమేశ్వర పరమేశ్వర అచేతనాచేతనా వ్యోమిన్ వ్యోమిన్వ్యాపిన్ వ్యాపిని వ్యోమవ్యాపిని వ్యోమరూప సర్వవ్యాపిని శివానంత అనాథ అనాశ్రిత ధ్రువ శాశ్వతయోగపీర సంస్థిత నిత్య యోగి ధ్యానహర అర్ధోంకారములు.

3. వర్ణాధ్వము:— పంచాశత్తు (ఏబది) అం ఆం ఇం ఈం ………… హం ళం క్షం.

4. తత్త్వాధ్వము :—భూతపంచక, జ్ఞానేంద్రియ పంచక, కర్మేంద్రియ పంచక, ప్రాణపంచక, శబ్దాదిపంచక, అంతఃకరణ చతుష్టయ, శరీర త్రయ, అవస్థాత్రయ, అజ్ఞానములను ముప్పదియారును, షడ్భావ వికార, షట్కోశక, షడూర్మి, అరిషడ్వర్గములును, జీవత్రయ గుణ త్రయ కర్మత్రయములును, వచనాదాన గమన విసర్గానందములును, సంకల్పాధ్యవసాయాభిమానావధారణములును, వైచిత్ర్యాది చతుష్టయమును, దిగ్వాతార్కాది చతుర్దశేంద్రియాధిష్ఠాన దేవతలును మొత్తము తొంబదియారు.

5. భువనాధ్వము :—భద్రకాళి వీరభద్ర త్రిలోచన నభ లిప్సు వివాహ సంవాహ త్రిదశేశ్వర త్ర్యక్షగణాధ్యక్ష నిభు శంభు. దంష్ట్ర వజ్ర ఫణీంద్ర ఉదుంబరగ్రసన, మారుతాశన, క్రోధన అనంత వృషధర వృషబలి ప్రియ భూతపాల జ్యేష్ఠ సురేశ్వర వేదపారగ జ్ఞాన

భూసర్వజ్ఞ ఈశాన విద్యాధిపప్రకామదప్రసాద శ్రీధర రత్నధర లక్ష్మిధర జటాధర సౌమ్యధర దన్యరూప నిధీశ మేఘవాహన కపర్ది పంచశిఖ పంచాంతకక్షయాంతక తీక్ష్ణసూక్ష్మవాయువేగ లఘు శీఘ్రసునాద మేఘనాద జలాంతక దీర్ఘబాహు జయభద్ర శ్వేతమహాబల పాశహస్త అతిబల బలిదంష్ట్ర లోహిత ధూమ్ర విరూపాక్ష ఊర్ధ్వకేశ భయాంతక క్రూరదంష్ట్రి దంష్ట్రిమారణ నిరృతి ధర్మపతి అధర్మపతి, వియోక్త సంయోక్త కర్మవిధాత ధాతహర మృత్యుధర్మ అక్షయాంతక భస్మాంతక వజ్రబాహు దహన జ్వలన హరఘాతుక పింగళ హుతాశన అగ్నిరుద్రత్రిదశాదిప పినాకిశాంత అవ్యయవిభూతి వివర్ధన వజ్రదేహ బుధ అజకపాలీశ రుద్ర విష్ణు బ్రహ్మహాటకేశ్వర కూశ్మాండ కాలాగ్ని రుద్ర శ్రీకర్ణ బౌమకౌమారవైష్ణవ బ్రాహ్మ్యభైరవ కృత అకృత స్థలేశ్వర సుబ్రాహ్మ్యపాజేశసౌమ్య ఇంద్ర గాంధర్వ యక్ష రాక్షసపైశాచ సుస్థలేశ్వర శంఖ కర్ణకాలాంజన మండలేశ్వర మహాండ ద్విరండ సకలాండ స్థాణు స్వర్ణాక్ష భద్రకర్ణ గోకర్ణ మహాలయ అవిముక్త రుద్రకోటి వస్త్రాపద భీమేశ్వర మహేంద్ర అట్టహన విమలేశ్వర నఖిలనాఖిల కురుక్షేత్ర గయాక్ష మహాభైరవ కేదార శ్రీశైల మహాకాళమధ్యమేశ్వర ఆమ్రాదికేశ్వర జలేశ్వర హరిశ్చంద్ర అకుల్వేశ్వర ఢుండిముండి భారభూతి ఔషధి పుష్కర నైమిశ అమరేశ్వర అంగుష్ఠమాత్రార్క ఈశాన ఏకేక్షణ ఏకపింగళ ఉద్భవ అభవ వామదేవ మహాద్యుతి శిఖేద ఏకవీర క్రోధ చండశూర పంచాంతక సంవర్తజ్యోతిష మహాక్రోధ మహాచండ ఏకశివ అనంత అజ ఉమాపతి ప్రచండ ఏకపాద ఈశాన భవ ఉగ్ర భీమ అనంత సూక్ష్మశివోత్తవ ఏకనేత్ర ఏకరుద్ర త్రిమూర్తి శ్రీకంఠ శిఖండివామ జ్యేష్ఠ రౌద్రకాళ కలవికర్ణ బలవికర్ణ బలప్రమథన సర్వభూతదమన మనోన్మని అనాశ్రిత అనాధువ అనంత వ్యోమరూప వ్యాపిని ఊర్ధ్వగామిని రోచిదమోచిక దీపిక ఇందిర శాంత్యతీత శాంతి విద్యాప్రతిష్ఠ నివృత్తి అనునవి ఇన్నూటయిరువది నాలుగు.

6. కళాధ్వము :—నివృత్తి ప్రతిష్ఠ విద్యాశాంతి శాంత్యతీతము అనునవి ఆయిదు. అయిదు కళలందును మిగిలిన అధ్వలైన మంత్రపదవర్ణ

దళములు కలవి కమలములు. ప్రకాశాంశము. శివము. కోణములు గలవి చక్రములు. విమర్శాంశము. శక్తిభాగము. బిందుఅష్టదళ షోడశదళ భూపురములు నాలుగు శివస్వరూప కమలములు. త్రికోణ అష్టకోణ దశారయుగ్మ చతుర్దశార ములు నాలుగు శక్తిరూప చక్రములు. కమలచక్ర సమ్మేళన ముతో నాలుగు ద్వంద్వములు. బిందుత్రికోణము ఆది ద్వంద్వము. తక్కినవి మూడు త్రిమూర్తిద్వంద్వములు.

## మూ ల ప్ర కృ తు లు

శివచక్ర శక్తిచక్రములు తొమ్మిదియును ప్రపంచము నకు మూలకారణమైన ప్రకృతులు. అందుచేత వీటికి యోను లని పేరు వచ్చినది. ఈ తొమ్మిది యోనులే నవధాతువులయి పరాశక్తి దేహ మగుచున్నవని 'కామిక'యం దున్నది.

---

తత్త్వభువనాధ్వలు అంతర్భూతములై యున్నవి. తత్త్వాధ్వమున భువనము అంతర్భూతములే.

పరతత్త్వము షడధ్వాతీతము. మననరక్షణ విలక్షణమై (మకారం మననం చైవత్రకారం త్రాణముచ్యతే మననత్రాణ మిత్యాహుర్మంత్ర మిత్యభిధీయతే) మంత్రాతీతము. సర్వదేశవ్యాపకమై పదాతీతము, అవర్ణమై వర్ణాతీతము. సర్వతత్త్వవిలక్షణమై తత్త్వాతీతము సర్వస్వా మియై భువనాధ్వాతీతము, నిష్కళయై కళాధ్వాతీతము.

కళాతత్త్వభువనాధ్వలు ప్రకాశాంశలై రూపమును తెలుపును. వర్ణ పద మంత్రాధ్వలు విమర్శాంశలై నామమును తెలుపును. జగత్తు నామ రూపాత్మకము. అనగా శివశక్త్యాత్మకము (అస్యవిమర్శస్యగుణాః పదమంత్రార్ణాత్మక త్రిధాభవతి, పురతత్త్వకలాధ్వార్థోధర్మిణ ఇత్థం ప్రకాశ్యేతి) షడధ్వల వివరములు కైవల్యనవనీతమునందు సువిస్త రముగా నున్నవి.

శ్లో. త్వగసృఙ్మాంసమేదోస్థిధాతవశ్శక్తి మూలకాః
మజ్జాశుక్లప్రాణ జీవధాతవశ్శివ మూలకాః
నవధాతురయం దేహో నవయోని సముద్భవః
దశమీ యోనిరేకైవ పరాశక్తిస్తదీశ్వరీ
ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండముద్భవౌ
పంచ భూతాని శాక్తాని మాయాదీని శివస్యతు
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వర సదాశివౌ
పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతి వా
శివశక్త్యాత్మకం విద్ధి జగదేతచ్చరాచరమ్ ॥

త్వక్కు-రక్తము మాంసము మేదస్సు అస్థులు అనునవి అయిదును శక్తిమూలకములు. మజ్జశుక్లము ప్రాణము ఓజస్సు అను నాలుగును శివమూలకములు. ఈ తొమ్మిది ధాతువులు నవచక్రాత్మకములు. దశమయోని యగు బిందుస్థానమునకు పరాశక్తి ఈశ్వరి. కావున నవ చక్రాత్మకమైన దేహాంతర్గత బిందుస్థానమునందు పరాశక్తి అధివసించుచున్నది. ఈ విధముగా చరాచరాత్మకమైన పిండాంశము అచరాత్మకమైన బ్రహ్మాండము కలుగుచున్నవి. బ్రహ్మాండమున పృథివ్యాది పంచమహాభూతములు శక్త్యాత్మకములు. మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు అను నాలుగును శివాత్మకములు. పంచభూతములు, తన్మాత్రలు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ దశకము, అంతరింద్రియమైన మనస్సు మాయాది చతుష్టయము చేరి పంచవింశతి (25) తత్త్వములు. ఈ తత్త్వములు

శివశక్త్యాత్మకము లగుటచేత చరాచరమైన జగత్తు శివ శక్త్యాత్మకమే. పంచవింశతి తత్త్వము లని చెప్పుట శ్రుత్యను సారమే. శివశక్తి సంపుటమునుండి జగదుత్పత్తి యగుచున్న దని * శ్రీ గౌడపాదాచార్యులవారు శ్రీ సుభగోదయమునం దిట్లు చెప్పిరి.

"పరోఽపి శక్తిరహితః శక్తః కర్తుం న కించన
శక్తస్స్యాత్పరమేశాని శక్త్యా యుక్తో భవేద్యది ।"

వాయవ్యసంహిత మొదలైన శైవపురాణములందు ఏకపంచాశత్తత్త్వము లని (51) చెప్పబడినది.

పంచభూతాని తన్మాత్రపంచకం చేంద్రియాణి చ
జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ
త్వగాదిధాతవస్సప్త పంచప్రాణాదివాయవః
మనశ్చాహంకృతిః ఖ్యాతిర్గుణాః ప్రకృతిపూరుషౌ
రాగో విద్యాకళా చైవ నియతిః కాలఏవచ
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వర సదాశివౌ
శక్తిశ్చ, శివతత్త్వంచ తత్త్వాని క్రమశో విదుః ।

పృథివిజలతేజో వాయ్వాకాశములను పంచభూతములు, గంధ రూప రసస్పర్శశబ్దము లైదును తన్మాత్రలు, జ్ఞానకర్మేంద్రియ ములు పది, త్వగసృఙ్మాంసమేదోస్థిమజ్జాశుక్లము లేడును, ప్రాణాపానాది ప్రాణవాయువు లైదు, సంకల్పాకృతి మనస్సు,

* పంచవింశతి తత్త్వములు శివశక్తి మేళనవస్తువునుండి (బిందువు) ప్రభూతములైనవే. శ్రుతి "పంచవింశ ఆత్మాభవతి."

అహంకృతి జ్ఞానమైన ఖ్యాతి త్రిగుణములు ప్రకృతిపురుషుడు ఇచ్ఛారాగము వికల్పజ్ఞానమైన విద్య, కళలు (ఇవి 360.) మాయ మాయామోచకమైన శుద్ధవిద్య రజోగుణావిష్టుడైన సృష్టికర్త మహేశ్వరుడు స్థితికర్త సదాశివుడు సంహారిణీశక్తి శుద్ధబుద్ధ ముక్తస్వరూప శివతత్త్వము. ఇవి ఏబదియొకటి తత్త్వములు.

త్వగాది సప్తధాతువులు పంచభూతాత్మకములే. ప్రాణాది వాయువులు వాయుగతములే అహంకారము మనస్సులో భాగమే. ఖ్యాతి విద్యాభాగమే త్రిగుణములు ప్రకృతిలక్షణములే. పురుషుడు జీవుడై మహేశ్వరభాగమే. కళలు శుద్ధవిద్యలోనివి. మాయ సదాశివునియందంతర్భూతము కాబట్టి 26 తత్త్వములు సర్వసమ్మతములు శ్రుత్యనుసారము.

## ఆ వ ర ణ సం కే త ము లు

శ్రీచక్రమందున్న తొమ్మిది ఆవరణలకు, ఇతరభాగములకు ప్రత్యేకమగు సాంకేతిక నామము లున్నవి. ప్రతి విభాగమునకు ప్రత్యేకమగు రంగు కలదు. ప్రత్యేకమగు అధిష్ఠానదేవత కలదు. ప్రత్యేక బీజాక్షరమంత్రమున్నది. ప్రత్యేక పరివార సహజనము కలదు. ముఖ్యమైన వివరము లిట్లున్నవి.

(1) బిందువు:— బింద్వాది 'భూపురాంతముగానున్న సృష్టిక్రమమున తొమ్మిది ఆవరణ లున్నవి. బిందువు సృష్టిక్రమమున మొదటిది. ఈ బిందువునకు సర్వానందమయచక్ర మని పేరు. ఇది బింద్వాకృతి కలది. దీని ప్రకృతి బిందురూపము. దీని

తత్త్వము పంచబ్రహ్మాత్మకము. చక్రేశ్వరి శ్రీత్రిపురసుందరీ దేవి. ఇట ప్రదర్శనాయోగ్యమైన ముద్ర సర్వయోనిముద్ర. స్థాయీభావము శమము. శాంతరసము ప్రధానమైనది సర్వ భావ నవరసభరితము. ఇట గల యోగినీదేవి పరాపర రహస్యయోగిని పూజా క్రమము పారిదక్షిణం అధిష్ఠానదేవత శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారికాదేవి. ఐం హ్సైం హ్స్క్లీం హ్స్సౌః అనునవి బీజమంత్రములు. ఈ దేవి చంద్రకలాకిరీటము కలిగి చంద్రాగ్ని సూర్యరూప నేత్రత్రయము కలిగి మంద స్మితము చేయుచుండును. ఇచ్ఛాశక్తి యను పాశమును, జ్ఞానశక్తి యను అంకుశమును మనస్తత్త్వ మను ఇక్షుకో దండమును, పంచతన్మాత్రలను పుష్పబాణములను ధరించిన హస్తచతుష్టయము కలిగియున్నది. బాలసూర్యునివంటి శరీర కాంతి కలిగియున్నది. దివ్యమైన గంధ వస్త్రమాల్యాభరణము చేత అలంకరించుకొనినది. ఆమెవలె వేషభూషాలంకృతలగు నవావరణ దేవతలచేత సేవింపబడు చున్నది. శ్రీదేవి కామే శ్వరుని వామోరుభాగమున కూర్చున్నది. ఈ బిందువే సర్వమునకు ప్రకృతి. బింబభూతశుద్ధబ్రహ్మ స్వరూపము మిగిలినవి శబలబ్రహ్మస్వరూపములు బిందువునందు ఓం ఈం ఈంనమః అనునది బీజన్యాసము.

*తైత్తిరీయ శ్రుతియందు వివరింపబడిన మానుషానం

* తైత్తిరీయోపనిషత్ :—ఆనందవల్లి అష్టమానువాకము. మానుషా నంద, మనుష్యగంధర్వానంద, దేవగంధర్వానంద, చిరలోక లోక పిత్రానంద, ఆజానజ దేవానంద, కర్మదేవానంద, దేవానంద, ఇంద్రా నంద, బృహస్పత్యానంద, ప్రజాపత్యానంద, హిరణ్యగర్భానంద, బ్రహ్మానందములు.

దాది బ్రహ్మానంద పర్యంతమైన సర్వానందములు నిందు కలవు. కాబట్టి బిందువునకు సర్వానందమయ మని పేరు వచ్చినది. ఈ విషయమే కల్పసూత్ర కారికలు చెప్పుచున్నవి.

"మేరుమంత్రాత్మకం చక్రం శ్రీవిద్యా స్తత్ర దేవతాః
కామేశ్వరః ప్రకాశాత్మా శ్రీవిమర్శాతదంకగా ।
ఇత్యేతద్వాసనారూపమభేదం చ పరస్పరం
జ్ఞాత్వా శ్రీగురువక్త్రాద్యా జ్ఞాత్వా కృతా పూజా మహాఫలా *

బిన్ద్వభిన్న పంచబ్రహ్మాత్మకే బిందుచక్రే పంచబ్రహ్మాకార మంచస్థకామేశ్వరాంకస్థాం ప్రముదితాం అరుణాంబరాది మహాభరణస్రగాఢ్యాం అంకుశపాశధనుర్బాణై రలంకృతభుజాం మందస్మితాం పరదేవతాం ధ్యాత్వా పూజయేత్ ; తయోః కామేశ్వరీసదానందఘనా స్వాత్మైక్యరూపా దేవతా ।"

శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు బిందుగత శ్రీదేవీ స్వరూపమును సౌందర్యలహరియం దిట్లు వర్ణించిరి.

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే ।
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే ।
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయామ్ ।
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్ ।"

[సుధాసింధువు మధ్యభాగమున కల్పవృక్షశాఖలతో ప్రకాశించునట్టి మణిద్వీపమునందు కడిమితోపులచేత నొప్పి

* శ్రీచక్రము మేరుమంత్రరూపమున నున్నదనియు, శ్రీచక్ర నవావరణలు క్రమముగా మేరుమంత్రమందున్న లం సం హం శ్రీం ఏం రం కం అః అం (సమిష్టిహ్స్ఖ్ఫ్రేం) అను వర్ణప్రకృతి కలవనియు చెప్ప బడుచున్నవి.

యున్న చింతామణిగృహమునందు, శివాకారమంచెపై పరమ శివ పర్యంకముననున్న దేవిని ధన్యులైనవారు సేవింతురు.]

ఈ వివరములే భైరవయామళమునందు కలవు. భైరవ యామళాంతర్గతవామకేశ్వరమహాతంత్రమున బహురూపాష్టక విద్యయం దిట్లు కలదు.

"బిందుస్థానం సుధాసింధుః పంచయోన్యస్సురద్రుమాః।
తత్రైవ నీపశ్రేణీ చ తన్మధ్యే మణిమంటపమ్ ।
తత్ర చింతామణికృతం దేవ్యా మందిరముత్తమమ్।
శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥
అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః ।
భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః ।
తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।
శివార్కమండలం భిత్వా ద్రావయంతీందుమండలమ్ ।
తదుద్భూతామృతస్యంది పరమానందనందితా ।
కులయోషిత్కులం త్యక్త్వా పరం పర్ణణమేత్య సా ॥"

పై వివరములే సంక్షేపముగ యామళమున సదాశివ వచనముగా నిట్లున్నవి.

"సుధాబ్ధౌ నందనోద్యానే రత్నమంటపమధ్యగామ్ ।
బాలార్కమండలాభాసాం చతుర్బాహుం త్రిలోచనామ్ ।
పాశాంకుశశరాం చాపం ధారయంతీం శివాం శ్రియమ్ ।
ధ్యాత్వా చ హృద్గతం చక్రం ప్రణతస్థః పరమేశ్వరీమ్ ।
పూర్వోక్తధ్యానయోగేన సంచిత్య జపమాచరేత్"

చంద్రకళావిద్య యని నామాంతరము గల శ్రీవిద్యలో పంచదశీవిద్య (మంత్రము) పంచదశ తిథుల రూపమైన దని వివరింపబడినది. చంద్రకలాకిరణములు మున్నూటయరువదియు మున్నూటయరువది దినములు. వాటివలన సంవత్సర మేర్ప డును. సంవత్సరము ప్రజాపతిరూపమైనది. ప్రజాపతి జగత్కర్త. కాబట్టి మరీచులు (కిరణములు) ప్రపంచసృష్టిస్థితిలయకారు లగు చున్నవి. పిండాండబ్రహ్మాండములలో మరీచులు మున్నూట యరువది. అనంతకోటి బ్రహ్మాండములలో గల పిండాండము లందును బ్రహ్మాండములందును మరీచులు మున్నూటయరువది మున్నూటయరువదిచొప్పున అనంతముగా నున్నవి. శ్రీదేవీ చరణారవిందజనితములైన మరీచులు సూర్యచంద్రాగ్నులతో కలసి భిన్నభిన్న లోకములను ప్రకాశింప జేయుచున్నవి. మరీచులు శ్రీదేవీ చరణారవిందజనితములని తైత్తిరీయ బ్రాహ్మ ణమునందున్న 'లోకస్య ద్వారమర్చిమత్పవిత్రమ్' అను శ్రుతి పాఠము చెప్పుచున్నది. మరీచులు సృష్టిస్థితిలయ కారకు లని 'మరీచయస్స్వాయంభువాః' అను శ్రుతి పాఠము ప్రతిపాదించు చున్నది. కాబట్టి భగవతీ పాదారవిందజనితములైన అనంత కోటికిరణములలో కొన్నిటిని తీసికొని సూర్యచంద్రాగ్నులు శ్రీదేవీ ప్రసాదాపాదితమైన జగత్ప్రకాశన సామర్థ్యముతో జగములను ప్రకాశింప జేయుచున్నారు. కనుక చంద్రకళా చక్రమైన బిందుస్థానము సర్వలోకాతిక్రాంతమైనది. భైరవ యామళమున చంద్రవిద్యయందు మహేశ్వరు డీవిషయమును పార్వతీదేవితో చెప్పినట్లు కలదు.

'5]

సాధుసాధుమహాభాగే పృష్టం త్రైలోక్యసుందరి ।
గుహ్యాగుహ్యతమం జ్ఞానం న కుత్రాపి ప్రకాశితమ్ ।
కళావిద్యాపరాశక్తే, (శక్తిః) శ్రీచక్రరూపిణీ ।
తన్మధ్యే బైందవస్థానం తత్రాస్తే పరమేశ్వరీ ॥
సదాశివేన సంపృక్తా సర్వతత్త్వాతిగా సతీ ।
చక్రం త్రిపురసుందర్యాః బ్రహ్మాండాకారమీశ్వరీ ॥
పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మకమేవ చ ।
ఇంద్రియాత్మకమేవం చ మనస్తత్త్వాత్మకం తథా ॥
మాయాదితత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైన్దవమ్ ।
బైన్దవే జగదుత్పత్తిస్థితిసంహారకారిణీ ।
సదాశివేన సంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరీ ।
జ్యోతీరూపా పరాకారా యస్యా దేహోద్భవాశ్శివే ।
కిరణాశ్చ సహస్రం చ ద్విసహస్రం చ లక్షకమ్ ।
కోటిరర్బుదమేతేషాం పరా సంఖ్యా న విద్యతే ।
తానేవానుప్రవిశ్యైన భాతి లోకం చరాచరమ్ ।
యస్యా దేవ్యా మహేశాని భాసా సర్వం విభాసతే ।
తద్భాసారహితం కించిత్ న చ యచ్చ ప్రకాశతే ।
తస్యాశ్చ శివశక్తేశ్చ చిద్రూపాయాశ్చితిం వినా ।
అన్ధ్యమాపద్యతే నూనం జగదేతచ్చరాచరమ్ ।
తేషామనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరి ।
మధ్యే షష్ట్యుత్తరం తేఽమీ త్రిశతం కిరణాశ్శివే ।
బ్రహ్మాండం వ్యశ్నువానాస్తే సోమసూర్యానలాత్మనా ।

అగ్నేరష్టోత్తరశతం షోడశోత్తరకం రవేః
షట్త్రింశదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే
బ్రహ్మాండం భానయంత స్తే పిండాండమపి శాంకరి
దివా సూర్య స్తథా రాత్రౌ సోమో వహ్నిశ్చ సంధ్యయోః।
ప్రకాశయంతః కాలాం స్తే తస్మాత్కాలాత్మ కాస్త్రయః।
షష్ట్యుత్తరం చ త్రిశతం దినాన్యేవ చ హాయనమ్ ।
హాయనాత్మా మహాదేవః ప్రజాపతిరితి శ్రుతిః ।
ప్రజాపతిర్లోకకర్తా మరీచిప్రముఖాన్మునీన్ ।
సృజత్యేతే లోకపాలాన్ తే సర్వే లోకరక్షకాః
సంహారశ్చ హరాయత్తః ఉత్పత్తిర్భవనిర్మితా ।
రక్షా తు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః
నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తతే ।

ఈ శ్లోకములందు గల భావములను పైన వివరించడమైనది.

(2) త్రి కో ణ చ క్ర ము :— త్రికోణచక్రముయొక్క మూడు కోణములందును మూడు బిందువులుకలవు. మధ్యలో నొక బిందువు. మధ్యబిందువునే సర్వానందమయ చక్రముగా పైన వర్ణించుట జరిగినది. ఆప్రథమబిందువే ఓడ్యాణపీఠము. అందు విహరించు ద్వంద్వము కామేశ్వరీ కామేశ్వరులు.

ఆది ద్వంద్వము సృష్ట్యాదిని విలాసార్థముగా సత్వాది గుణభేదము ననుసరించి మూడు ద్వంద్వములుగా త్రికోణ బిందువులందు ప్రకాశించుచున్నది. ఉత్తరకోణస్థ బిందువు జాలంధరపీఠము. అందున్న ద్వంద్వము కామేశీ శ్రీమదూర్ధ్వనా

ధాత్మకము. వీరు సోమరాజ బీజాధిష్ఠాతలు. ఉమామహేశ్వరులు. దక్షిణకోణస్థ బిందువు పూర్ణగిరిపీఠము. అందున్న ద్వంద్వము వజ్రేశ్వరీ షష్ఠీశ దేవనాధాత్మకము. వీరు కామరాజ బీజాధిష్ఠాతలు. వీరు లక్ష్మీనారాయణులు. స్వాగ్రకోణస్థ బిందువు కామగిరిపీఠము. అందున్న ద్వంద్వము భగమాలినీ మిత్రేశ దేవనాధాత్మకము. వీరు వాగ్భవ బీజాధిపతులు. వీరు వాణీ హిరణ్యాగర్భులు. త్రికోణములును బంధూకపుష్ప బంధుకిరణములు. బ్రహ్మ బిందుర్మహేశాని వామాశక్తిర్నిగద్యతే। విశ్వంవమతి యస్మాత్తద్వామేతి పరికీర్తితా జ్యేష్ఠాతువైష్ణవీశక్తిః పాలయంతీజగత్త్రియం। తతోర్కాద్రీగ్రసన్తీతుక్రమేణ పరమేశ్వరి ఏవం బిందుత్రయం విద్ధి గుణత్రయ విభూషితం। ...... బిందుత్రయమహేశాని సర్వమేతత్ప్రతిష్ఠితం। (జ్ఞానార్ణవం)

ఈ త్రికోణచక్రము త్రికోణాకృతి. ఇది సర్వసిద్ధి ప్రదాచక్రము. నాదప్రకృతి కలది. దీని తత్త్వము గుణత్రయము. ఇట పూజప్రాదక్షిణము. కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలినీ కోణత్రయ దేవతలు. ఇట నున్నది అతిరహస్యయోగిని. చక్రేశ్వరి త్రిపురాంబ. ఈ దేవతాముద్ర సర్వబీజముద్ర. ముద్రాబీజము హ్స్రైం. స్థాయీభావము విస్మయము. అద్భుతమిచ్చటి రసము. శ్రీపరాదేవి శారీరకవిరాట్టునందు అవ్యక్తమహత్త్వాహంకారములే ద్వంద్వత్రయము. ఇచట వామావర్తముగా ఐం క్లీం సౌః బీజన్యాసము.

అవ్యక్త మహత్తత్త్వ అహంకారములను గురించి పైంగలోపనిషత్తునందు చక్కని వివరణము కలదు. అది యీ విధముగా నున్నది.

## అ వ్య క్త ము

శ్రుతి. "తస్మిన్ మరుశక్తికాస్థాణుస్ఫటికాదౌ, జలరౌప్యపురుషరేఖాదివల్లోహితశుక్లకృష్ణగుణమయీ గుణసామ్యాఽనిర్వాచ్యామూల ప్రకృతిరాసీత్ తత్ప్రతి బింబితం యత్తత్సాక్షి చైతన్యమాసీత్ సా పునర్వికృతిం ప్రాప్య సత్వోద్రిక్తా వ్యక్తాఖ్యావరణశక్తిరాసీత్. తత్ప్రతిబింబితం యత్తదీశ్వరచైతన్యమాసీత్. సస్వాధీనమాయః సర్వజ్ఞస్సృష్టిస్థితిలయానామాదికర్తా జగదంకురరూపో భవతి. తస్మిన్విలీనం సకలం జగదావిర్భావయతి ప్రాణికర్మవశాదేవ పటో యద్వత్ప్రసారితః ప్రాణికర్మ క్షయాత్పునస్తిరో భావయతి. తస్మిన్నేవాఖిలం విశ్వం సంకోచితపటవద్వర్తతే."

బిందుస్వరూపమైన పరమాత్మయందు స్పందనశక్తి కలిగినప్పుడు, మరుభూమియందు జలభ్రమవలె, స్థాణువున చోరభ్రాంతివలె, శుక్తియందు రజతభ్రమవలె, స్ఫటికమందు పురుషరేఖవలె, రజ్జువందు సర్పభ్రమవలె, దర్పణమునందు ప్రతిబింబమువలె, రక్తశుక్ల కృష్ణవర్ణములుగల సత్వరజస్తమో గుణ మిశ్రమమైన మూలప్రకృతి అంగనారూపముగా పరమేశ్వర పురోభాగమున అద్దమువలె ప్రాదుర్భవించినది. దానియందు ప్రతిబింబించిన ఆత్మప్రతిబింబము సాక్షియని పిలువబడుచున్నది. ఆ ప్రకృతి (ప్రకర్షేణ మహదాది కార్య కారణసంఘాతం కరోతీతి ప్రకృతిః - మహత్తత్త్వము మొద

లగు కార్యకారణ సంఘాతమును చేయునది) స్వరూపాంత రము చేకొని సత్వోద్రిక్తమై అవ్యక్తమని చెప్పబడుచున్న ఆవరణశక్తి యయినది. దీనియందు ప్రతిబింబించిన ప్రతి బింబము ఈశ్వర చైతన్యము. ఈ ప్రతిబింబముయొక్క ఉపా ధియే మాయ. ఈశ్వరునకు మాయ స్వాధీనమునం దున్నది. ఈశ్వరుడు సృష్టిస్థితిలయములకు ఆదికర్త. ఆయన జగదంకు రము. భావియందు వికసించెడు సకలజగత్తు ఆయనయందు యిమిడియున్నది. సంకోచవికోచములని చెప్పబడు సృష్టిస్థితి లయము లితని స్వాధీనమునం దున్నవి.

## మ హ త్త త్త్వ ము

శ్రుతి. "ఈశాధిష్ఠితావరణ శక్తితో రజోద్రిక్తా మహా దాఖ్యా విక్షేపశక్తిరాసీత్. తత్ప్రతిబింబితం యత్తద్ధిరణ్య గర్భ చైతన్యమాసీత్ సమహత్తత్త్వాభిమానీ స్పష్టాస్పష్ట వపుర్భవతి"

పైన వివరించిన ఈశ్వర ప్రతిబింబకారణశక్తి రజో గుణోద్రిక్తమై మహత్తత్త్వమను విక్షేపశక్తిగా నైనది.దాని యందు ప్రతిబింబము హిరణ్యగర్భుడు. ఇతడు మహత్తత్త్వాభి మాని. దృశ్యాదృశ్యస్వరూపము కలవాడు. (బ్రహ్మణోర వ్యక్తః అవ్యక్తాన్మహతః మహతో౽హంకారః, అహంకారా త్పంచ తన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని, పంచ మహాభూతేభ్యో౽ఖిలం జగత్.)

## అ హం కా ర ము

శ్రుతి. "హిరణ్యగర్భాధిష్ఠితవిక్షేపశక్తిత స్తమోద్రిక్తా ౽హంకారాభిధా స్థూలశక్తిరాసీత్. తత్ప్రతిబింబితం యత్త

ద్విరాట్ చైతన్యమాసీత్ స తదభిమానీ స్పష్టవపుస్సర్వస్థూల పాలకో విష్ణుః ప్రధానపురుషోఽభవత్."

హిరణ్యగర్భయుక్తమైన విక్షేపశక్తి తమోగుణో ద్రిక్తమై అహంకార మనబడు స్థూలశక్తిని ప్రభవించినది. దానియందున్న ప్రతిబింబము సర్వస్థూలపరిపాలుడైన విష్ణువు. ఆయన ప్రధాన పురుషు డయ్యెను.

3. అష్టకోణము : ఇది సర్వరోగహర చక్ర మను పేరు గలది. కకార ప్రకృతికము. పద్మరాగరుచిరము. అష్టవిధమైన ప్రకృత్యాత్మకము. ఇచట పూజ ప్రాదక్షిణం ఇట దేవత లెనిమిదిమంది కలరు. వారు వాగ్దేవతలు. వారి నామములు వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, కౌళినీ, సర్వేశ్వరీ. వారు సంధ్యారాగవర్ణమైన అరుణకాంతి దేహ ములవారు. (సిందూరరేణుశోణరుచః) ఇచట నున్న యోగి నులు రహస్య యోగినులు. చక్రేశ్వరిత్రిపురాసిద్ధాంబ. ముద్ర సర్వఖేచరీముద్ర. ముద్రాబీజము ఖ్ఫ్రేం. స్థాయీభావము హాసము. రసము హాస్యరసము. బీజన్యాసము సర్వత్ర స్వాగ్రకోణ మారభ్యలేఖన క్రమములో ప్రాదక్షిణముగా అం కం చం టం తం పం యం శం అను అష్టవర్గాది వర్ణములు.

శ్రీచక్రమే శరీరముగా నున్న సంవిద్రూపపరాశక్తి యొక్క మనోబుద్ధ్యహంకారములు పంచభూతములు వెరసి ఎనిమిదియు అష్టకోణస్వరూపావస్థితములు.

రెండవ ఆవరణ యగు త్రికోణమందుగల విష్ణువునుండి పంచభూతములు పుట్టిన వని శ్రుతిప్రమాణము.

శ్రుతి. "తస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ, తాని పంచతన్మాత్రాణి గుణా భవంతి."

4. అంతర్దశారము : ఇది సర్వరక్షాకర చక్రనామము కలది. దీని ప్రకృతి రేఫ. దీని తత్త్వము అగ్ని. ఇది జపా కుసుమ వర్ణకలితము. ఇచట పూజ వామావర్తము. ఇచట పదిమంది దేవతలున్నారు.వారు సర్వజ్ఞా సర్వశక్తి సర్వైశ్వర్య ప్రదాయినీ సర్వజ్ఞానమయీ సర్వవ్యాధివినాశినీ సర్వాధార స్వరూపా సర్వపాపహరీ సర్వానందమయీ సర్వరక్షాస్వరూ పిణి సర్వేప్సిత ఫలప్రదా అనువారు. ఇచట యోగినులు దేవతాగర్భములు. అనగా దేవతలు గర్భయోగినులు. చక్రేశ్వరి త్రిపురమాలిని. ముద్ర సర్వమహాంకుశముద్ర. ముద్రాబీజము క్రోం క్రోధనే స్థాయీభావము. రసము రౌద్రము. బీజన్యాసము వామావర్తముగా కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం అనునవి. శ్రీచక్రము శరీరముగా నున్న సంవిద్రూప పరదేవతయొక్క విషయవృత్తులే యిచట సర్వజ్ఞాదిశక్తి రూపములైనవి.

5. బహిర్దశారము : ఇది దశకోణాకృతి కలది. ఇది సర్వార్థసాధకచక్రము. ఏకారప్రకృతికలది. దశావతారాత్మక మైనది. ప్రభావితాద్భుత సింధుర మైనది. ఇచట పూజ ప్రాదక్షిణము. ఇచట పదిమంది దేవత లున్నారు. వారు సర్వసిద్ధిప్రదా సర్వసంపత్ప్రదా సర్వప్రియంకరి సర్వమంగళకరి సర్వకామప్రదా, సర్వదుఃఖ విమోచని సర్వమృత్యుప్రశమనీ సర్వవిఘ్ననివారిణి సర్వాంగసుందరి సర్వసౌభాగ్యదాయిని

అనువారు. ఇట యోగినులు కులోత్తీర్ణ యోగినులు. చక్రేశ్వరి త్రిపురా. ముద్రసర్వోన్మాదినీముద్ర. ముద్రాబీజము సః. జుగుప్స స్థాయీభావము. రసము బీభత్సము. బీజన్యాసము స్వాగ్రకోణమునుంచి ప్రదక్షిణముగా టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం అనునవి.

శ్రీచక్రము శరీరముగా నున్న సంవిద్రూప పరదేవత యొక్క జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము పదియు సర్వసిద్ధిప్రదాది దేవతలై నిర్మలమైన నేపథ్యాలంకారముతో భాసించుచున్నారు.

6. చతుర్దశారము : దీనికి సర్వసౌభాగ్యచక్రమని పేరు. ఈకారము దీని ప్రకృతి. ఇది చతుర్దశ భువనాత్మకమైనది. దాడిమీకుసుమసహోదరవర్ణము. పూజ వామావర్తము. ఇచట పదునాలుగుమంది దేవత లున్నారు. వారు సర్వసంక్షోభిణి సర్వవిద్రావిణీ సర్వాకర్షిణీ సర్వాహ్లాదినీ సర్వసమ్మోహినీ సర్వస్తంభినీ సర్వజృంభిణీ సర్వవశంకరీ సర్వరంజనీ సర్వోన్మాదినీ సర్వార్థసాధినీ సర్వసంపత్తిపూరణి సర్వమంత్రమయీ సర్వద్వంద్వక్షయంకరీ అనువారలు. యోగినులు కూడ వీరే. అనగా సంప్రదాయయోగినులు. వీరు దాడిమీకుసుమసమాన దేహచ్ఛాయ గలవారు. వీరు అంకుశపాశదర్పణ అమృతభరిత పాత్రలు హస్తములందు ధరించినవారు. చక్రేశ్వరి త్రిపుర వాసిని. ముద్ర సర్వవశంకరీముద్ర. ముద్రాబీజము బ్లూం. భయము స్థాయీభావము రసము భయానకము బీజన్యాసము స్వాగ్రకోణమునుంచి వామావర్తముగా పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం క్షం అనునవి.

శ్రీచక్రమే శరీరముగానున్న సంవిద్రూప పరదేవత యొక్క ఇంద్రియదశకమును అంతఃకరణచతుష్టయమును ఇచట దేవతాస్వరూపములు ధరించియున్నారు.

7. అష్టదళపద్మము:దీనికి సర్వసంక్షోభిణీచక్రమని పేరు. హకారప్రకృతి కలది. జపాకుసుమమిశ్రము. అష్టమూర్త్యాత్మక మైనది. పూజ సవ్యక్రమము. ఇచట నెనిమిది దేవతలున్నారు. వారు అనంగకుసుమా అనంగమేఖలా అనంగమదనా అనంగ మదనాతురా అనంగరేఖా అనంగవేగినీ అనంగాంకుశా అనంగ మాలినీ అనువారు. వీరు జపాకుసుమసంకాశమైన దేహకాంతి గలవారు. (తామ్రాంభోరహదళా ప్రభాశోణాః; విధృత కూర్పాసాః) వీరు అంకుశపాశనవరత్నకలశ నీలోత్పలములు ధరించినవారు. ఇచట దేవతలే గుప్తతరయోగినులు. చక్రేశ్వరి త్రిపురసుందరి. ముద్రసర్వాకర్షిణీముద్ర. ముద్రబీజముక్లీం. శోకము స్థాయీభావము. రసము కరుణ. ఇచట బీజాన్యాసము ప్రాదక్షిణముగా అం ఇం ఉం ఋం ౡం ఎం ఒం అం అను హ్రస్వస్వరము లెనిమిది.

శ్రీచక్రమే శరీరముగానున్న సంవిద్రూప పరదేవత యొక్క అవ్యక్తమహత్తత్త్వాహంకారములు భూత తన్మాత్రా పంచకము దేవతాస్వరూపములు ధరించిన విచట.

8. షోడశదళపత్రము : దీనికి సర్వాశాపరిపూరక చక్ర మనిపేరు.ఇది సకార ప్రకృతి కలది. చంద్రకలా స్వరూపాత్మక మైనది. శ్వేతవర్ణము కలది. అమృతరసస్రావము కలది. ఇచట పూజప్రాదక్షిణము. ఇచట పదునారుమంది (షోడశ) దేవత లున్నారు, వారు నిత్యకళలు. వారు కామాకర్షిణీ

బుద్ధ్యాకర్షిణీ అహంకారాకర్షిణీ శబ్దాకర్షిణీ, స్పర్శాకర్షిణీ రూపాకర్షిణీ రసాకర్షిణీ గంధాకర్షిణీ చిత్తాకర్షిణీ ధైర్యాకర్షిణీ స్మృత్యాకర్షిణీ నామాకర్షిణీ బీజాకర్షిణీ ఆత్మాకర్షిణీ, అమృతాకర్షిణీ శరీరాకర్షిణీ అనువారు. (తరుణశోకనదభాసః; కలాధరశిఖండాః వీరు గుప్తయోగినులు. అకారాది 16 స్వరములుగా నున్న షోడశదళములందు వీరు కలరు. చక్రేశ్వరి త్రిపురసుందరి. ముద్రసర్వవిద్రావిణీ ముద్ర. ముద్రాబీజముద్రీం. ఉత్సాహము స్థాయీభావము. రసము వీరము. ఇచట బీజన్యాసము అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఏం ఐం ఔం అం అః అనునవి.

శ్రీచక్రనే శరీరముగానున్న సంవిద్రూప పరదేవత యొక్క శరీరమందున్న పృథివ్యాది భూతపంచకము, షోడశ కలా రూపములైన షోడశస్వరములు, పంచదశనిత్యలు మహా నిత్య, యీ మూడుతత్త్వము లిచట దేవతలుగా నున్నారు. వీరు అంకుశపాశ అమృత భరిత కలశస్ఫటికములను ధరించిరి.

9. భూపురము: భూపురమునందు మూడు విభాగములు కలవు. శుక్లవర్ణముగల ప్రథమ భూపురమున వామాదిశక్తులు (వామాజ్యేష్ఠారౌద్రీ అంబికా పశ్యంతీ ఇచ్ఛా జ్ఞానక్రియా శాంతా) సర్వసంక్షోభిణ్యాది (సర్వసంక్షోభిణీ సర్వవిద్రావిణీ సర్వాకర్షిణీ సర్వవశంకరీ సర్వోన్మాదిని సర్వమహాంకుశ సర్వ ఖేచరి సర్వబీజ, సర్వయోని) నవముద్రాకారమును పొందినవి. రక్తవర్ణముగల మధ్య భూపురమున బ్రాహ్మీమాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి మహేంద్రి చాముండా మహా లక్ష్మి అను మాతృకలుకలరు. (హరిన్మాంకఖండకృత చూడాః)

శ్రీదేవి సమష్టిరూప సప్తధాతువులే మాతృకారూపమున నుండుట. పీతవర్ణముగల తృతీయ భూపురమున శ్రీవిద్యకు సంబంధించని మంత్రములు (సప్తకోటియందు మిగిలినవి) కమనీయమైన రూపములతో నున్నవి.

సమష్టి భూపురము చతురస్రాకృతి. ఇది త్రైలోక్య మోహన చక్ర మను పేరు గలది. లకారము దీని ప్రకృతి. తత్త్వము పృధివీతత్త్వము. పూజప్రాదక్షిణము. ఇచట దేవతలు అష్టసిద్ధులు. వారు అణిమాసిద్ధి లఘిమాసిద్ధి మహిమా సిద్ధి ఈశిత్వసిద్ధి వశిత్వసిద్ధి ప్రాకామ్యసిద్ధి గరిమాసిద్ధి ప్రాప్తి సిద్ధి అనువారు. వీరు శుక్లవర్ణము కలవారు. అంకుశ పాశపద్మ యుగ్మము ధరించినవారు. వీరు ప్రకటయోగినులు. ముద్ర సంక్షోభిణీ ముద్ర. ముద్రాబీజముద్రాం. చక్రేశ్వరి త్రిపురా దేవి స్థాయీ భావము రతి. రసము శృంగారము. ఇచట బీజన్యాసము వృత్తత్రయానికి పైన ఐం క్లీం సౌః అనునవి. ప్రాదక్షిణముగా అవరోహణక్రమమున ప్రథమ భూపురమున స్వాగ్రమునుంచి దిక్కులందు విదిక్కులందు ద్రాం ద్రీం క్లీం బ్లూం సః క్ష్మ్రౌం, సౌః ఐం అనునవి. ద్వితీయ భూపుర మున బ్రాహ్మ్యాదిగా బ్రాహ్మీ మాతృకా యైనమః - ఇత్యాది సర్వత్ర. తృతీయ భూపురమున ప్రాదక్షిణముగా అణిమాసిద్ధ్యైనమః మహిమాసిద్ధైనమః ఇత్యాది. నవావరణల వివరములు కామకలావిలాసమునందు విస్తారముగానున్నవి.

బీజన్యాస విషయమున ఆ యా ఆవరణలందు గృహ స్థులు ఆ యా బీజములను భావించుకొనవలెను. సన్న్యాసులు బీజన్యాసము చేసిన చక్రమునే పూజింపవలెను.

బీజాక్షర యుతం చక్రం యతీనాముత్తమోత్తమమ్
బీజాక్షర విహీనంతు గృహస్థానాం ప్రశస్తకమ్ అని మంత్ర రత్న వ్యాఖ్యానమున (పంచదశస్తరంగ) కలదు.

## అం త ర్యా గ ము

ఆరంభమున * మంత్రసంకేత చక్రసంకేత పూజా సంకేతములను తెలిసికొనుటకు గాను శుభాగమ కల్పసూత్ర ముల ప్రకారము (సమయమతము) వేదవిహితమైన విధాన ముతో శ్రీచక్రార్చన చేయవలెను. ఆ తరువాత ఉత్తమాధి కారము సంపాదించి అంతర్యాగము చేయవలెను. బాహ్య పూజాకలాపము వలన ఉపయోగములేదు. ఇది ఆగమసిద్ధ వచనమే. సనత్కుమారసంహిత యందిట్లున్నది.

* మంత్రసంకేత చక్రసంకేత పూజాసంకేతములు :- ఈ గ్రంథము చక్రసంకేత వివరణమే.

పూజాసంకేతము :— వేదవిహితమైన సమయదక్షిణాచారమున ప్రాథమికముగా చేయబడు బాహ్యపూజయందు కామేశ్వరీకామేశ్వరులు అది దేవతలు. వేదసమ్మతమైన కల్పసూత్ర ప్రకారము రాజోప చారయుక్తమైన పూజ దక్షిణహస్తముతో చేయవలెను. కలశ సామా న్యార్ఘ్య విశేషార్ఘ్యములనే పాత్రత్రయయుక్తమైన పూజ. క్షీరద్రవ్య ముతో విశేషార్ఘ్యపాత్రాసాదనము ("విప్రాః క్షోణిభుజో విశస్తదితరే క్షీరాద్యమధ్వాసవైః శ్రీచక్రేణ యజనం క్రమేణ విహితం తత్తత్కులీనైర్నరైః). కల్పసూత్ర ప్రకార బాహ్యపూజావిధానంలో ఈ క్రింది విభాగములున్నవి. యాగమందిర ప్రవేశము గురుధ్యానము సంకల్పము దేహరక్ష మందిరపూజ భూతశుద్ధి విఘ్నోత్సారణమ్ న్యాసములు పాత్రాసాదనము అర్ఘ్యవిధి గణపతి సూర్య విష్ణు శివపూజలు షడంగార్చనమ్ నవావరణపూజ ఆమ్నాయపూజ ధూపదీప

నైవేద్య నీరాజన మంత్రపుష్పములు కళాధ్యానమ్ హోమం బలి దానమ్, స్తోత్రమ్, సువాసినీపూజ సామయికపూజ తత్త్వశోధనమ్ పూజాసమర్పణ, శాంతి స్తవము.

పూజా విషయములు మరికొన్ని సమయమతమును గురించిన 4 వ అనుబంధమున కలవు.

మంత్రసంకేతము :—మంత్రమునకు హృదయకవచమాలా పంజర అష్టోత్తరశతనామస్తోత్ర సహస్ర నామస్తోత్రములను షడంగములు కలవని మంత్రమహోదధి మొదలగు గ్రంథములవలన తెలియు చున్నది. మంత్రములలో సాత్త్వికరాజస తామసములున్నవి. కాళీ శ్యామలవారాహీ ఛిన్నమస్తాధూమావతీ ప్రేతవారాహీ చండీతారావంటి మంత్రములు తామసములని పెద్దల భావము. గాయత్రి శ్రీవిద్య శివ పంచాక్షరి నారాయణాష్టాక్షరి వంటివి బ్రహ్మపరమైన సాత్త్వికములు (మననా తత్త్వరూపస్య దేవస్యామిత తేజసః । త్రాయతేసర్వభయ తస్స్మాన్మంత్ర ఇతీరితః) (మూడవ అనుబంధము చూడుడు).

పూర్ణగాయత్రి (చతుష్పద) మంత్రమునుంచి శ్రీవిద్య(కాదివిద్య) ప్రభవించినది. (త్రిపురోపనిషత్తు, త్రిపురతాపినీ) సనక, సనందన, సనత్కుమార వశిష్ఠ, శుకులు దీనికి పూర్వాచార్యులు. వారు అయిదు సంహితలు వేదసమ్మతముగా వెలయించినారు. తరువాత శ్రీ గౌడ పాదాచార్యులవారి సుభగోదయమ్ శ్రీ విద్యారత్న సూత్రాది శ్రీశంకర భగవత్పాదాచార్యులవారి సౌందర్యలహరి శ్రీవిద్యారణ్యులవారి సదా చారదీపిక ప్రమాణగ్రంథములు. శ్రీవిద్యకు (కాదివిద్య) స్వతంత్ర తంత్ర మని పేరు. శ్రీచక్రమునకు సిద్ధవ్రజమని వ్యవహారము. మంత్రచక్రములు రెండును ఉపనిషదర్థానుసారమై వేదసమ్మతమైనవి. సమయమార్గమున పూర్ణదీక్షా మంత్రములు 16. ('శుద్ధబాలాచ .... మహాపాదుకా'—వశిష్ఠసంహిత) అందు ముఖ్యమైనవి- బాలాపంచదశీ షోడశీమంత్రములు. దేవీ ఉపాసకులు శ్రీవిద్యాచక్రవర్తులు పన్నెండు గురు. మను చంద్ర కుబేర లోపాముద్రా మన్మథ అగస్త్య అగ్ని సూర్య ఇంద్ర షణ్ముఖ శివ దూర్వాసోఋషులు. (మనశ్చంద్రః

బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః
సా క్షుద్ర ఫలదా నృణాం ఐహికార్థైకసాధనాత్

బాహ్యపూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః
దిగంబరా ఇతిహాసాః కామికాస్తంత్రవాదినః
అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః
జీవన్ముక్తాశ్చ రంత్యేతే త్రిషు లోకేషు సర్వత ఇతి.

(4-వ అనుబంధము చూడుడు.)

అంతర్యాగ మని అంతరారాధన మని చెప్పబడుచున్న అంతరంగపూజ యనగా చతుర్విధైక్యషడ్విధైకానుసంధానము. ('అంతర్యాగ ఇతి ప్రోక్తాజీవతో ముక్తిదాయకః మునీనాం చ ముముక్షూణాం అధికారోఽత్ర కేవలమ్' - గౌతమీయ తంత్రమ్.)

---

కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః అగస్తిరగ్ని సూర్యశ్చ ఇంద్రస్కంద శ్శివస్తథా క్రోధ భట్టారకో దేవ్యా ద్వాదశామీ ఉపాసకాః). వీరు ప్రత్యేక ప్రత్యేకముగా పంచదశీ మంత్రము నేర్పరచినారు. కాబట్టి ద్వాదశవిధములైనది. ఇందు గాయత్రినుండి యేర్పడిన కాదివిద్యకు శివ విద్య యని పేరు. ఇదియే సమయమతము. ఇదిగాక హాదివిద్య సాదివిద్య అను భిన్నసంపుటీ భేదములు ప్రసిద్ధములు (సమయమతవివరము 4 వ అనుబంధమువందు).

వేద్యమైన శ్రీదేవికి వేదకమైన మంత్రమునకు అనగా విద్యాదేవతలకు మంత్రదేవతలకు అభేదమును గ్రహించుట మంత్ర సంకేతమును తెలియుట. మంత్ర విషయము లనంతమగుటచేత సంక్షిప్తముగా వ్రాయుట పొసగదు. మంత్ర మనగా నేమి ? మంత్రవివరము లెట్టి వన్నవిషయము చక్రమంత్ర సమైక్యవిషయము, 3 వ అనుబంధమునం దున్నవి.

చతుర్విధ ఐక్యానుసంధాన మనగా (1) పరదేవతా శ్రీచక్రముల కైక్యము, (2) శ్రీచక్రబ్రహ్మాండముల కైక్యము, (3) బ్రహ్మాండ పిండాండముల కైక్యము, (4) మాతృకాదేవతల కైక్యము. ఈ నాలుగు ఐక్యములను సంభావించి స్థిరముచేసి కొనవలెను. అనగా "తత్త్వమసి సర్వంఖల్విదం బ్రహ్మ." అను ఉపనిషద్వాక్యముల భావానుభవమే.

శ్రీచక్రమాతృక, శ్రీలలితాబ్రహ్మాండ పిండాండముల కార్యకారణ ధర్మములను పరస్పర సంబంధములను అవగాహన చేసికొని వాటియొక్క ధర్మసామ్యమువలన ఏకత్వభావనను సాధించుట షడ్విధైక్య మని చెప్పబడుచున్నది.

ఈ అంతర్యాగమందు సాధకుని శరీరమందున్న సప్త కమలములతో శ్రీచక్రమునకు ఐక్యము సాధింపవలెను. ఈ సామరస్యము మూడు విధములుగా నున్నది. సాధకుని శరీర మందున్న మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞ సహస్రారకమలములనే చక్రములతో (స్థూల చక్రములు) * ఐక్యమును భావించుట మొదటిది. భ్రూమధ్యము నుండి ఉన్మని పర్యంతముగల సూక్ష్మచక్రములతో ఐక్యమును భావించుట రెండవది. మూడవవిధమైన ఐక్యము కేవల సహస్రార బిందువునందే శ్రీచక్రసామరస్యమును సంభావించుట. ఇట్టి త్రివిధమైన సామరస్యమును భావించి భావనోపనిషత్తు ప్రకారము శ్రీదేవి పూజార్చనము చేయుట పూర్ణమైన అంతర్యాగ విధానము.

---

* మూలాధారాది ఆంతరకమలములను గురించిన వివరము లీ పూర్వ గ్రంథములందు కలవు.

సాధకుని శరీరమునకు శ్రీచక్రమునకు అభేదమును ప్రతి పాదించు శ్రుతు లున్నవి.

శ్రు। దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః ।
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్

శ్రు। "అష్టాచక్రానవద్వారా దేవానాం పూరయోద్వాత
స్యాగ్ం హిరణ్మయః కోశః స్వర్గోలోకో జ్యోతిషావృత."

దశారయుగ్మము ఏకచక్రమే కాబట్టి బిందువునుండి భూపురమువరకు శ్రీచక్రమునందు యెనిమిది చక్రము లున్నవి. నవకోణము లున్నవి. కామేశ్వర్యాది సకలావరణదేవతలకు శ్రీచక్రము నివాసస్థానము. బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులకు స్థానము సూర్యచంద్రాగ్నులకు స్థానము భాగ్యహీనులకు అలభ్యమైనది. అగమ్యమైనది. శ్రీచక్రమధ్యబిందువు

---

1. హంసోపనిషత్తు, 2. బ్రహ్మోపనిషత్తు, 3 ధ్యానబిందూపనిషత్తు, 4. అమృతానందోపనిషత్తు, 5. నృసింహపూర్వతాపినీ ఉపనిషత్తు, 6 మైత్రీఉపనిషత్తు, 7. యోగతత్త్వ ఉపనిషత్తు, 8. రామతాపినీ ఉపనిషత్తు, 9. శాండిల్యోపనిషత్తు, 10. వరాహోపనిషత్తు, 11. యోగకుండలిఉపనిషత్తు, 12. మండలబ్రాహ్మణఉపనిషత్తు 13. నాదబిందూపనిషత్తు, 14. దేవీభాగవతము. (VII - 35 XI - 8), 15. లింగపురాణము (I-IXXV), 16 అగ్నిపురాణము (XXIII), 17. శ్రీ శంకరభగవత్పాదకృత భగవద్గీతాభాష్యమ్, (VIII, 9, 10), 18. శ్రీ గౌడపాదాచార్యకృతసుభగోదయమ్, 19. శ్రీ శంకరభగవత్పాదకృత సౌందర్యలహరి, 20. విద్యారణ్యకృత శంకరవిజయము, 21. కామకలావిలాసము, 22. శివసంహిత, 23 నారదపంచరాత్రము, ఇవిగాక చాల తాంత్రిక గ్రంథములందును కలదు.

జ్యోతిర్మయకోశము. బిందుతత్త్వము స్వర్గలోకము. తేజోమయము. సాధకుని శరీరమున మూలాధారాది సహస్రారము వరకు గల సప్తకమలములును, లంబికాగ్రమందుగల కమలము కలసి యెనిమిది కమలములు. శ్రోత్రములు నాసిక మొదలగు నవి తొమ్మిది రంధ్రములు. ఇంద్రియపాలకులైన వరుణాది దేవతలకు నిలయము. అవిద్యాగ్రస్తులకు అంతర్ముఖ సాధన అలభ్యము. సహస్రారగతచంద్రమండలము తేజోమయము. ఆజ్ఞాచక్రమునుండి సహస్రారకమలమునంకు జ్యోతిస్సు లోకము కనుక నది స్వర్గనే.

పై సామ్యగుణములనుబట్టి ఈ శ్రుతి శ్రీ చక్రమునకు సాధకుని శరీరమునకు అభేదమును ప్రతిపాదించుచున్నది.

* సాధకులు శ్రీ చక్రమును తమ శరీరకమలములతో ఐక్యముగ భావించి సహస్రారబిందుస్థానమునందు మనోలయమును చేయవలెను. ఈ అనుసంధానమునకు ఋషిన్యాసాదులు, జపసంధ్యాదులు లేవని శ్రుతి చెప్పుచున్నది.

శ్రు. "నైతమృషివిదిత్వానగరం ప్రవిశేత్, యదివా ప్రవిశేత్, మిథో చరిత్వా ప్రవిశేత్ తత్సంభవస్యవ్రతమ్."

ఇంతేగాక, కామికనుండి "త్వగసృఙ్మాంసమేదోఽస్థి ధాతవశ్శక్తిమూలకాః" అని మొదలైన శ్లోకములు పైన వివరింపబడినవి. అందు సాధకుని శరీరమునకు (పిండాండము) బ్రహ్మాండమునకు ఐక్యము ప్రతిపాదింపబడినది.

---

* జ్ఞాతా స్వాత్మా భవేద్ జ్ఞానమ్ అర్ఘ్యమ్ జ్ఞేయం బహిస్స్థితం శ్రీ చక్ర పూజనం తేషాం ఏకీకరణమీరితమ్. 'తంత్రరాజ'

శరీరమందు స్థూలచక్రములుగా చెప్పబడుచున్న మూలాధారాదిచక్రముల స్థానము లిట్లున్నవి. మూలాధారము గుదస్థానము; స్వాధిష్ఠానము లింగస్థానము, మణిపూరకము నాభిస్థానము, అనాహతము హృదయస్థానము, విశుద్ధము కంఠస్థానము, ఆజ్ఞాచక్రము నిటలము, సహస్రారము బ్రహ్మరంధ్రము. (మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తుమేహనం నాభిస్తుమణిపూరాఖ్యం హృదయాం చాబ్జమనాహతం తాలుమూలం విశుద్ధాఖ్యం ఆజ్ఞాం చ నిటలాంబుజం సహస్రారం బ్రహ్మరంధ్రమ్ ఇత్యాగమదోవిదుః.)

**మూలాధారము:-** "ఆధారస్తు చతుర్దళోఽరుణరుచిర్వాసాంతకవర్ణాశ్రయః" మూలాధారము నాలుగు దళములుకలది. అరుణవర్ణము కలది. వ నుండి స వరకు (వ శ ష స) వర్ణములు కలది. ఈ చక్రమును గురించి లలితాసహస్రనామావళియందిట్లున్నది.

"మూలాధారైకనిలయా, (99 వ నామము) మూలాధారాంబుజారూఢా పంచవక్త్రా, అస్థిసంస్థితా, అంకుశాది ప్రహరణా, వరదాదినిషేవితా, ముద్గౌదనాసక్తచిత్తా, సాకిన్యంబా స్వరూపిణీ" (514 నుండి 520 వరకుగల నామములు) ఈ నామముల తాత్పర్యము క్రమముగా మూలాధారచక్రమున షరాదేవి బ్రహ్మనాడి యైన సుషుమ్నారూపమున కలదని, శ్రీదేవి మూలాధార కమలస్థితయై యున్నదని, ఆమెకు అయిదు ముఖములే కలవని, ఆమె అస్థులను ధాతువు యొక్క సత్తారూపముగ నున్నదని, ఆమె అంకుశాది ఆయుధములను ధరించినదని ఆమె వరద మొదలగు (వ శ ష స)

యోగినులచేత సేవింబడుచున్నదని, ఆమెకు పెసరపప్పు జీలకర్జతో నండిన పులగమునం దిష్టము కలదని, ఆమె మూలాధారచక్రేశ్వరి యైన సాకినీ రూపము ధరించిన దని తాత్పర్యము. మూలాధార మనగా ఆధారాది షట్కమలము లకు మూలమని భావము.

దీనిని గురించి యోగినీ హృదయమునం దిట్లున్నది.

శ్లో. మూలాధారస్థపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం।
ధూమ్రాభామస్థిసంస్థాం సృణిమపి కమలం పుస్తకం జ్ఞాన ముద్రాం। బిభ్రాణాం బాహుదండైస్సులలిత వరదాం పూర్వశక్త్యావృతాం తాం। ముద్గాన్నాసక్తచిత్తాం మధు ముదముదితాం సాకినీం భావయామి।

ఈ కమలము నాలుగు దళములు కలది. పృథివీ తత్త్వము కలది. రక్తవర్ణము కలది. అధిష్ఠానయోగిని ధూమ్రవర్ణము కలిగి పంచవక్త్రములు త్రినేత్రములు సృణి కమలము పుస్త కము జ్ఞానముద్రా ధరించుచున్నది. అస్థిధాతువునకు అధిపతి. ముద్గాన్న ప్రీతికలది. వ శ ష స అను శక్తులచేత సేవింపబడు చున్నది. ఐరావతము వాహనము. ఈమెపేరు సాకిని.

శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరిలో మూలధారచక్రస్థిత భగవతి నిట్లు వర్ణించిరి.

శ్లో. సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః।
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి॥

(కుండలినీశక్తి బిసతంతునిభముగా మూలాధారకమలము మధ్య నుండు నని తాత్పర్యము.)

శ్లో. తవాధారే మూలే సహస్యమయాలాస్యపరయా
నవాత్మనం మన్యే నవరసమహాతాండవనటం ।
ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్యదయయా
సనాథాభ్యాం జజ్ఞే సకలజననీ మజ్జగదిదమ్ ।

(ఆనందభైరవుడు సమయయను శ్రీదేవితోకూడి తాండవము చేయుచు జగదుత్పత్తి కారణు లగుచున్నారని తాత్పర్యము.)

ఆధారకమలమును గురించి 'షట్చక్రనిరూపణ' అను గ్రంథమునం దీ శ్లోకములు కలవు.

శ్లో. అథాధారపద్మం సుషుమ్నాస్యలగ్నం
ధ్వజాధో గుదోర్ధ్వం చతుశ్శోణ పత్రం।
అధోవక్త్రిముద్యత్ సువర్ణాభవర్ణైః
వకారాం తైర్యుతం వేదవర్ణైః।
అముష్మిన్ ధరాయశ్చతుష్కోణ చక్రం
సముద్భాసి శూలాష్ట కైరావృతం తత్ ।
లసత్ పీతవర్ణం తటిత్ కోమలాంగం
తదంతే సమాస్తే ధరాయాః స్వబీజమ్ ॥
చతుర్బాహు భూషం గజేంద్రాధిరూఢం
తదంకే నవీనార్కతుల్య ప్రకాశ ।
శిశుః సృష్టికారీ లసద్వేదబాహుః
ముఖాంభోజ లక్ష్మీశ్చతుర్భాగభేదః ॥

వసేదత్ర దేవీ చ డాకిన్యంభిఖ్యా
లసద్వేద బాహూజ్జ్వలా రక్తనేత్రా ।
సమానోది తానేక సూర్యప్రకాశా
ప్రకాశం వహంతి సదా శుద్ధబుద్ధేః ।

వజ్రాఖ్యా వక్త్రదేశే వసతి సతతం కర్ణి కామధ్యసంస్థం
కోణంతత్ త్రైపురాఖ్యం కదిదివవిలసత్ కోమలంకామరూపం।
కందర్పో నామ వాయుర్న్వి వసతి సతతం తస్య మధ్యేసమంతత్
జీవేశో బంధుజీవ ప్రకరమభిహసన్ కోటిసూర్య ప్రకాశః
తన్మధ్యే లింగరూపీ ద్రుతకనక కలాకోమలః పశ్చిమాస్యః
జ్ఞానధ్యానప్రకాశః ప్రథమకి సలయాకారరూపః స్వయంభుః ।
విద్యుత్ పూర్ణేందు బింబప్రకర కరచయస్నిగ్ధ సంతానహాసీ
కాశీవాసి విలాసీ విలసతి సరిదాన ర్తరూప ప్రకారః
తస్యోర్ధ్వే బిసతంతు సోదరలసత్సూక్ష్మాం జగన్మోహినీ
బ్రహ్మద్వారముఖం ముఖేన మధురం సంఛాదయంతీ స్వయమ్ ।.

శంఖావర్తనిభా నవీనచపలా మాలావిలాసాస్పదా
సుప్తా సర్వసమా శివోపరిలసత్సార్ధత్రివృత్తా కృతిః ।
కూజంతీకుల కుండలీచమధురం మత్తాలిమాలాస్ఫుటం
వాచం కోమలకావ్యబంధరచనా భేదాతిభేదక్రమైః ।
శ్వాసోచ్ఛ్వాసవిభజ్జనేన జగతాంజీవో యయాధార్యతే
సామూలాంబుజగహ్వరే విలసతి ప్రోద్దామ దీప్తావళిః ॥
తన్మధ్యేపరమా కలాతికుశలాసూక్ష్మాతి సూక్ష్మాపరా
నిత్యానంద పరంపరాతి విగలత్పీయూషధారాధరా॥

బ్రహ్మాండాది కటాహాన్తమఖిలం యద్భాసయాభాసతే
సేయం శ్రీపరమేశ్వరీ విజయతే నిత్యప్రబోధోదయా ।

ఈ పై శ్లోకముల భావమిట్లున్నది. "మూలాధార పద్మము నాలుగుదళములు కలది. ఇది సుషుమ్నాస్యముతో లగ్నమైయున్నది. ఇది లింగస్థానమునకు క్రిందుగా, గుద స్థానమునకు పైగానున్నది. దీని దళములు ఎఱ్ఱతామరవంటి రంగుకలవి. ఇది అధోముఖముగా నున్నది. వ శ ష స అను నాలుగు వర్ణములును నాలుగు దళములందు కలవు. (ఈ వర్ణములు దక్షిణావర్తముగా నున్నవని విశ్వసారతంత్రము చెప్పుచున్నది). ఈ కమలముయొక్క కర్ణికయందు చతురస్రా కారమైన పృథ్వీమండలము కలదు. ఆ మండలమునకు అష్ట దిక్కులందు అష్టశూలములు కలవు. ఆ మండలము పీతవర్ణము కలది (మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే । పీతవర్ణం పరివృతం చాష్టశూలైః కులాచలైః అని యామళము కులాచలము లనగా 'నీలా చలం, మందరంచ పర్వతం చంద్ర శేఖరమ్, హిమాలయం సువేలం చ మాల్యం చ సుపర్వతమ్, చతుష్కోణె వసేద్దేవి ఏతత్ సప్తకులాచలమ్'- అని నిర్వాణతంత్రము చెప్పినట్లు నీలాచలమందర, చంద్ర శేఖర హిమాలయ సువేలమాల్యములను కులాచలములు భూమియందున్నట్లు-ఈ శూలములు పృథ్వీమండల మందున్న వని భావము. కులాచలములు మహేంద్ర మలయ, సహ్య శుక్తిమాన్, ఋక్ష, వింధ్య, పారియాత్ర పర్వతములని శబ్దస్తోమమహానిధి. శూలములుండుట డాకిని భైరవి నిలయ మగుటవలన 'భైరవీ చక్ర సంస్థితిః' అని యామళవచనము)

ఆ మండలము తటిత్తువలె కోమలమైనది. దానివలెనే దాని యందున్న ధరాబీజమైన 'లం' ప్రకాశించుచున్నది. ('బీజం తన్మధ్యతశ్చైంద్రం పీతవర్ణం చతుర్భుజమ్, వజ్రహస్తం మహాబాహుమైరావతగజస్థితమ్' అని యామళము. ధరాబీజమే లం ఇంద్రబీజము. ఇది పీతవర్ణము కలిగి మహాబాహువులతో వజ్రాయుధము ధరించి - ఐరావతవాహనముపై నున్నదట.) ఆ ధరాబీజము నాలుగు బాహువులు కలిగియుండి - గజేంద్రమైన ఐరావతము నెక్కి తన అంకమునందు శిశురూపమైన బ్రహ్మనుధరించు చున్నదట. ఆ బ్రహ్మకు నాలుగు బాహువులు. ఆయన ముఖవర్చస్సు చతుర్విధములుగానున్నదట. ఆ బ్రహ్మ నవీనార్కతుల్యమైన ప్రకాశము కలవాడు. సృష్టికర్త(మూలాధారేధరా 'బీజంతద్బిందౌ బ్రహ్మణః స్థితిః। తదంకే శిశురూపస్య గజారూఢోఽమరాధిపః' అని యామళ వచనము.ఇచ్చట అమరాధిపునికి బ్రహ్మకును అభేదమే. "మంత్రార్ణ దేవతా ప్రోక్తా దేవతా మంత్రరూపిణి" అను మంత్ర శాస్త్ర వచనమును బట్టి, ధరాబీజమునకు ఇంద్రబీజమునకు భేదములేదు. కాబట్టి, బ్రహ్మకును అమరాధిపునికి అభిన్నత సాధ్యమగుచున్నది. నిర్వాణతంత్రమునందు 'ఇంద్రబీజం వరారోహే లింగస్య వామదేశకే।సుసిద్ధంబ్రహ్మసదనంనాదోపరిసుసుందరమ్।తత్రైవ నివసేద్ బ్రహ్మసృష్టికర్తా ప్రజాపతిః॥" అని కలదు. అనగా బ్రహ్మబిందువునందే నాదోపరిభాగమున బ్రహ్మనివాస మున్నదట. ఎడమ ప్రక్కగా నున్న దని మతాంతరము కలదు. 'శారదా' తిలకమున 'ఆధారాశ్చ విమ స్తత్ర మతభేదావనే కథా' అని చెప్పబడుటవలన మతభేదములు స్పష్టము. బ్రహ్మ

చేతులయందు వేదములు ధరించుటవలన వేదబాహు వని చెప్పిన ద్రాక భావము. వేద మనగా నాలుగు సంఖ్యాద్యోతక మగుటవలన బ్రహ్మకు నాలుగు బాహువు లున్నవని మరియొక భావము. భూతశుద్ధితంత్రమున "తదంకే చ చతుర్బాహుం రక్తవర్ణం శిశుం శివే। చతుర్వక్త్రం హంసపృష్ఠే బ్రహ్మాణం విద్ధిపార్వతి" అని యుండుటవలన నాలుగు బాహువులుగా చెప్పుట ప్రసిద్ధముగా నున్నది. 'ముఖాంభోజ లక్ష్మీశ్చతుర్భాగ భేదః' అను దానికి నాలుగు మోము లని భావింపవలెను. దీనికి పాఠాంతరముగా 'చతుర్భాగవేదః' అని చెప్పుచు - నాలుగు వేదముల యొక్క శోభ ముఖాంభోజ లక్ష్మికి సొంపు కూర్చుచున్న దని అర్థము చెప్పుచున్నారు. విశ్వతంత్ర సారమున "దండకమండలు ధరామక్షసూత్రాభయం తథా। ధ్యాయేత్తాం రక్తవర్ణాం చ బ్రాహ్మీం కృష్ణాజినోజ్జ్వలామ్॥" అని యుండుటవలనను, దుర్గా సప్తశతీ స్తోత్రమున శివశక్తులేకాస్త్రధారు లని చెప్పుటవలన, యామళమునందు "అభయ వరదహస్తం కుండికామక్షమాలం। దధతమమలభూషం చింతయే దాదిమూర్తిమ్" అని యుండుటవలన చతుర్బాహువులు సమర్థింపబడుచున్నవి. ఈ కమలమునందు డాకినీ నామము గల శక్తి కలదు. ఆమెకు సుందరమైన నాలుగు బాహువు లున్నవి. ఆమె నేత్రములు రక్తవర్ణము కలవి. ఆమె అనేక సూర్యుల తేజస్సు కలది. ఆమె శుద్ధ బుద్ధిని వహించియున్నది. ఆమె చక్రాధిష్ఠాత్రీ. ('డాకినీ రాకిణీ చైవ లాకినీ కాకినీ తథా। శాకినీ హాకినీ చైవ క్రమాత్ షట్ పంకజాధిపాః') - అని ప్రసిద్ధతాంత్రికవచనము. ఈ శ్లోకమునందు

చెప్పిన క్రమముగా షట్కమలములకు అధిష్ఠాత్రు లున్నారట, ఈ డాకినీ దేవతకు ధ్యానశ్లోకముగా.

రక్తాక్షీంరక్తవర్ణాం పశుజనభయకృచ్ఛూలఖట్వాంగహస్తాం
వామే ఖడ్గాందధానాం చషకమపి సుధాపూరితంచైకవక్త్రాం।
అత్యుగ్రాముగ్రదంష్ట్రామరికులమర్దనీం పాయసాన్నే ప్రసక్తాం
మూలాధారేఽమృతార్థే పరివృతవపుషం డాకినీం
చింతయేత్తామ్ ।

అని చెప్పుట కలదు. మరియు — 'సిందూరతిలకోద్దీప్త మజ్జ నాంచితలోచనామ్। కృష్ణాంబరపరీధానాం నానాభరణభూషితామ్' అనియు కలదు. ప్రవృత్తికాములవిషయములో ఆధార కమలదేవత లధోముఖు లనియు, నివృత్తిమార్గస్థులకు ఊర్ధ్వ ముఖు లనియు మాయాతంత్రమున కలదు. "తత్సర్వం పంకజం దేవి సర్వతో ముఖమేవచ । ప్రవృత్తిభాన చింతయా మధో నక్త్రాణి చింతయేత్। నివృత్తిభావమార్గేషు సదైవోర్ధ్వముఖా నిచ।" ఆధారకమలకర్ణికయందు, వజ్రనాడీముఖసమీపమున త్రైపురనామము కలిగి నిత్యప్రకాశమైన త్రికోణము కలదు. అది తటిత్తువలె నున్నది. దానికి కామరూపమని నామాంతరము. దానియందుకామవాయువు కామబీజము కలవు. అవి బంధుజీవ కుసుమవర్ణకలితములు. కామవాయువు కోటిసూర్య సమ ప్రకాశవంతమైనది. (త్రిపురాదేవతా నివాసమగుటవలన త్రికోణమునకు త్రైపురమని పేరు.) ఈత్రికోణము ఇచ్ఛాజ్ఞాన క్రియాత్మకమని గౌతమీయతంత్రము చెప్పుచున్నది. కామ వాయువునకు కందర్పుడని పేరు. ఇది అపానవాయు విభేదమే. కామబీజమనగా క్లీం. తంత్రరాజమున కకారము దేవీస్వరూప

మని చెప్పబడినది. శక్త్యానంద తరంగిణియందు కకారతత్త్వ కథనమునందు "తేషాం మధ్యేస్థితా దేవీసుందరీ పరదేవతా" అని కలదు. ఈత్రికోణమును "త్రికోణం తత్తువిజ్ఞేయం శక్తి పీఠం మనోహరం" అని చెప్పటకలదు. సంమోహన తంత్రమున 'వామా జ్యేష్ఠా తథారౌద్రీ త్రిరేఖాచ తదూర్థ్వతః" అని చెప్పి త్రికోణరేఖలను వర్ణించుట జరిగినది. ప్రాణము హృదయమునందును, అపానము గుదస్థానమునందు వసించునట. "కంఠదేశేనసేత్ ప్రాణోహ్యాపానో గుదమండలే", కావున కామవాయువు అపానవాయు విభేదమే మరియు ప్రాణ అపాన వాయువులు అన్యోన్యాకర్షణ చేసుకొను చుండునట. ఈ అన్యోన్య సంఘర్షణవలన దేహమునందు నిలచి యున్నవట. ఆ సంఘర్షణ నిలచిపోయినప్పుడవి నిష్క్రమించునట. "అపానః కర్షతిప్రాణం ప్రాణోఽపానంచ కర్షతి, రజ్జుబద్ధోయథాశ్యేనో-గతోఽప్యా కృష్యతేపునః । తథాచైతౌవి సంవాదే సంవాదే సంత్యజేదివత్," ఆత్రికోణ మధ్యమున లింగరూపి యగు స్వయంభువు కలడు. ఆయన కరగిన బంగారుయొక్క కాంతి కలవాడు. ఆయన అధోముఖుడై యున్నాడు. ఆయన జ్ఞాన ధ్యానములవల్ల తెలియబడును. క్రొత్తచిగురుటాకువంటి స్వరూపవర్ణములు కలవాడాయన. శీతలమైన విద్యుత్కిరణములవలె పూర్ణచంద్రునివలె మనోహరుడాయన. కాశీయందు నివసించుచున్నంతగా ఉత్సాహముకలదైనవాడాయన. నీటియందు శంఖాకృతిగల సుడిగుండమువలెనున్నాడు. (పశ్చిమ ముఖముగా స్వాయంభువైన లింగమున్నదని చెప్పు కాళీకులామృతవచన మిట్లు కలదు. "తత్రస్థితే మహాలింగః స్వయంభూః

సర్వదాసుఖీ, అధోముఖః క్రియావాంశ్చ కామబీజేన చలితః.” శాక్తానంద తరంగిణి యందీలింగమును గురించిన దిట్లు కలదు. “స్వయం భూలింగం తన్మధ్యే సరంధ్రం పశ్చిమాననమ్। ధ్యాయేచ్చ పరమేశాని శివం శ్యామలా సుందరమ్.” యామళమునం దీ లింగమును గురించిన దిట్లు కలదు. “మూలాధారే వసేత్ దివ్యం త్రికోణమతి సుందరమ్। తస్యత్రి రేఖామానీయ అధఊర్ధ్వ వ్యవస్థితమ్ । నీలతోయద మధ్యస్థాం తటిత్కోటి సమప్రభామ్।” స్వాయంభువైన లింగము కామబీజ చలితమగుటను గురించి కాళీకులా మృతమందిట్లు కలదు. “కింజల్కోపరి శృంగాటః సరంధ్రః సుమనోహరః । తత్రస్థితో మహాలింగః స్వయంభూః సర్వదాసుఖీ। అధోముఖః క్రియావాంశ్చ కామ బీజేనచలితః” - మరియు ప్రసిద్ధముగా “పూర్వోక్తా డాకినీ తత్రకర్ణికాయాం త్రికోణకమ్ । యన్మధ్యేవివరం సూక్ష్మం రక్తాభం కామబీజకమ్ । తత్రస్వయం భూలింగం చాధోముఖా లక్తకప్రభమ్” అని మతాంతరముకలదు) స్వయంభూలింగము పైన కుండలిని కలదు. అది బిసతంతునిభాకృతి కలది కుండలినీశక్తి జగన్మోహిని అనగా సర్వమోహిని (కూర్మపురాణమున శివుడు తనయందు సర్వశక్తి కలదనియు, అదిబ్రహ్మ మనియు, తనకు మాయ ప్రియమైనదనియు, దానివలన జగన్మోహనము జరుగు ననియు చెప్పినట్లుకలదు). కుండలిని తన ముఖముచేత బ్రహ్మద్వారమును కప్పియుంచుచున్నది. శంఖము చుట్టువర్తులము లున్నట్లు లింగముచుట్టును కుండలిని మూడున్నరచుట్లు చుట్టుకొని యున్నది. కుండలిని తేజస్సు విద్యుత్తువలెనున్నది. కుండలినిచేయుచున్న ఝుర్ఝురధ్వనిమత్తభృంగధ్వనివలె మధుర

మౌగానున్నది. [ఇది కుండలినీ యొక్క వైఖరీస్థితికి చిహ్నము]. కోమల కావ్యబంధు రచన చేయజాలినదై యున్నది. శ్వాసోచ్ఛ్వాసమూలముగా జీవరాశిని నిలుపుచున్నది కుండలిని. మూలమునందు దీప్తానళివలె కుండలిని వసించియున్నది. (శారదా తిలకమున-భిద్యమానాత్ పరిద్బిందో ఖ్యక్తాత్మాస్వోఽభవత్ ।తత్ప్రోక్య కుండలినీరూపం ప్రాణినాం దేహమధ్యగమ్। వర్ణాత్మనావిర్భవతి గద్యపద్యాదిభేదతః । అని కలదు. కాదిమత వివరము లో తంత్రరాజమునందిట్లు కలదు. 'స్వాత్మేచ్ఛాశక్తిభూతేన ప్రాణవాయు స్వరూపతః । మూలాధారే సముత్పన్నః పరాఖ్యోనాద ఉత్తమః ॥ సఏవచోర్ధ్వానాం నీతః స్వాధిష్ఠాన విజృంభితః । పశ్యంత్యాఖ్యా మవాప్నోతి తథైవోర్ధ్వం శనైః శనైః । అనాహతే బుద్ధితత్త్వసమేతో మధ్యమోఽభిధః । తథా తయో రూర్ధ్వగతో విశుద్ధా కంఠదేశతః। వైఖర్యాఖ్య స్తతః కంఠశీర్ష తాల్వోష్ఠ దంతగః। జిహ్వామూలాగ్రపృష్ఠస్థ స్తథా నాసాగ్రతః క్రమాత్ ॥ కంఠతాల్వోష్ఠకంఠస్థః కంఠోష్ఠద్వయ దంతధా । సముత్పన్న న్యక్షరాణిక మాదాదిక్షకావిధి । కుండలినీ ధ్యానమును గురించి ప్రసిద్ధముగా నిట్లున్నది. "ధ్యాయేత్ కుండలినీం దేవీం స్వయం భూలింగవేష్టినీమ్।శ్యామాం సూక్ష్మాం సృష్టిరూపాం సృష్టిస్థితిలయాత్మికాం । విశ్వాతీతాం జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వవాహినీమ్।" మరియు "ధ్యాయేత్ కుండలినీం దేవీ మిష్టదేవస్వరూపిణీమ్। సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ । నవయౌవనసంపన్నాం సర్వాభరణభూషితాం । పూర్ణచంద్రప్రభాం రక్తాం సదా చంచలలోచనామ్॥" అనియు

కలదు. కుండలిని రక్తవర్ణమైనదనియే భావింపవలెనని శాక్తానంద తరంగిణిచెప్పుచున్నది. శ్యామ యని శ్లోకమునం దున్నది వర్ణ సందర్భము కాదని పండితాభిప్రాయము. తాంత్రిక వాఙ్మయమున శ్యామ యనగా "శీతకాలే భవేదుష్ణా చోష్ణ కాలే చ శీతలా । ప్రతప్త కాంచనాభాసా శ్యామా స్త్రీ పరకీర్తితా " అని భావము. కంకాళమాలినీ తంత్రమున కుండలినీ వర్ణన గల శ్లోకము లిట్లున్నవి. "కోటిచంద్రప్రతీకాశాం పరబ్రహ్మస్వరూపిణీమ్। చతుర్భుజాం త్రినేత్రాం చ పరాభయ వరాంతథా । తథా పుస్తకవీణాంచధారిణీం సింహవాహినీమ్ । గచ్ఛంతీం స్వాసనాం భీమాం నానారూపధారాత్మికామ్ ।" స్వయంభూలింగముపైన చిత్కళాశక్తి కలదు. ఆమె పరమేశ్వరి కలారూపిణి. సృష్టి కార్యచతుర. సూక్ష్మ. నిత్యానంద పీయూషధారాధర. ఆమె తేజస్సుచేత బ్రహ్మాండకటాహము వెలుగుచున్నది. (ఆమె పరమేశ్వరి యని చెప్పుటకు దేవీ పురాణమున— "విచిత్ర కార్యకారణ చింతితాతి ఫలప్రదా। స్వప్నేంద్రజాలవల్లోకే మాయా తేన ప్రకీర్తితా " అని కలదు.) 'పరమ్ మీయతే అనన్యా ఇతి పరమా' అనగా సర్వమునకు పరమస్థితియం దున్నదని భావము. కలా అనగా కుండలినీ. అది నాదశక్తి. ఈ విషయము శాక్తానందతరంగిణియం దిట్లున్నది. 'కలాకుండలినీసైవ నాదశక్తిః శివోదితా.' మరియు "తస్యోపరిమనో ధ్యాయేత్ చిత్కలాం 'ఈ' సమాశ్రితామ్ । ప్రదీప కలికాకారాం కుంతల్యా భేదరూపిణీమ్" అని కలదు. కాళికాశ్రుతియందు "తస్యాః శిఖాయామధ్యేతు అథ ఊర్ధ్వవ్యవస్థితామ్। స బ్రహ్మ స శివః స్వరః స ఏవ

పరమేశ్వరః। స ఏవ విష్ణుః స ప్రాణః స కాలాగ్నిః స చంద్రమాః। ఇతి కుండలినీం ధ్యాత్వా సర్వపాపైః ప్రముచ్యతే” అని కలదు. దానిశిఖయందు మధ్యలో త్రివలయముల కూర్ధ్వముగా నాదరూపమైన పరమమైన కలాదేవి వ్యవస్థితమై యున్నదని లలితారహస్యకారుని అభిప్రాయము.

స్వాధిష్ఠానము:— “స్వాధిష్ఠానమనేక పైద్యుతినిభం బాలాంతి షట్పత్రకం” స్వాధిష్ఠాన మారుదళము లుగలిగి పీత వర్ణముతో ప్రకాశించుచున్నది. బ భ మ య ర ల అను వర్ణములు కలిగియున్నది. ఈ కమలమును గురించి లలితా సహస్ర నామావళి యందు దిట్లున్నది.

స్వాధిష్ఠానాంబుజగతా, చతుర్వక్త్ర మనోహరా, శూలాద్యాయుధ సంపన్నా, పీతవర్ణా, అతిగర్వితా మేదోనిష్ఠా, మధుప్రీతా, బందిన్యాది సమన్వితా, దధ్యాన్నాసక్త హృదయా, కాకినీరూపధారిణీ (504 నుండి 513 వరకు గల నామములు.) ఈనామముల తాత్పర్య మీావిధముగా నున్నది. శ్రీదేవి స్వాధిష్ఠానకమలమందు నివసించుచున్నది.ఆమె నాలుగు మోములతో మనోహరముగా నున్నది. ఆమె శూలము మొదలగు ఆయుధములను ధరించినది. పీతవర్ణము కలిగియున్నది. సర్వసంపదైశ్వర్య సౌందర్యముల అతిశయిత్వముచేత గర్వము కలిగియున్నది. ఆమె మెదడను ధాతువునందు బుద్ధికళారూప మున్న నున్నది ఆమెకు మధువునందు ఆసక్తికలదు. బందినీ మొదలగు (బ భ మ య ర ల) యోగినులామెను సేవించు చున్నారు. ఆమె పెరుగన్నమునందాసక్తి కలది. ఆమె స్వాధిష్ఠానచక్రేశ్వరి. యగు కాకినీరూపము ధరించినది.

ఈ చక్రమును గురించి యోగినీ హృదయము నందిట్లున్నది.

శ్లో. స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే
వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం
త్రిశిఖగుణ కలాపాభయా న్యాత్తగర్వాం ।
మేదోధాతు ప్రవిష్టామళి ముద
ముదితాం బందినీముఖ్య యుక్తాం
పీతాం దధ్యోదనేష్టామభిమత
ఫలదాం కాకినీం భావయామః ।

ఈ కమలము ఆరు దళములుకల జలతత్వకమలము. ఈ కమలమునకు అధిదేవత కాకిని. ఆమెకు నాలుగుముఖములు, మూడు నేత్రములు కలవు. హస్తములందు త్రిశిఖాద్యాది ఆయుధములు అభయము ధరించినది. అతిగర్వాతిశయముకలది. మేదోధాతువున కామె అధిష్ఠానదేవత. బభ మయ రల అను యోగినులచేత సేవింపబడుచున్నది. ఈమె వాహనము మొసలి. ఈమెకు పెరుగన్నమునందు ప్రీతి. స్వస్య అనగా తనకు (పరలింగమునకు) ఆధారము స్వాధిష్ఠానము.

శ్రీశంకర భగవత్పాదాచార్యులవారీ కమలమును గురించి సౌందర్యలహరి యందిట్లు వ్రాసిరి.

శ్లో. తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం
తమీళే సంవర్తం జనని మహతీం తాం చ సమయాం ।
యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రా యాదృష్టిః శిశిర ముపచారం రచయతి ॥

(అగ్నితత్త్వానికి ఉత్పత్తిస్థానమగు స్వాధిష్ఠానకమలమున ప్రళయాగ్ని జ్వాలారూపమైన శక్తి ధ్యానింపతగినది. ప్రళయాగ్ని శక్తులవలన జగములు భస్మములగును. భస్మములైన లోకములు మణిపూరక కమలమునందున్న భగవతి కృపచేత నిలుచుచున్నవని తాత్పర్యము.)

స్వాధిష్ఠానకమలమును గురించి 'షట్చక్రనిరూపణ' గ్రంధమునం దిట్లు కలదు.

శ్లో. సిందూర పూరరుచిరారుణపద్మమన్యత్
సౌషుమ్న మధ్యఘటితం ధ్వజమూలదేశే ।
అంగచ్ఛదైః పరివృతం తటిదాభవర్ణై
ర్వాద్యైః స బిందులసితైశ్చ పురందరాంతైః ॥

శ్లో. తస్యాంతరే ప్రవిలస్విశద ప్రకాశ
మంభోజమండలమధోవరుణస్యతస్య ।
అర్ధేందు రూపలసితం శర దిందు శుభ్రం
వంకార బీజమమలం మకరాధిరూఢమ్ ।

శ్లో.తస్యాంక దేశకలితో హరిరేవపాయాత్
నీలప్రకాశరుచిరశ్రియమాదధానః ।
పీతాంబరః ప్రథమయౌవనగర్వధారీ
శ్రీవత్సకౌస్తుభధరో ధృతవేదబాహుః ॥

శ్లో.అత్రైవభాతి సతతం ఖలు రాకిణీసా
నీలాంబుజోదర సహోదరకాంతిశోభా ।
నానాయుధోద్యతకరైర్లసితాంగలక్ష్మీ
ర్దివ్యాంబరాభరణభూషితమత్తచిత్తా ।

శ్లో. స్వాధిష్ఠానాఖ్యమేతత్సరసిజమమలంచింతయేద్యోమనుష్య
స్తస్యాహంకారదోషాదికసకలరిపుః క్షీయతే దక్షిణేన।
యోగేశః సోఽపి మోహాద్భుతతిమిరచయే భానుతుల్య
ప్రకాశో గద్యైః పద్యైః ప్రబంధై ర్విరచయతి సుధావాక్య
సందోహలక్ష్మీః ॥

స్వాధిష్ఠానము లింగమూలమునందు కలదు. అది సిందూరవర్ణము కలది. అది సుషుమ్న యందు కలదు. దానికి ఆరు దళములు కలవు. వాటియందు బ నుండి ల వరకు బిందు సంయుక్తము లైన వర్ణములు కలవు. (బ భ మ య ర ల). అవి విద్యుత్తువలె ప్రకాశించుచున్నవి. ఆ కమలమధ్యమున ప్రకాశించుచున్న వరుణమండలము కలదు. ఆ మండలము అర్ధచంద్రాకారముగ నున్నది. దానియందు మకరవాహనముపై 'వం' బీజము నిష్కళంకమై శారదేందు మండలమువలె ప్రకాశించుచున్నది. ('అంభోజ మంభసో భూమే శ్చతురశ్రంస వజ్రకమ్') అని శారదాతిలకమున నుండుటవలన జలమండలము పద్మాకృతి కలదని భావము. శ్రీ శంకరులు ప్రపంచసారమున 'అబ్జోపేతార్ధేందు మద్బింబామాప్యమ్' అని చెప్పిరి. వరుణ బీజ ధ్యానము గల శ్లోక మిట్లున్నది. "తదంతర్వరుణం బీజం శ్వేతం మకరవాహనమ్। పాశహస్తం తదంకే చ హరిం శ్యామం చతుర్భుజమ్"॥ వరుణబీజమైన వకారము యవర్గము లోనిది. (భూతలిపి మంత్రమునందు కులాకుల చక్రమునందు వరుణబీజ ప్రాముఖ్యము కలదు). వరుణబీజమునందు అంకస్థలమున నవయౌవనుడైన, శ్యామసుందరుడైన, పీతాంబరుడైన, చతుర్బాహుసుందరుడైన, శ్రీవత్సాంకితుడైన, కౌస్తుభధారి

మైన విష్ణువు కలడు. (శ్రీవత్సము ప్రకృతి చిహ్నమని అహిర్బుధ్న్య సంహితయందు (53,92) విష్ణుపురాణమునందు కలదు. కౌస్తుభమునుగురించికూడ వాటియందును 'విష్ణుతిలక'మందును కలదు. గౌతమీయతంత్రమునం దిట్లు కలదు. "కౌస్తుభం హృదయే రత్నం సూర్యాయుత సమప్రభమ్। తదధో వన మాలాం చ చంద్రాయుత సమప్రభామ్। కౌస్తుభోర్ధ్వే చ శ్రీవత్సం చంద్రాయుత సమప్రభమ్ ।" తంత్రాంతరమున "పాశహస్తం తదంకే చ హరిం శ్యామం చతుర్భుజమ్। శంఖ చక్రగదాపద్మధారిణం పీతవాససమ్ ।" అని కలదు. మరియు ప్రసిద్ధముగా 'పీతాంబరం శాంతమూర్తిం వనమాలా విభూషితమ్' అని కలదు). ఈ కమలమునందు 'రాకిణీ' కలదు. ఆమె నీలపద్మరుచిరాకృతి కలది. ఆమె హస్తములందు ఆయుధ ములను దివ్యాంబరభూషణములను ధరించియున్నది. ఆమె మత్తచిత్తము కలది. (రాకిణీ ధ్యాన శ్లోక మిట్లు కలదు. "శ్యామాం శూలాబ్జహస్తాం డమరుకరయుతాం తీక్ష్ణశంకాం వహంతీం। ఉగ్రాం రక్తత్రినేత్రాం కుటిల సవిల సద్దంతదంష్ట్రాం ప్రభాభిః । దీప్తాస్యాం దేవదేవీం ద్వితయకమలగాం రక్త ధారైకనాసాం । శుక్లాన్నే సక్తచిత్తా మభిమతఫలదాం రాకిణీం చింత యేత్తామ్")

మణిపూరకకమలము :—"రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం." రత్నప్రభారంజితమైన మణి పూరకకమలము పది దళములు కలది. డ మొదలు ఫ వరకు పదివర్ణములు కలది. ఈకమలమును గురించి లలితాసహస్ర నామావళి యం దిట్లున్నది.

"మణి పూరాబ్జనిలయా, వదనత్రయ సంయుతా, వజ్రాదికా యుధోపేతా, డామర్యాది భిరావృతా, రక్తవర్ణా, మాంసనిష్ఠా, గుడాన్న ప్రీతమానసా, సమస్తభక్తసుఖదా, లాకిన్యంబాస్వరూపిణీ" (495 నుండి 506 వరకు గల నామములు). ఆ నామముల తాత్పర్యమిట్లు కలదు.

"శ్రీదేవి మణిపూరక కమలమునందున్నది. ఆమెకు మూడు ముఖములు కలవు. ఆమెవజ్రాది ఆయుధములుధరించి యున్నది. డామరి మొదలగు (డ ఢ ణ త థ ద ధ న ప ఫ) పదిమంది యోగినులామెను సేవించుచున్నారు. ఆమె రక్త వర్ణము కలది. ఆమె మాంసధాతువు నందున్నది. ఆమెకు బెల్లముకలిపిన పులగము సందాసక్తి కలదు. ఆమె భక్తుల కందరకు సుఖము నిచ్చునది. ఆమె మణిపూర్వకచక్రేశ్వరి యగు లాకినీస్వరూపమును ధరించినది." మణివలె వికసించినది మణిపద్మము.

యోగినీ హృదయ మను గ్రంథము నందీకమల మిట్లు వర్ణింపబడినది.

శ్లో. దిక్పత్రే నాభిపద్మే త్రివదనవిల సద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తిం దంభోళిదండామభయమపి
భుజైర్ధారయంతీం మహోగ్రాం ।
డామర్యాద్యైః పరీతాం పశుజన
భయదాం మాంసధాత్వైక నిష్ఠాం
గౌడాన్నాసక్తచిత్తాం సకలసుఖ
కరీం లాకినీం భావయామః ॥

మణిపూరకము తేజస్తత్వ ప్రకృతికమైన కమలము.

నాభిస్థానమందున్నది. నీలవర్ణమైనది. పదిదళములుకలది. కమల దేవతలాకిని. ఆమె మూడు వదనములును దంష్ట్రలును కలది. రక్తవర్ణముకలది. శక్తిదంభోళి దండాది ఆయుధములు అభయము ధరించినది మహోగ్రమైనది. మాంసధాతువునకధిష్ఠాత. డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను శక్తులచే సేవింపబడుచున్నవి. వాహనము మేషము సకలజనులకు సుఖము నిచ్చునది.

శ్రీశంకరభగవత్పాదాచార్యులవారీ కమలమును సౌందర్యలహరియందిట్లు వర్ణించిరి.

"శ్లో. తటిత్త్వం తం శక్త్యా తిమిరపరిపంథిస్ఫురణయా
స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషమ్ ।
తమశ్శ్యామం మేఘం కమపి మణిపూరైకశరణమ్
నిషేవే వర్షంతం హరమిహిరతప్తం త్రిభువనమ్॥"

(మణిపూరకమందున్న మేఘము శ్యామవర్ణము కలది - అని ర్వాచ్యమైనది. అంధకారమునుపోగొట్టు మెరపుతోగూడినది. నానావిధరత్నాభరణములచేతచేయబడిన ఇంద్రధనుస్సుకలది. ప్రళయాగ్నిచే తప్తములైన ముల్లోకములను చల్లపరుచును).

మణిపూరకకమలమును గురించి 'షట్చక్రనిరూపణ' గ్రంథమునందిట్లు కలదు.

శ్లో. తస్యోర్ధ్వే నాభిమూలే దశదళలసితే పూర్ణమేఘప్రకాశే,
నీలాంభోజప్రకాశైరుపహితజఠరే డాదిఫాంతైః స
చంద్రైః । ధ్యాయేద్వైశ్వానరస్యారుణమిహిరసమం మండలం తత్ త్రికోణం । తద్బాహ్యేస్వస్తికాఖ్యైస్త్రిభిరభిలసితం తత్రవహ్నేః స్వబీజమ్ ।

శ్లో. ధ్యాయేన్మేషాధి రూఢంనవతపన నిభం వేదబాహూజ్జ్వ లాంగం, తత్క్రోడే రుద్రమూర్తి ర్నివసతి సతతం శుద్ధ సిందూరరాగః। భస్మాలిప్తాంగభూషాభరణసితవపుర్వృద్ధ రూపీ త్రినేత్రో లోకానామిష్టదాతాభయలసితకరః సృష్టి సంహారకారీ।

శ్లో. అత్రాస్తే లాకినీ మా సకలశుభకరీ వేదబాహూజ్జ్వలాంగీ శ్యామా పీతాంబరాద్యైర్వివిధవిరచనాలంకృతా మత్త చిత్తా। ధ్యాత్వైతన్నాభిపద్మం ప్రభవతినితరాంసుహృతా పాలనే వా, వాణీ తస్యాననాబ్జే నివసతి సతతం జ్ఞాన సందోహలక్ష్మీః

నాభిమూలమునందు దశదళములు గల మణిపూరక పద్మమున్నది. అది మేఘవర్ణము కలది. దాని దళములందు డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను వర్ణములు బిందుయుక్తములై నాదముతో నున్నవి. ఆ కమల కర్ణికయందు అగ్ని మండలమైన త్రికోణ మున్నది. అది ఎఱ్ఱని రంగు కలది. ఆ మండలమునకు వెలుపల మూడు ప్రక్కల స్వస్తికి చిహ్నములున్నవి. అగ్ని మండల త్రికోణమున అగ్ని బీజమైన 'రం' కలదు. అగ్ని బీజము మేషవాహనము కలిగియున్నది. అరుణవర్ణము కలిగియున్నది. చతుర్బాహువులు కలిగియున్నది. అగ్ని బీజముయొక్క అంక మున సిందూరరాగము కల రుద్రమూర్తి కలడు. ఆయన భస్మము పూసికొని తెల్లగా నున్నాడు. వృద్ధరూపధారి. త్రినేత్రుడు. ఆయన అభయవరముద్రలు ధరించినాడు. ఆయన సృష్టిసంహారకారి. ఇచ్చటనే లాకినీ కలదు. ఆమె సర్వశుభకరి. నాలుగు బాహువులుకలది. శ్యామవర్ణముకలది. పీతాంబరము

ధరించినది. వివిధాలంకరణములు కలది. మత్తచిత్తము కలది. సరస్వతీదేవి జ్ఞానమయ లక్ష్మీస్వరూపిణిగా లాకినీ ముఖాబ్జము నందు వసించుచున్నది.

అనాహతము :—"పత్రైర్ద్వాదశభిస్త్వ నాహతపురీ హైమీ కంఠాం ఠాన్వితాం" అనాహతపద్మము ద్వాదశదళ ములు కలది. హైమవర్ణము కలది. కం నుంచి ఠం వరకు గల పంద్రెండు వర్ణములు కలది. హృదయస్థానగతము. ఈకమల మును గురించి లలితాసహస్రనామావళి యందిట్లున్నది.

"అనాహతాబ్జనిలయా, శ్యామాభా, వదనద్వయా, దంష్ట్రోజ్వలా, అక్షమాలాది ధరా, రుధిర సంస్థితా, కాళ రాత్ర్యాది శక్త్యౌఘవృతా, స్నిగ్ధౌదనప్రియా, మహావీరేంద్ర వరదా, రాకిన్యంబాస్వరూపిణీ" (485 నుండి 494 వరకు గల నామములు). ఆనామముల తాత్పర్యమిట్లున్నది.

"అనాహతకమలమునందు శ్రీదేవికలదు. ఆమెశ్యామల మైన దేహకాంతి కలిగి పదునారేండ్ల వయస్సు కలదానివలె (పదునారేండ్ల వయస్సుగల స్త్రీ శ్యామ)యున్నది. ఆమెకు రెండు ముఖములు కలవు. ఆమె వరాహదంష్ట్రలనంటి దంష్ట్రలచేత ప్రకాశించుచున్నది. ఆమె జపమాలాదులను ధరించినది. ఆమె రుధిర మను ధాతువునందున్నది. కాళరాత్రి మొదలగు (క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ) పన్నెండు మంది యోగినులతో కలసియున్నది. ఆమెనేతితోకూడిన అన్నమునందు ప్రీతికలది. ఆమె మహావీరేంద్రులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును, అవస్థాత్రయమందు తురీయమున సంచరించు వారికి వరము నిచ్చునది. ఆమె అనాహతచక్రేశ్వరి యగు రాకినీస్వరూ

పమును ధరించినది. అనాహత మనగా తాడనములేక యే ధ్వని కలిగియుండునది.

ఈ కమలమును గురించి యోగినీ హృదయమం దిట్లు చెప్పబడినది.

శ్లో. హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసింతాం నంష్ట్రిసీం శ్యామవర్ణాం
చక్రం శూలం కపాలం డమరుమపి భుజైర్ధారయంతీం త్రినేత్రాం। రక్తస్థాం కాళ రాత్రి ప్రభృతిపరివృతాం స్నిగ్ధభక్తైకసక్తాం। శ్రీమద్వీరేశ్వర నంద్యామభిమత ఫలదాం రాకినీం భావయామః।

"అనాహత కమలము హృదయస్థాన మందున్నది. పండ్రెండు దళములు కలది. వాయుతత్త్వము కలది. హేమ వర్ణముకలది. ఇచట దేవత రాకినీ - ఆమె శ్యామవర్ణ. రెండు ముఖములు మూడు నేత్రములు కలది. చక్రశూలాద్యాయుధములు ధరించినది. రక్తధాతువున కధిష్ఠాత. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అను యోగినులచేత సేవింపబడుచున్నది. ఆమెస్నిగ్ధాన్నమునందు ప్రీతికలది. వీరేంద్రులచేత వందనములు చేయబడుచున్నది."

ఈ కమలమును శ్రీశంకర భగవత్పాదాచార్యుల వారు సౌందర్యలహరి యం దిట్లు వర్ణించిరి.

శ్లో. "సమున్మీలత్సంవిత్కమలమకరందైక రసికం
భజేహం సద్వంద్వం కిమపి మహసాం మానసచరం
యదాలాపాదష్టాదశ గుణితవిద్యాపరిణతి
ర్యదాధత్తే దోషాద్గుణమఖిల మద్భ్యః పయఇవ."

(అనాహతచక్రమున భగవతి శివశక్తి సంపుటితమైన యిరువది యారవతత్త్వముగనున్నది. ఆతత్త్వమును సేవించు వారు అష్టాదశవిద్యాలంకృతమాను లగుదురు. హంసద్వంద్వము నీటిని వేరుచేసి పాలను స్వీకరించు పగిది, ఆశివశక్తి తత్త్వము సాధకుల దోషములను పరిహరించి గుణములను గ్రహించును. అనగా సాధకులను పాపరహితులనుచేయును. సమయాచారులు అనాహతమున హంసమిథునము నుపాసింతురను విషయమును వివరించుటకు 'మహసాం మానసచరమ్' అని చెప్పబడినది. అగ్నిజ్వాలాస్వరూపుడైనపరమేశ్వరుడుస్వశక్తియగుశిఖినితో కలసి అనాహతచక్రమునందు దీపాంకురమువలె వెలుగు చుండును) ఈవిషయమును సుభగోదయ వ్యాఖ్యానమున భగవత్పాదాచార్యులవా రిట్లు వివరించిరి.

"శిఖజ్వాలా రూపస్సమయ ఇహాసైవాత్ర సమయా
తయోస్సం భేదో నేదిశతు హృదయాబ్జైకనిలయః "

అనాహత కమలమును గురించి 'షట్చక్రనిరూపణ' గ్రంథమునం దిట్లు కలదు.

శ్లో. తస్యోర్ధ్వేహృదిపంకజం సులలితం బంధూక కాంత్యుజ్జ్వలం
కాద్యైర్ద్వాదశవర్ణకైరుపహితం సిందూరరాగాన్వితైః।
నామ్నా నాహతసంజ్ఞకం సురతరుం వాఞ్ఛాతిరిక్త ప్రదం
వాయోర్మండల మత్ర ధూమసదృశం షట్కోణ శోభా
న్వితమ్।

తన్మధ్యేపవనాక్షరం చమధురం ధూమావలీధూసరం
ధ్యాయేత్పాణి చతుష్టయేనలసితం కృష్ణాధిరూఢంపరమ్।

తన్మధ్యేకరుణానిధాన మమలం హంసాఖ్య మీశాభిధం
పాణిభ్యాముభయం వరం చ విదధల్లోక త్రయాణామపి ।
అత్రాస్తే ఖలు కాకినీనవతటి త్పీతా త్రిణేత్రా శుభా
సర్వాలంకరణాన్వితా హితకరీ సమ్యగ్జనానాం ముదా ।
హస్తైఃపాశకపాల శోభ నవరాన్ సంబిభ్రతీచా భయం
మత్తా పూర్ణసుధారసార్ద్రి హృదయాకంకాళ మాలాధరా।
ఏతన్నీరజ కర్ణికాంతర లసచ్ఛక్తిస్త్రికోణాభిధా
విద్యుత్కోటి సమానకోమల వపుః సాస్తేతదాంతర్గతః।
బాణాఖ్యః శివలింగ కోఽపి కనకాకారాంగ రాగోజ్జ్వలో
మాలా సూక్ష్మవిభేద యుఙ్మణిరివ ప్రోల్లాస లక్ష్మ్యాలయః॥
ధ్యాయేద్యో హృది పంకజం సురతరుంశర్వస్య పీఠాలయం
దేవస్యానిలహీన దీపకలికా హంసేన సంశోభితమ్ ।
భానోర్మండల మండితాంత రలసత్కింజల్క శోభాధరం
వాచామీశ్వర ఈశ్వరోఽపి జగతాం రక్షావినాశోక్షమః॥

హృదిస్థానమున అనాహతః మలముకలదు. అదిబంధూక వర్ణము కలది. దానికి ద్వాదశదళములు కలవు. దళములందు క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ ట ఠ బిందు యుక్తముగా నున్నవి. ఆ వర్ణములు సిందూరాకృతి కలవి. అనాహతము కల్పవృక్షమువంటిది. కోరికనుమించి ఫల మిచ్చునది. ఆ కమల మునకు కర్ణికయందు షట్కోణాకృతిగా వాయుమండలమున్నది. అది ధూమాకృతి కలది. (అనాహత మనగా శబ్దబ్రహ్మ మిచ్చట వినవచ్చునని యర్థము. రెండు వస్తువుల తాకిడిలేని శబ్దమిది. 'శబ్దబ్రహ్మమయః శబ్దోఽనాహతస్య త్రదృశ్యతే । అనాహతాఖ్యం పద్మం తన్మునిభిః పరికీర్తితమ్') వాయు

మండలమున వాయుబీజమైన 'యం' కలదు. అది ధూమ సంకలితమువలె నున్నది. దానికి నాలుగు బాహువు లున్నవి. కృష్ణసారము వాహనము అంకుశము ఆయుధము. వాయు బీజముయొక్క అంకమున హంసవంటి (హంస విషయము ఋగ్వేదమున హంసవతి ఋక్కునందు కలదు. అదేపాదము యజుర్వేదమున X, 24, XII, 14 కలదు. హంస యనగా ఆదిత్యు డని సాయణభాష్యము హం=గతి). ఈశుడు కలదు. ఆయన కరుణానిధి. అమలుడు. ఆయన లోకత్రయమునకు అభయవరముద్ర లిచ్చుచున్నాడు. (శివునికి సర్వత్ర మూడు నేత్రము లున్నవని భావింపవలయును). ఇచట కాకినీ దేవత కలదు. ఆమె నవతటిత్పీత వర్ణము కలది మూడు నేత్రములు కలది. శుభము లిచ్చునది. ఆమె సర్వాభరణములు ధరించి నది. ఆమె చతుష్పాణి పాశకపాలములను వరముద్రను ధరించి నది. సుధారసార్ద్రమైన హృదయము కలది. కంకాళమాల ధరించినది. ఈ కమలకర్ణికయందు త్రికోణస్వరూపశక్తి కలదు. ఆ త్రికోణ మధ్యమున 'బాణ' మను శివలింగము కలదు. ఆ శివలింగము బంగారుఛాయ కలది. ఆ లింగమునకు శిరస్సు నందు చంద్రరేఖవలె విభేదము (ఛిద్రం) కలదు. (త్రికోణాంతర్బాణ లింగం కనకాభరణై ర్యుతమ్। చంద్రార్థమస్తకం దేవం మధ్యే రక్తాంబుజం పరమ్). మరియు లింగమునకు శిరస్సున ...వు కలదు. (తన్మధ్యేఽష్టదళం తత్ర కల్పతరుంతథా। ...నం చారు చంద్రాతప విరాజితమ్). ఈ పద్మము ...వంటివి. జీవాత్మస్థానము. ఈశ్వరనిలయము. దీని ...లు సూర్యకిరణ సదృశ్యములు.

విశుద్ధ కమలము:— "దృష్ట్వారం స్వరషోడశైశ్చ సహితం జ్యోతిర్విశుద్ధాంబుజం" - విశుద్ధకమలము శ్వేతవర్ణము కలిగి పదునారు దళములతో పదునారు స్వరములతో (అ ఔ) నున్నది. ఈ కమలమును గురించి లలితాసహస్రనామావళి యం దిట్లు కలదు.

"విశుద్ధి చక్రనిలయా, రక్తవర్ణా, త్రిలోచనా, ఖట్వాంగాది ప్రహరణా, వదనైకసమన్వితా, పాయసాన్నప్రియా, త్వక్స్థా, పశులోక భయంకరీ, అమృతాదిమహాశక్తి సంవృతా, డాకినీశ్వరీ" (475 నుండి 481 వరకు గల నామములు). ఈ నామముల తాత్పర్య భావమి ట్లున్నది. శ్రీదేవి విశుద్ధకమలము నందున్నది. ఆమెర క్తవర్ణముకలది. ఆమెకు మూడు నేత్రములు కలవు. ఆమెఖట్వాంగము మొదలగు ఆయుధములు ధరించినది. ఆమెకు ముఖ మొక్కటే కలదు. ఆమెకు పాయసాన్నమునందు ప్రీతి కలదు. ఆమె చర్మమను ధాతువునందు చేతనారూపముగ నున్నది. ఆమె పశువుల వంటివారగు (అన్యోఽసావన్యోఽహమస్మీతి నసవేదయథాపశురితి) స్వరూపజ్ఞాన హీనులగు వారికి భయంకరముగా నున్నది. అమృతాది (అఅః ఆఆః ఇఈ ఉఊ ఋౠ, ఌౡ ఏఐ ఓఔ) షోడశయోగినులచేత సేవింపబడు చున్నది. ఆమె విశుద్ధచక్రేశ్వరియగు డాకినీరూపము ధరించినది" పరమాత్మనలోకన మార్గమున జీవునకు శుద్ధి కలిగించు స్థానము కావున విశుద్ధమైనది.

ఈ కమలమును గురించి యోగినీహృదయము నందిట్లు చెప్పబడినది.

శ్లో. గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతవర్ణాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగ ఖడ్గౌ త్రిశిఖమపిమహాచర్మ సంధార
యంతీం । వక్త్రేణైకేన యుక్తాం పశుజనభయదాం
పాయసాన్నైక సక్తాంత్వక్స్థాం వందేఽమృతాద్యైః
పరివృతవపుషాం డాకినీం వీరవంద్యాం ।

కంఠస్థానమందున్న విశుద్ధకమలము పదునారుదళములు కలది. ఆకాశతత్త్వకమలము. ఇచట దేవత డాకిని. ఆమె శ్వేత వర్ణ. త్రినేత్ర. ఏకవదనము కలది. ఖట్వాంగాది ఆయుధములు ధరించినది. స్వరూపజ్ఞానహీనులకు భయంకరమైనది. పాయసాన్న ప్రీతి కలది. త్వక్ (చర్మ) ధాతువున కధిష్ఠానదేవత. అఅః ఆఆః ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అను శక్తులచేత సేవింపబడుచున్నది. శ్వేతగజవాహనము కలది.

శ్రీశంకరభగవత్పాదాచార్యులవారీ కమలమును సౌందర్యలహరి యం దిట్లు వర్ణించిరి.

శ్లో. విశుద్ధౌతే శుద్ధస్ఫటిక విశదంవ్యోమ జనకం
శివం సేవేదేవీమపి శివసమాన వ్యవసితాం ।
యయోఃకాంత్యా యాంత్యా శశికిరణ సారూప్య సరణే
ర్విధూతాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతి ॥

(చంద్రకిరణ పానముచేత చకోరపక్షి సంతోషించునట్లు సాధకుడు చంద్ర ప్రభవంటి విశుద్ధచక్రము నందున్న శివాశివుల కాంతిచేత అజ్ఞానమును తొలగించుకొని సంతుష్టిని పొందును.)

విశుద్ధ కమలమును గురించి 'షట్చక్రనిరూపణ' మను గ్రంథమం దిట్లు కలదు.

శ్లో. విశుద్ధాఖ్యం కంఠే సరసిజమమలం ధూమధూమ్రావభాసం
స్వరైః సర్వైః శోణైర్దళపరిలసితైర్దీపితం దీప్తబుద్ధేః ।
సమాస్తేపూర్ణేందుప్రథితతమనభోమండలంవృత్తరూపం
హిమచ్ఛాయా నాగోపరిలసితతనోః శుక్లవర్ణాంబరస్య ।

శ్లో. భుజైః పాశాభీత్యంకుశవరలసితైః శోభితాంగస్యతస్య
మనోరం కేనిత్యం నివసతిగిరిజాభిన్న దేహో హిమాభః ।
త్రినేత్రః పంచాస్యో లలితదశభుజో వ్యాఘ్రచర్మాంబరాఢ్యః
సదా పూర్వో దేవః శివ ఇతి చ సమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః॥

శ్లో. సుధాసింధోః శుద్ధా నివసతి కమలే సాకినీ పీతవస్త్రా
శరం చాపం పాశం సృణిమపి దధతీ హస్తపద్మైశ్చతుర్భిః।
సుధాంశోః సంపూర్ణం శశపరిరహితమండలం కర్ణికాయాం
మహామోక్షద్వారంశ్రియమభిమతశీలస్య శుద్ధేంద్రియస్య।

శ్లో. ఇహ స్థానే చిత్తం నిరవధి వినిధాయాత్మసంపూర్ణ యోగః
కవిర్వాగ్మీ జ్ఞానీ స భవతి నితరాం సాధకః శాంతచేతాః।
త్రికాలానాం దర్శీ సకలహితకరో రోగశోకప్రముక్త
శ్చిరంజీవీ జీవీ నిరపధివిపదాం ధ్వంసహంసప్రకాశః ।

కంఠస్థానమున విశుద్ధచక్రము కలదు. అది అమలమైనది. ధూమధూమ్రావభాసమైనది. దానియొక్క పదునారు దళములందు స్వరములు (అచ్చులు) కలవు. (హంసదర్శనమువలన జీవునికి శుద్ధి ప్రాప్తించును కావున విశుద్ధ చక్ర మని పేరు. "విశుద్ధిం తనుతే యస్మాత్ జీవస్య హంసలోకనాత్। విశుద్ధం పద్మమాఖ్యాతమాకాశాఖ్యం మహత్పురమ్ ।") ఆకమలము యొక్క కర్ణికయందు వృత్తరూపముగా వియన్మండలముకలదు.

ఆమండలము పూర్ణచంద్రునివలె ప్రకాశించుచున్నది. తెల్లని గజముపై నెక్కి ఆకాశబీజమైన 'హం' వసించుచున్న దా మండలమున. ఆ బీజము శుక్లవర్ణమైనది. ("తదూర్ధ్వే షోడశ దళం పంకజం ధూమ్రవర్ణకం। యుక్తం శోణైః షోడశభిః స్వరైర్బిందు విభూషితైః। ఆ రక్తకింజల్కయుతం వ్యోమ మండలమండితమ్।") శారదాతిలకమున 'తత్తద్భూత మండలాని విదుస్స్వదాః' అనగా ఆ యా భూతముల వర్ణములే ఆ భూతమండలముల కుండు నని చెప్పబడినది. భూతశుద్ధితంత్ర మున 'తదంతర్వ్యోమబీజం చ శుక్లం హైమగజస్థితమ్' అని కలదు.) ఆ బీజముయొక్క చతుర్బాహువులందు, పాశాంకుశ ములు, వర అభయముద్రలు కలవు. ఆ బీజముయొక్క అంకము నందు హిమరుచిరమైన తనువు గలవాడు, త్రినేత్రముల వాడు, పంచముఖములవాడు, దశహస్తములవాడు, వ్యాఘ్ర చర్మాంబరము కలవాడు, గిరిజాదేవితో అభిన్నమైన దేహము వాడు ప్రసిద్ధమైనవాడు సదాశివుడు కలడు. (గిరిజార్ధదేహు డగుటవలన సగము శరీరము శుక్లముగా సగము శరీరము సువర్ణవర్ణముగా నున్నదని భావము. "శుక్లాంబరేణ సంవీతం తత్ర దేవం సదా శివమ్। గిరిజాభిన్నదేహార్ధం రౌప్యహైమ శరీరకమ్।" అని ప్రసిద్ధవచనము. నిర్వాణతంత్రమున విశుద్ధ చక్రవిషయముగా "యంత్రమధ్యే చ వృషభం మహాసింహా సనం తతః తస్యోపరి సదా గౌరీ దక్షభాగే సదాశివః। త్రినేత్రః పంచవక్త్రశ్చ ప్రతివక్త్రే త్రిలోచనమ్। విభూతి భూషితాంగశ్చ రజతాచలసోదరః వ్యాఘ్రచర్మధరో దేవః ఫణిమాలావిభూషితః" అని కలదు. సదాశివుని ఆయుధము

లను గురించిన అన్యత్ర శ్లోక మీవిధముగా నున్నది. "శూలం టంకకృపాణవజ్రదహనాన్నా గేంద్ర ఘంటాంకుశాన్ । పాశా భీతికరం దధానమమితా కల్పోజ్జ్వలాంగం భజే।") ఆ కమల మందున్న శక్తి సాకిని. ఆమె సుధాసింధువుకన్న పరిశుద్ధమైనది. ఆమె పీతాంబరములు ధరించినది. ఆమె నాలుగు చేతులందు శర, చాప, పాశ, సృణి అను ఆయుధములను ధరించినది. ఆమె కర్ణికయందున్న చంద్రమండలమునం దున్నది. ఆ చంద్ర మండలము శశరహితమైన పూర్ణచంద్రునివలె నున్నది. శుద్ధేంద్రియములుగల యోగాభిలాషుల కది మోక్షద్వారము వంటిది. (సాకినీ ధ్యానశ్లోక మీ విధముగా నున్నది.

శ్లో. దేవీం జ్యోతిస్స్వరూపాం త్రిణయనలసితాం పంచవక్త్రాభి రామాం। హస్తైః పద్మైశ్చ పాశం సృణిమపి దధతీంపుస్తకం జ్ఞానముద్రామ్ । ధ్యాయేత్ కంఠస్థపద్మే నిఖిలపశుజనోన్మా దినీమస్థిసంస్థాం। దుగ్ధాన్నే ప్రీతియుక్తాం మధుమదముదితాం సాకినీం సాధకేంద్రః ॥

ప్రేమయోగతరంగిణి అను గ్రంథమున 'తత్రాస్తే సాకినీశక్తిః సుధాంశోర్మండలేశుభే' అని కలదు. మరియు ప్రసిద్ధముగా— "కర్ణికాయాంత్రికోణాఖ్యం పూర్ణచంద్రం తు చింతయేత్ । హైమాభం గజమారూఢమాకాశం తత్ర చింతయేత్ । శుక్లాంబరేణసంవీతం తత్ర దేవం సదాశివమ్" అని కలదు. ఆత్మస్వరూపాభిజ్ఞుడైన యోగీశ్వరుడే పద్మగత సంలగ్న మానసుడైనాడని భావము. అతడు కవి, వాఙ్మ యజ్ఞాని యగుచున్నాడు. పరమశాంతి కలవాడగుచున్నాడు.

అతడు భూతభవిష్యద్వర్తమాన కాలముల నెరిగినవాడగు చున్నాడు. విశ్వశ్రేయస్సును సాధించు వాడగుచున్నాడు. అతనికి శోకముగాని రోగములుగాని లేవు. అతడు చిరంజీవి యగుచున్నాడు. హంసవలె విపత్తులను ధ్వంసముచేయగలవాడగుచున్నాడు. (శ్రీశంకరాచార్యులవా రిట్లు చెప్పిరి. 'పూర్ణ బోధాత్మనాతిష్ఠతి పూర్ణాచల సముద్రవత్' అనగా సంపూర్ణముగా ఆత్మజ్ఞానము కలవాడు గంభీరసముద్రజలములవలె నిశ్చలముగా నుండునని భావము. ఇది విశుద్ధ చక్రసాధకునికి వర్తించును. శ్రీమద్భగవద్గీతయం దీ భావములు కలవు. పదు నాఱన అధ్యాయము 2, ౩ శ్లోకములు,

శ్లో. "అహింసా సత్యమక్రోధస్త్యాగః శా న్తిరపైశునమ్ ।
దయా భూ తేష్వలోలు ప్తం మార్దవం హ్రీరచాపలమ్ ॥
తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।
భవ న్తి సంపదం దై వీమభిజాతస్య భారత ॥"

దైవాసురసంపద్విభాగయోగము— రోగశోకప్రముక్తుడగు సందర్భముగా శ్రీచక్రమునందున్న సర్వరోగహర చక్రముతో సామరస్య మున్నదని సంభావింపవలసి యున్నది. నిరవధిక విపత్తులను ధ్వంసము చేయుట యనగా మంచిచెడ్డల నుండి విపత్తు లుద్భవించుచుండును కదా. సాధకుడు సహస్రారము క్రిందుగా నున్న హంసయయి—అంతరాత్మయయి — విపత్తుల నన్నిటిని అధిగమించి మోక్షద్వారమును తెరపించుకొనునని అభిప్రాయము. సహస్రకమల కర్ణికాంతర్గత హంస రూపాత్మనా యని తాత్పర్యము. సహస్రారమునకు క్రిందుగా ద్వాదశదళ పద్మము హంస నివాస మని మతాంతరము).

ఆజ్ఞాకమలము :—"హాంక్షేత్యక్షరపద్మపత్ర యుగళం రతోన్నపమాజ్ఞాపురీ" భ్రూమధ్యమందున్న కమలమాజ్ఞా చక్రము. రెండుదళములు కలది హం క్షం వర్ణములుకలది. ఈ కమలమును గురించి లలితాసహస్ర నామావళి యందిట్లుకలదు.

"ఆజ్ఞాచక్రాబ్జ నిలయా, శుక్లవర్ణా, షడాననా, మజ్జా సంస్థా, హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా, హరిద్రాన్నైకరసికా, హాకినీ రూపధారిణీ" (521 నామము నుండి 527 వ నామము వరకు). ఈ నామముల తాత్పర్యభావ మిట్లున్నది. "శ్రీదేవి ఆజ్ఞాచక్రము నందున్నది. ఆమె శ్వేతవర్ణము కలది. ఆరుముఖములుకలది. ఆమెమజ్జా అనుధాతువునందు సత్తా రూపముగ నున్నది. హంసవతి మొదలగు (హం క్షం) శక్తుల చేత సేవింపబడుచున్నది. పసుపుకలిగిన అన్నముల పులి హోరయందు ప్రీతికలది. ఆమె ఆజ్ఞాచక్రేశ్వరియగు హాకినీ రూపమును ధరించినది. ఇతి కర్తవ్యతా విషయమైన పరమేశ్వరి యాజ్ఞ తెలియు స్థలము కావున ఆజ్ఞాచక్రమైనది.

ఈ కమలమును గురించి యోగినీ హృదయమందిట్లు వర్ణింపబడి యున్నది.

శ్లో. "భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే శుక్లవర్ణాం
కరాబ్జై ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక కమలాక్ష
మాలాం కపాలం। షడ్వక్త్రాధారమధ్యాం త్రినయన
లసితాం హంస వత్యాది యుక్తాం। హరిద్రాన్నైకసక్తాం
సకలశుభకరీం హాకినీం భావయామః" ॥

భ్రూమధ్య మందున్న ఆజ్ఞాకమలమునకు దళములు రెండు. ఇచట దేవత హాకిని. ఆమె శుక్లవర్ణముకలది. ఆరుముఖ

ములు మూడు కన్నులుకలది. జ్ఞానముద్రాదికమును ధరించు చున్నది. ఈమె మజ్జాధాతువునకధిపతి. ఆమెకు హారిద్రాన్నమునందు ప్రీతి. హ క్ష అను శక్తులచేత సేవింపబడు చున్నది. వాహనము ఓంకారము. మనస్తత్వము కలది.

ఈ కమలమును సౌందర్యలహరియందు శ్రీశంకరభగవత్పాదాచార్యులవారిట్లు వర్ణించిరి.

శ్లో. తవాజ్ఞా చక్రస్థం తపనశశికోటి ద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా
యమారాధ్యన్ భక్త్యా రవిశశిశుచీనామ విషయే
నిరాలోకే లోకే నివసతి హి భాలోకభువనే ॥

(ఆజ్ఞాచక్రమునందు భగవతియొక్క సాయుజ్యమును పొంది ప్రసిద్ధుడై పరిమితిలేని సూర్యచంద్రులయొక్క కాంతిని ధరించి పరయను చిత్తుచేత సేవింపబడిన పార్శ్వములు కలవాడైన పరముడైన శంభునకు వందనము.)

ఆజ్ఞాకమలమును గురించి 'షట్చక్రనిరూపణ' మను గ్రంథమం దిట్లున్నది.

శ్లో. ఆజ్ఞానాం బుజం తద్ధిమకరసదృశం ధ్యానధామప్రకాశం
హక్షాభ్యాం వైదలాభ్యాం పరిలసితవపుర్నేత్ర పత్రం
సుశుభ్రం ।
తన్మధ్యే హాకినీ సా శశి సమధవలావక్త్రషట్కం దధానా
విద్యాం ముద్రాం కపాలాం డమరుజపవటీం బిభ్రతీ
శుద్ధాచిత్తా ।

శ్లో. ఏతాత్పద్మాంత రాలే నివసతి చ మనః సూక్ష్మరూపంప్రసిద్ధం
యోనౌతత్కర్ణికాయా మితరశివపదంలింగచిహ్నప్రకాశం;

విమ్యన్త్వాలావిలాసం పరమకుల దం బ్రహ్మసూత్ర ప్రబోధం
వేదానామాదిబీజంస్థిరతరహృదయశ్చింతయే త్తత్త్రమేణ।

శ్లో. ధ్యానాత్మా సాధకేంద్రో భవతి పరపురే శీఘ్రగామీ ము
నీంద్రః। సర్వజ్ఞః సర్వదర్శీసకలహితకరఃసర్వశాస్త్రార్థవేత్తా।
అద్వైతాచారవాదీ విలసతి పరమాపూర్వసిద్ధి ప్రసిద్ధో
దీర్ఘాయుః సోఽపికర్తా త్రిభువనభవనే సంహృతౌ పాలనే చ।

శ్లో. తదంతశ్చక్రేఽస్మి న్నివసతి సతతం శుద్ధ బుద్ధ్యాంతరాత్మా
ప్రదీపాభజ్యోతిః ప్రణవవిరచనారూపవర్ణప్రకాశః।
తదూర్ధ్వే చంద్రార్ధ స్తదుపరివిలసద్బిందురూపమకార
స్తదూర్ధ్వం నాదోఽసౌ జలధవళసుధాధారసంతానహాసీ।

శ్లో. ఇహస్థానే లీనే సుసుఖసదనే చేతసి పురం
నిరాలంబా బధ్వాపరమగురుసేవా సువిదితామ్।
తదభ్యాసాద్యోగీ పవనసుహృదాం పశ్యతి కణాన్
తత స్తన్మధ్యాంతః ప్రవిలసితరూపానపి సదా।

శ్లో. జ్వలద్దీపాకారం తదను చ న వీనార్కబహుళ
ప్రకాశం జ్యోతిర్వా గగనధరణీ మధ్యమిళితం।
ఇహస్థానే సాక్షాద్భవతి భగవన్ పూర్ణవిభవే
ఽవ్యయః సాక్షీ వహ్నేః శశిమిహిర యోర్మండల ఇవ।

శ్లో. ఇహస్థానే విష్ణో రతుల పరమామోదమధురే
సమారోప్య ప్రాణం ప్రముదితమనాః ప్రాణనిధనే।
పరం నిత్యం దేవం పురుషమజమాద్యం త్రిజగతాం
పురాణం యోగీంద్రః ప్రవిశతి చ వేదాంతవిదితమ్॥

ఆజ్ఞాచక్రము (గుర్వాజ్ఞ లభించుస్థానము—ఆజ్ఞా సంక్ర

మణం తత్ర గురో రాజ్ఞేతి కీర్తితమ్) భ్రూమధ్యమునం దున్నది. (తాలుకంఠం ప్రవిశ్యోర్ధ్వం భ్రూయుగాం తే సితం శుభమ్ । ద్విదళం హక్షవర్ణాభ్యాం మనోధిష్ఠితమంబుజమ్।) అదిచంద్రుని వలె నున్నది. దానికి రెండు దళములు కలవు. ఆ దళములందు హ క్ష అను వర్ణములు కలవు. (సమ్మోహన తంత్రమున ఈశ్వర కార్తికేయ సంవాద మిట్లున్నది. "ఆజ్ఞాచక్రం తదూర్ధ్వేతు శుక్లం ద్విదళమండితమ్ । కర్పూరహక్షలసితం మనోఽధిష్ఠిత రంజితమ్ ।") ఆ అక్షరములుకూడ శుక్లవర్ణముకలిగి యున్నవి. ఈ చక్రము ధ్యానస్థానమై యున్నది. ఈ పద్మమునందు చంద్రునివంటి ఆరు ముఖములతో హాకినీశక్తి వసించుచున్నది. ఆమెకు ఆరు చేతులు. పుస్తకము, కపాలము, డమరు, జప మాలా, అభయవరముద్రలను ధరించుచున్నది.ఆమె శుద్ధచిత్త. (హాకినీ ధ్యానశ్లోక మిట్లున్నది. "మజ్జస్థాం శుక్లవర్ణాం డమరు కరయుతా మక్షసూత్రం కపాలం। విద్యాం ముద్రాం దధానాం త్రిణయనవిలసద్రక్తవక్త్ర్యయుక్తాం। హారిద్రాన్నే ప్రసక్తాం మధుమదముదితాం శుక్లపద్మోపరిస్థాం దేవీం దేవేంద్రరత్నకర మధుముదితాం భావయేత్ హాకినీం తామ్" ).

ఈ కమలమునందు సూక్ష్మరూపముతో మనస్సు నివ సించుచున్నది. అది ప్రసిద్ధమైనది. కమలముయొక్క కర్ణిక యందుగల యోనియందు శివుడు లింగరూపమున ఇతర నామ ధేయముతో నున్నాడు ('కాలం తరతి ఇతి ఇతరః' మరియు భూతశుద్ధితంత్రమున 'తదంతస్థేతరం లింగం స్ఫటికాభం త్రిలో చనమ్' అని కలదు. మనస్సు లక్షణముగా "సంకల్పం వికల్పం చకుర్వాణతు మనోభవేత్" అందురు.) ఈశివుడు విద్యున్మాల

వలె ప్రకాశించుచున్నాడు. ఈకర్ణికయందు వేదాది బీజమైన ప్రణవము ('వేదాదౌస్వరః ప్రోక్తో' - తైత్తిరీయమ్) కూడ వసించుచున్నది. ఈ ప్రణవమునందు పరమమైన శక్తి నివసించుచు, తన తేజస్సువలన బ్రహ్మసూత్రమని చెప్పబడు నాడిని (చిత్రిణి) తోపింప జేయుచున్నది. (కర్ణికాయాం త్రికోణస్థ మాత్మానం ప్రణవాకృతిమ్। జ్వలద్దీపనిభం చోర్ధ్వంనాద రూపం మనోహరమ్। బిందుర్మకరరూపంచ తదూర్ధ్వంమానసాలయః) ఇచ్చట వసించుచున్న దేవతలను క్రమముగా ధ్యానింపవలెను. ఈ కమలమందు ధ్యానించు సాధకుడు-జ్ఞానాత్ముడగును. పరకాయ ప్రవేశశక్తి కలవాడగును. సర్వజ్ఞుడై సర్వదర్శియైన మునీంద్రుడగును. శాస్త్రవేత్తయగును. సర్వశుభకారియగును. బ్రహ్మద్వైతి యగును. సిద్ధపురుషుడగును. దీర్ఘాయు వగును. సృష్టిస్థితిలయశక్తి యుక్తుడగును. (శ్రుతి 'పాదోఽస్య విశ్వభూతాని' - 'తదిదం సర్వంబ్రహ్మ' - మరియు 'అహం దేవోన చాన్యోస్మి బ్రహ్మైవాస్మిన శోకభాక్' - మరియు 'పాదోస్య సర్వభూతాని, సర్వంఖల్విదం బ్రహ్మ' - చాందోగ్యము) ఈ చక్రమునగల త్రికోణమునందు ప్రణవమునకు ఆధారమైన (అ+ఉ) అక్షరములుకలవు. అది శుద్ధబుద్ధి రూపము దానిపైన అర్ధచంద్రము. దానిపైన బిందురూపముగా మకారము. దాని పైన జలధవళమైన నాదము. యోగి యోని ముద్రచేత బంధించుకొని (నిరాలంబపురిని) అనగా పరమగుర్వనుగ్రహము చేత బంధించు విధానమెఱిగి చేతస్సును లయముచేయును.అది ఆనందనిలయము. ఆపైని ప్రకాశించుచున్న అగ్నికణములను చూచును. (బాహిరము నుండి మనస్సును పెకలించు యోని

ముద్రానిర్వచన మిట్లున్నది. "తతో గుహ్యే వామపాద పార్ష్ణింతు వినివేశయేత్ । తస్యోపరి మహాదేవి దక్షిణాంఘ్రిం నివేశయేత్ । ఋజుకాయ శిరోగ్రీవః కాక చంచుపుటేన చ । ఆకార్ణేన బహిర్వాయుం జఠరం పరిపూరయేత్ । అంగులీభిః దృఢం బధ్వాకరణాని సమాహితః అంగుష్ఠాభ్యాముభే శ్రోత్రే తర్జనీభ్యాం విలోచనే నాసారంధ్రే చమధ్యాభ్యా మన్యాభిర్వ దనందృఢమ్।బుద్ధ్వాత్మప్రాణమన సామేకత్వంతస్మనుస్మరన్। ధారయే న్మారుతం సమ్యక్ యోగోఽయం యోగివల్లభః।ఇవి శారదాతిలకమున (XXV) నున్నవి. మొదటి శ్లోకము సిద్ధాసనమును చెప్పుచున్నది. యోనిముద్ర సిద్ధాసనము నందుండి ప్రదర్శింపవలెను. ఈశ్లోకముల భావమిట్లున్నది. ఎడమకాలి మడమతో గుదస్థానమును మూయుము. కుడికాలును యెడమ కాలుపై నుంచుము. నిటారుగా శరీరము, గ్రీవము, శిరస్సు సూటిగా నుండునట్లు కూర్చుండుము. కాకిముద్రతో అనగా కాకి ముక్కువలె మూతిపెట్టి గాలిపీల్చిలోపల పూరించవలెను. బొటనవ్రేళ్ళతో చెవిరంధ్రములను, చూపుడు వ్రేళ్ళతో కన్నులను, మధ్యవ్రేళ్లతో ముక్కురంధ్రములను మిగిలిన వ్రేళ్ళతో నోటిని మూయవలెను. పీల్చినగాలిని కుంభించి నిలుపవలెను. ఇంద్రియములను విసర్జించి మంత్రపురశ్చరణ చేయవలెను. అప్పుడు మనోప్రాణముల ఐక్యము సమకూడును. ఈ యోని ముద్రవలన మనస్సు ఏకాగ్రతపొందునని-అనగా హంస యను జీవాత్మ అంశయగు ప్రాణముయొక్క ప్రభావమునవలన మనస్సు సంచలించుచుండును. హంసను నిరోధించినప్పుడు ఏకాగ్రత సిద్ధించు నని శ్రుతి చెప్పుచున్నది. "ఏవంహంస వశాన్మనోవి

చర్యతే ఇతస్తతో విషయేషు భ్రమతి తత్సంయమేన మనః సంయమో జయతే" - ఈ శ్లోకమునందు బంధించుట యను దానికి ఖేచరీముద్ర యని భావము కావచ్చును. ఖేచరీముద్ర వలన కూడ ఏకాగ్రతలభించును. ఖేచరీముద్రను గురించిన హఠయోగప్రదీపికశ్లోకమిట్లున్నది. "చిత్తం చరతి ఖే యస్మాత్ జిహ్వా చరతి ఖే తతః। తేనేయం ఖేచరీముద్రా సర్వసిద్ధ సమస్కృతా"-చిత్తముఖే (బ్రహ్మమునందు) చరించునట్లును-వచింపబడిన శబ్దము ఆకాశమునందు చరించునట్లును చేయగల దీముద్ర. సిద్ధనమస్కృత. ఖ యనగా ఆకాశము, బ్రహ్మము, భ్రుకుటి యని అర్థము లున్నవి. ఖేచరమైన చిత్తము మనస్సునుండి వేరుచేయబడి లౌకికవిషములనుండి లాగివేయ బడినప్పుడు ఉన్మనియగును ఉత్ = వినా మని = మనస్సు అనగా మనస్సు లుప్తమైనదని భావము. "ఉన్మన్యాపహితో యోగీస యోగీఉన్మనీవినా." గురూపదేశము లేకగమ్యస్థానముచేరుటకు వీలులేదని పరమగురుసేవా సువిదితమనిచెప్పబడినది 'గురూప దేశాత్ తద్గమ్యం నాన్యథా శాస్త్రకోటిభిః' - అని కలదు.) తరువాత యోగి దీపాకృతిగల జ్యోతినిచూచును. అది ఉదయ కాల సూర్యునివలె నుండును. భూనభస్సుల మధ్య ప్రకాశించు చుండును. (భూనభస్సులనగా మూలాధార మందున్న ధరా మండలమునుండి సహస్రారము వరకుననిభావము.)పూర్ణవిభవ ముతో భగవానుడిచట సాక్షాత్కరించును. (భగవాను డనగా పరమశివుడు. సాక్షాత్కరించు ననగా స్వయముగా వర్తించు నని. పూర్ణవిభవ మనగా - స్వాత్మాని పరిపూర్ణః సృష్టికర్తృ త్వాద్యశేషయోగ్యతా రూప విభవోయస్య; విభవోఽనంత

సృష్టిప్రపంచసముదాయపూర్ణః సర్వవ్యాపకత్వేనఃస్థితఃతాదృశవిభవో యస్మాదితి - శ్రుతి "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతా. జీవంతి, యత్ ప్రయ న్త్యభి సంవిశంతి") ఆయన అవ్యయుడు - అగ్ని చంద్ర సూర్యమండలములందున్నట్లే ఆయన ఇచ్చట కలడు. (నిర్వాణతంత్రమునందు శివుడుస్థితినిగురించి చెప్పబడిన శ్లోకములిట్లున్నవి.'ఏతత్పద్మస్యోర్ధ్వదేశేజ్ఞానపద్మం। పత్రద్వయ సమాయు క్తం పూర్ణచంద్రస్య మండలమ్॥ శంభుబీజం హి తన్మధ్యేసాకారం హంసరూపకం ॥ ఏవం హంసోమణిద్వీపే తస్యక్రోడే పరఃశివః। వామభాగే సిద్ధకాళీసదానంద స్వరూపిణీ॥ఉత్తరాదిమతేఽ త్రైవచణకాకార రూపిణీ। సృష్టింకరోతి భూతాని అత్రస్థిత్వాసనాతనీ'॥). ఇచట పరమామోదమధురమైన విష్ణుస్థాన మున్నది. యోగీంద్రుడు ప్రాణోత్క్రమణ కాలమున ప్రాణమిచ్చట నిలుపును. అందువలన పరమనిత్యమైన అనాదియైన, వేదాంతవేద్యుడైన పురుషుని చేరుచున్నాడు.(విష్ణుస్థానమున ప్రాణారోపణ ప్రకారమిట్లు కలదని వేత్తలు చెప్పుచున్నారు. యోగిప్రాణ వియోగకాలమును తెలిసికొని బ్రహ్మమునందు లీనముకాబోవు చున్నానని ఆనందించినవాడై యోగాసనమునం దాసీనుడ డయి, కుంభకముచేత వాయువును నిరోధించును. హృదయమందున్న జీవాత్మను మూలాధారమునకు తీసికొనివెళ్లి, గుదస్థానమును బిగపట్టుటచేసి-గురూపదిష్ట మార్గమున కుండలినీ ప్రబోధముచేసి-విద్యుల్లిభమై మూలాధారము నుండి బ్రహ్మరంధ్రము వరకు కుండలినీమయమైన నాదమును ధ్యానించి; ప్రాణరూపశ్వాసపరమాత్మకమైన హంసను నాదమునందు విలీనముచేయును. ఆ

తరువాత జీవునితో సహా నాదమును చక్రభేదము చేయించి ఆజ్ఞాచక్రమును చేరును. అచ్చట కుండలినియందు పృథివ్యాది తత్త్వములను లయింపజేయును. తరువాత కుండలిని జీవాత్మలను బిందువునందు విలీనముచేయును. అది శివశక్తితత్త్వము. ఆ తరువాత బ్రహ్మరంధ్రమునుండి నిష్క్రమించును.)

సహస్రారము: "తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం। నిత్యానందమయీ సదాః శివపురీ శక్తేః సమస్త్యాత్వతం॥" (సహస్రారపద్మము ఊర్ధ్వభాగమైన బ్రహ్మరంధ్రమున అధోముఖముగ సహస్రదళములతో వికసించి యున్నది. అది నిత్యానందమైన శివపురము.) ఈ కమలమును గురించి లలితాసహస్రనామావళియం దిట్లుకలదు (528 నుండి 534 వరకు గల నామముల) "సహస్రదళపద్మస్థా, సర్వవర్ణోపశోభితా, సర్వాయుధధరా, శుక్లసంస్థితా, సర్వతోముఖా, సర్వౌదనప్రీతచిత్తా, యాకిన్యంబా స్వరూపిణీ" ఈ నామముల తాత్పర్య భావ మిట్లున్నది.

"శ్రీదేవి శిరోమధ్యభాగ సహస్రారకమలమునందున్నది. ఆమె అన్నివర్ణములచేత శోభించుచున్నది. ఆమె సర్వాయుధములు ధరించినది. ఆమె శుక్లధాతువునందు జీవరూపమైనది. ఆమెకు సర్వదిక్కులందు (పది) ముఖములు కలవు. ఆమెకు సర్వాన్నములయందు ప్రీతికలదు. ఆమె సహస్రారచక్రేశ్వరి యగు యాకినీస్వరూపము ధరించి యున్నది.

ఈ కమలమును గురించి యోగినీహృదయమం దిట్లు కలదు.

శ్లో. ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం
రేతో నిష్ఠా సమస్తాయుధకలితకరాం సర్వతో వక్త్రపద్మామ్।
ఆదిక్షాంతార్ణశక్తిప్రకర పరివృతాం స్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్తచిత్తాంపరశివరసికాంయాకినీంభావయామః।

(బ్రహ్మరంధ్రమునకు అధోభాగమందున్న సహస్రార కమలము పరాకాశగతము. దీనికి వేయిదళములున్నవి. చంద్ర మండలము కర్ణికాకారమైనస్థానము. ఇచట దేవత యాకిని. ఆమె పరశివపత్ని. ఆమె శుక్లధాతువున కధిదేవత. పది దిక్కులందు ముఖములు త్రినేత్రములు కలది. సర్వాయుధ ములు ధరించినది. సర్వాన్నప్రీతికలది. తేజోమయములైన అవ్యక్తరూపములైన అకారాది క్షకారాంత పంచాశద్వర్ణ మయయోగినీ గణముచేత సేవింపబడుచున్నది. ఇది ఆత్మ తత్త్వ కమలము.

సౌందర్యలహరిలో శ్రీశంకరభగవత్పాదాచార్యులవా రీ కమలము నిట్లు వర్ణించిరి.

శ్లో. మహీం మూలాధారేకమపి మణిపూరేహుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి।
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వాకులపథం
సహస్రారే పద్మే స హరహాసి పత్యావిహరసే॥

(భగవతి మూలాధారస్వాధిష్ఠాన మణిపూర అనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రములకు ఆవల సహస్రారమున సదాశివునితో విహరించు నని భావము.)

'షట్చక్రనిరూపణ' మను గ్రంథమునందు ఆజ్ఞాచక్ర మునకు సహస్రారమునకు మధ్య గల శూన్యమును గురించి,

సహస్రారకమలమును గురించి చెప్పబడిన శ్లోకములను వాటికి వ్యాఖ్యాన సహితమైన తాత్పర్యమును పొందు పరచు చున్నాము.

శ్లో. లయస్థానం వాయో స్తదుపరిచ మహానాదరూపం శివార్థం
సిరాకారం శాంతం వరదమభయం శుద్ధ బుద్ధి ప్రకాశమ్।
యదా యోగీపశ్యేద్గురుచరణయుగాంభోజసేవా సుశీల
స్తదావాచాం సిద్ధిః కరకమలతలే తస్యభూయాత్ సదైవ॥

గురుసేవాసుశీలుడైన యోగి ఆజ్ఞాచక్రముపైన 'మహానాదము'ను దర్శించును. వాక్సిద్ధి కరతలమగును. వాయువునకు లయస్థానమైన మహానాదము శివార్థభాగము. అది నాగలి రూపము కలది. (శివ డనగా హకారము. దాని పై భాగము పోగా దిగువ భాగము నాగరిలిపియందు నాగలివలె నుండును.) ఆ మహానాదము శాంతమైనది. వరదమైనది. అభయమైనది. శుద్ధ బుద్ధి ప్రకాశమైనది. (ఆజ్ఞాచక్రముపైన కారణశివాంతర శరీరము వర్ణింపబడినది. అది మహానాదమే. వాయువునకు మహానాదము లయస్థాన మని చెప్పుట ప్రసిద్ధము. 'యస్మాత్ ఉత్పత్తిః తత్ర లయ నియమాత్' అగుటవలన సరిగానున్నది. భూతశుద్ధితంత్రమునందు గంధములందు స్పర్శతత్త్వమునందు వాయువు లయించు నని, అది వ్యోమమునందు లయించు నని చెప్పబడినది. కాని వాయు లయస్థానము నాద మనుట బాగున్నది. దీనికి శ్రుతివచన మిట్లు కలదు. "పృథివీ కారాద్రసవతీ రసాదజాయత, కకారాత్ సర్వాణి జలాని తీర్థాని రేఫాద్వహ్ని తత్త్వం నాదాద్వాయుః సర్వప్రాణమ్యా బిందోర్గగనం సర్వశూన్యం శబ్దమయం తేభ్యః పంచవింశతి గుణమయ

తత్త్వం సర్వమిదం విశ్వం బ్రహ్మాండం కాళికామయమ్" అని యుండుటవలన క్రీం బీజమునందు కకార కాళి - రకార బ్రహ్మాగ్ని - ఈకార మహామాయలు - ఉండి విశ్వాకృతిగా నున్నవని గ్రహించునది. మహానాదమునుగురించి సమ్మోహన తంత్రమునం దిట్లు చెప్పబడినది. 'తదూర్ధ్వే చ మహానాదో లాంగూలాకృతిరుజ్జ్వలః'అమరకోశమునందు నాగలికిపర్యాయ పదములుగా లాంగూలం. సీరము హలము, గోదారణము చెప్పబడినవి. శక్తి నిరామయ పదోన్ముఖ యైనప్పుడు నాదముచేత త్వరితము చేయబడి శివోన్ముఖయై బిందు వగు నని ప్రయోగసారమున చెప్పబడినది. "నాదాత్మనా ప్రబుద్ధా సా నిరామయ పదోన్ముఖీ। శివోన్ముఖీ యదాశక్తిః పుంరూపా సా తదా స్మృతా మరియు 'సాతత్త్వసంజ్ఞా చిన్మాత్ర జ్యోతిషః సంవిధేస్తథా విచికీర్షుర్ఘనీ భూయక్వచిదభ్యేతి బిందుతామ్।' అనియు కలదు. (శ్రీశంకరులు' నాద ఏవ ఘనీ భూయ క్వచిదభ్యేతి బిందుతామ్' అని చెప్పిరి.)

శ్లో. తదూర్ధ్వే శంఖిన్యానివసతిశిఖరే శూన్యదేశే ప్రకాశం
విసర్గాధః పద్మం దశశతదళం పూర్ణచంద్రాతి శుభ్రమ్
అధోవక్త్రం కాంతం తరుణ రవి కలాకాంతి కింజల్కపుంజం
శకారాద్యై ర్వర్ణైః ప్రవిలసితవపుః కేవలానందరూపమ్।

ఆ శూన్యమునందు విసర్గకు క్రిందుగా సహస్రార కమలము కలదు. అది పూర్ణచంద్రునివలె ప్రకాశమానమైనది. అది అధోముఖముగా నున్నది. అది మనోహరమైనది. దాని కింజల్కములు తరుణ రవికలా కాంతిపుంజమువలె నున్నవి. దానియందు అకారాది సర్వవర్ణములు కలవు. అది కేవలా

నందరూపమైనది. (కంకాళమాలినీ తంత్రమున 'సహస్రారం మహాపద్మం శుక్లవర్ణమధోముఖమ్ । అకారాదిక్షకారాంతైః స్ఫురద్వర్ణై ర్విరాజితమ్' అని కలదు.)

శ్లో. సమాస్తే తస్యాన్తః శశపరి రహితః శుద్ధసంపూర్ణ చంద్రః
స్ఫురజ్జ్యోత్స్నాజాలః పరమరసచయ స్నిగ్ధసంతానహాసీ ।
త్రికోణం తస్యాంతః స్ఫురతి చ సతతం విద్యుదాకారరూపం
తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తమ్॥

సహస్రారమున కళంకరహితమైన సంపూర్ణ చంద్రుడు కలడు. అమృతమయమైన కిరణములతో జ్యోత్స్న్యలసితుడై ప్రకాశించుచున్నాడతడు. ఆ చంద్రమండలమధ్యమున త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని గుప్తముగా సురలుసేవింతురు. (చంద్రమండలోర్ధ్వమున అంతరాత్మ మొదలైనవి కలవనికంకాళమాలినీతంత్ర మిట్లు చెప్పుచున్నది. "తత్కర్ణికాయాం దేవేశి అంతరాత్మా తతో గురుః। సూర్యస్య మండలం తత్ర చంద్రమండలమేవచ। తతో వాయుర్మహానామ బ్రహ్మరంధ్రం తతః స్మృతమ్ । తస్మిన్ రంధ్రే విసర్గ చ నిత్యానంద నిరంజనమ్। తదూర్ధ్వే శంఖినీ దేవీ సృష్టిస్థిత్యంతకారిణీ" అని కలదు. మఱియు తోడల తంత్రమున "నిరాకారం పరం జ్యోతిర్బిందుం చావ్యయసంజ్ఞకమ్।" బిందుశబ్దేనశూన్యం తథా చ గుణసూచకమ్। "అని కలదు. "ఆహారనిర్హారవిహారయోగాః సుసంవృతా ధర్మవిదాతుకార్యాః"అని పెద్దలవచనము కావున గుప్తముగా అనుష్ఠాన మవలంబించవలె నని భావము.

శ్లో. సుగుప్తం తద్యత్నాదతిశయపరమామోదసంతానరాశైః
పరం కదం సూక్ష్మం సకలశశికలాశుద్ధరూపప్రకాశమ్ ।

ఇహ స్థానే దేవః పరమశివసమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః
స్వరూపీసర్వాత్మారసవిరసమితో౽జ్ఞానమోహాంధహంసః॥

ఆ శూన్యబిందువు గుప్తమైనది. అతియత్నాతిశయమున మాత్రనే పొందగలిగినది. అది పరమామోదసంతానరాశి. అమాకళయు నిర్వాణకళయు దానివలన నిరూపింపబడుచున్నవి. పరమశివు డిచట నసించుచున్నాడు. ఆయన సర్వాత్మ స్వరూపి. ఆయనయందు రసవిరసములు మిళితమై యున్నవి. ఆయన అజ్ఞానమోహాంధమును పరిహరించు సూర్యుడు. (సర్వాత్మ యనుటకు అధ్యాత్మరామాయణమున "జీవాత్మా పరమాత్మా చ పర్యాయో నాత్ర భేదధీః। ఆచార్యశాస్త్రోపదేశాదైక్యజ్ఞానం యదా భవేత్। ఆత్మనో జీవపరయోర్మూలా విద్యాతదైనతు।" అని కలదు. మరియు 'తత్త్వమసి' యను శ్రుతివాక్యము ప్రసిద్ధమే).

శ్లో. సుధాధారాసారం నిరవధి విముంచన్నతితరాం
యతీనాం స్వాత్మజ్ఞానం దిశతి భగవాన్ నిర్మలమతేః।
సమాస్తే సర్వేశః సకలసుఖసంతానలహరీ
పరీవాహో హంసః పరమ ఇతి నామ్నా పరిచితః॥

యతీశ్వరునికి భగవానుడు సుధాధారాసారముచేత స్వాత్మజ్ఞానమును కలిగించును. అప్పుడా యతిజీవాత్మ పరమాత్మల సమైక్యమును సాధించును. అప్పుడు సర్వేశునివలె సర్వమయుడయి పరమహంసయగును. (ఇచట యతీశ్వరునికి భగవానుడైన పరమశివుడు గురుస్వరూపుడై ప్రబోధించును గురుస్వరూపమును లలితారహస్యమం దిట్లు కలదు. "తేజోరూపా ప్రియాతస్య బ్రహ్మవర్త్మసుదుర్లభా। పరమంబ్రహ్మ

యత్పాదపంకజద్యుతి వైభవమ్। నిర్వాణతంత్రమునకూడ 'శిరఃపద్మేమహాదేవ స్తస్యైవ పరమోగురుః। తత్సమో నాస్తి దేవేశి పూజ్యోహిభువనత్రయే। తదంశం చింతయేద్దేవి బాహ్యే గురుచతుష్టయమ్।" అని కలదు. కంకాళమాలినీ తంత్రము నందిట్లు కలదు. "తత్కర్ణికాయాం దేవేశి అంతరాత్మా తతో గురుః। సూర్యస్య మండలం తత్ర చంద్ర మండలమేవ చ। తస్యాధస్తాచ్చ దేవేశి చంద్రమండల మధ్యగామ్। త్రికోణం తత్ర సంచిత్య క్షయహీనాత్మికా కలా। తన్మధ్యే కుటిలా నిర్వాణాఖ్య స ప్తదశీ కలా॥ సహస్రదళ మధ్యస్థమంతరాత్మానము త్తమమ్। తస్యోపరి నాదబిందోర్మధ్యే సింహాసనోజ్జ్వలమ్॥ తస్మిన్ నిజగురుం నిత్యం"... ॥ మరియు ప్రసిద్ధముగా "హంసః పీఠే మంత్రమయే స్వగురుం శివ రూపిణమ్। అముకానంద నాథాంతం స్మరేత్తన్నామ పూర్వకమ్"అని కలదు. అన్నదా కల్పతంత్రము నందిట్లుకలదు. "శిరః పద్మే శుక్లే దశశతదళే కేసరగతే। పతత్రీణాం తల్పే పరమ శివరూపం నిజగురుమ్। ... తన్మధ్యే త్రికోణం స్యాద్విద్యు దాకార రూపకమ్। బిందుద్వయం చ తన్మధ్యే విసర్గరూప మవ్యయమ్। తన్మధ్యే శూన్యదేశే తు శివః పరమసంజ్ఞకః" అని కలదు. హంస యనగా అనుపూర్వికమంత్రాకార మని భావము. ప్రపంచసార తంత్రమునం దిట్లు కలదు. "సా తత్త్వ సంజ్ఞా చిన్మాత్రా జ్యోతిషః సంవిధో స్తతః। విచికీర్షుర్ఘనీభూయ క్వచిదభ్యేతి బిందుతామ్॥ కాలేన భిద్యమానస్తు స బిందు ర్భవతిద్విధా। బిందుర్దక్షిణ భాగశ్చ వామభాగో విసర్గకః॥ తేన దక్షిణవామాఖ్యౌ భాగౌ పుంస్త్రీ విశేషితౌ। హంకారో

బిందురిత్యుక్తో విసర్గః స ఇతి స్మృతః । బిందుః పురుష ఇత్యుక్తో విసర్గః ప్రకృతిః స్మృతః। పుం ప్రకృత్యాత్మకో హంస స్తదాత్మకమిదం జగత్ । మరియు మహాకాళీ తంత్ర మునం దిట్లు కలదు. "సహస్రారాంతరే శూన్యే దివ్యతోరణ శోభితే । చంద్రమండల మధ్యే తు హంసవర్ణ ద్వయోపరి । శుద్ధస్ఫటిక సంకాశం శుద్ధ క్షౌమవిరాజితమ్" — హంస విషయముగా ఆగమకల్ప ద్రుమమునం దిట్లు కలదు. "అసౌ పరమ హంసాఖ్యో యుక్తస్థావరజంగమః."

శ్లో. శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణా ।
లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే ।
పదం దేవ్యా దేవీచరణయుగలాం భోజరజకా ।
మునీంద్రా అప్యన్యే ప్రకృతిపురుష స్థానమమలమ్ ॥

శైవులీ స్థానమును శివస్థాన మనియు, వైష్ణవులు పరమ పురుషస్థాన మని ఇతరులు హరిహరస్థాన మనియు, కొందరు మునులు ప్రకృతి పురుషస్థానమని, దేవీచరణభక్తులు దేవీస్థానమని చెప్పుచున్నారు.

శ్లో. ఇదం స్థానం జ్ఞాత్వా నియతనిజచిత్తో నరవరా
న భూయాత్ సంసారే పునరపి న బద్ధస్త్రిభువనే ।
సమగ్రాశా క్తః స్యాన్నియమమనస స్తస్య కృతినః
సదా కర్తుం ఖగతిరపి వాణీ సువిమలా ।

ఈ స్థానము నెరిగిన నరవరునికి పునర్జన్మలేదు. అతనికి త్రిభువనములందు బంధనములేదు. అతనికి ఇష్టార్థసిద్ధి కలదు. అతడు బ్రహ్మోన్ముఖుడు. అతడు సువిమలమైన వాక్కు కలిగిన వాడగును. (నియతనిజ చిత్తుడైనవాడు సంసారవిముక్తుడగు

నని; పుణ్యపాపరహితుడగు నని భావము.) శ్రీమద్భాగవతము నం దిట్లు కలదు. "కర్మాణి క్రియామాణే తు గుణౌ రాత్మానిమ న్యతే। తదస్య సంస్కృతిర్బంధః పరతాన్యం చ తత్స్మృతమ్" మరియు భగవద్గీతయందు "స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా" అని కలదు. జీవన్ముక్తుని గురించి కులార్ణవ తంత్రము నం దిట్లు కలదు. "అశ్వమేధశతేనాపి బ్రహ్మహత్యాశతేన చ। పుణ్యపాపైర్న లిప్యంతే యేషాం బ్రహ్మ హృది స్థితమ్." మరియు భగవద్గీతయందు "నైవతస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చనా। న చాస్యసర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః" అని కలదు. మరియు భగవద్గీతయందే "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతేతథా" అని కలదు.

శ్లో. అత్రాస్తే శిశుసూర్యసోదర కలాచంద్రస్య సా షోడశీ
శుద్ధా నీరజసూక్ష్మతంతు శతధాభాగైకరూపా పరా।
విద్యుత్కోటి సమానకోమల తనుర్విద్యోతి తాధోముఖీ
నిత్యానంద పరంపరాతి విగలత్పీయూషధారాధరా॥

ఇచ్చట నిత్యానామకమైన చంద్రుని ధ్రువకల - షోడశీకల వసించుచున్నది. ఆమె శుద్ధ. శిశుసూర్యుని వంటి కాంతి కలది. నీరజసూక్ష్మ తంతువునందు నూరవభాగమంతటి రూపము కలది. పరాదివైఖరిశక్తుల సమష్టిరూపము. విద్యుత్కోటి సమానకోమలమైన తనువు కలది. అధోముఖము కలది. ఆనంద పీయూషధారాధరమైనది.

శ్లో. నిర్వాణాఖ్యకలాపరా పరతరా సాస్తే తదంతర్గతా
కేశాగ్రస్య సహస్రధా విభజితస్యైక కాంశరూపా సతీ।

భూతానామధిదైవతం భగవతీ నిత్యప్రబోధోదయా ।
చంద్రార్ధాంగ సమానభంగురవతే సర్వార్కతుల్యప్రభా ।

ఆకలయందు నిర్వాణకలగలదు. అది పరతరమైనది అది కేశమునందు వేయింట నొకభాగమంతటిది. అర్ధచంద్రాకృతికలది. ఆమె నిత్యభగవతి. జ్ఞానరాత్రి. సర్వసూర్యుల సమానకాంతి గలది.

శ్లో. ఏతస్యా మధ్యదేశే విలసతి పరమా పూర్వనిర్వాణశక్తిః।
కోట్యాదిత్యప్రకాశా త్రిభువనజననీ కోటిభాగైకరూపా ।
కేశాగ్రస్యాతిసూక్ష్మ నిరవధినిగళత్ప్రేమధారాధరా సా ।
సర్వేషాం జీవభూతా మునిమనపి ముదా తత్త్వబోధం వహంతీ ।

నిర్వాణకల మధ్యమందు పరమాపూర్వమైన నిర్వాణశక్తి కలదు. ఆమె కోటిసూర్య ప్రకాశమైనది. త్రిభువనజనని. కేశమునందు కోట్యంశవంటి సూక్ష్మాకృతికలది. ఆమె నిరవధిక ప్రేమధారాధర సర్వజీవాధార. మునులకు తత్త్వార్థమును ప్రదానముచేయునది. (జీవులసృష్టిని గురించి నిర్వాణతంత్రమునందు 'యదాభూమహా పతతి తదా సంజ్ఞాయుక్తో భవతి' అని కలదు. అనగా పైశ్లోకమునందు వర్ణించిన పరబిందువునుండి జీవసంతతి జన్మించుచున్న దని భావము. అనగా నామము కల దగుచున్న దని చెప్పవచ్చును. 'అస్తిభాతి ప్రియనామ చేత్యంశ పంచకమ్। ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్'మరియు'జ్వలదగ్నే ర్యథాదేవీభవంతిప్రస్ఫులింగకాః। తస్యాశ్చ్యుతం పరం బిందుర్యదా భూమహా పతత్యపి । తదైవ సహసా దేవీసంజ్ఞాయుక్తో భవత్యపి' అనియు "నిర్వాణాఖ్యం

తరగతా వహ్నిరూపా నిబోధికా। నాదోఽవ్యక్తం స్తదుపరి కోట్యాదిత్యసమప్రభా। నిర్వాణశక్తిః పరమా సర్వేషాం యోని రూపిణీ। తస్యాంశక్తౌ శివం జ్ఞేయం నిర్వికారం నిరంజనం। అత్రైవ కుండలీ శక్తిర్విహరేత్ పరమాత్మనా'అని కలదు.)

శ్లో. తస్యా మధ్యాంతరాళే శివపదమమలం శాశ్వతం యోగి
గమ్యం। నిత్యానందాభిధానం సకలసుఖమయం శుద్ధబోధ
స్వరూపమ్। కేచిద్బ్రహ్మాభిధానం పదమితి సుధియో వైష్ణవం
తల్లపంతి। కేచిద్ధంసాఖ్యమేతత్కిమపి సుకృతినో మోక్ష
మాత్మ ప్రబోధమ్ ॥

ఆమెయందు నిత్యమైన శివపదము కలదు. అదిమాయా దూరమైనది. యోగిగమ్యమైనది. నిత్యానందమైనది. జ్ఞాన స్వరూపమైనది. బ్రహ్మము, హంసము, విష్ణుపదము, ఆత్మ జ్ఞానము, మోక్షపదము అని చెప్పవచ్చును. (పద్మపురాణము నందిట్లు కలదు. "శైవః సౌరాశ్చ గానేశాః వైష్ణవః శక్తి పూజకః। మామేవ ప్రాప్నువాంతి హి వర్షాంభః సాగరమ్ యతః"-జ్ఞానార్ణవమునందు 'హకారే బిందురూపేణ బ్రహ్మాణం విద్ధి పార్వతి। సకారే సర్గబిందుస్యాం హరిశ్చహం మహేశ్వరి। అవినాభావ సంబంధాత్ లోకే హంహంసావితి।' అని కలదు. ప్రకృతి పురుషుల సమైక్యస్థితియగు పరబిందువునకు చుట్టును మాయకలదు. అది సహస్రారకమల కర్ణికయందు కలదు. అందుచేత ప్రసిద్ధముగా "సత్యలోకే నిరాకారా మహాజ్యోతిః స్వరూపిణీ। మాయయాచ్ఛాదితాత్మనం చణకాకారరూపిణీ। హస్తపాదాదిరహితా చంద్రసూర్యాగ్నిరూపిణీ। మాయా బంధనముత్సృజ్య ద్విధా భిత్వా యదోన్ముఖీ। శివశక్తి

విభాగేన జయతే సృష్టికల్పనా" అని కలదు. సత్యలోకము సహస్రారమే. "నిర్గుణో బిందురూపశ్చ సిద్ధికారణమేవహి । కేచిద్వదంతి సబ్రహ్మకై శ్చిద్విష్ణుః ప్రకాశ్యతే । కైశ్చిద్రుద్రే మహాపూర్ణ ఏకాదేవీ నిరంజనః । ఆత్మా శక్తియుతో దేవశ్చరణ కాకార రూపకః" అనియు "తన్మధ్యేపరబిందు చ సృష్టిస్థితి లయాత్మకమ్ । శూన్యరూపం శివః సాక్షాత్ బిందుః పరమకుండలీ" । అనియు "వృత్తం కుండలినీశక్తిర్గుణత్రయ సమన్వితమ్ । శూన్యభాగం మహేశాని శివశక్త్యాత్మకం ప్రియే ।" అనియు "నాహోన రాత్రిర్నపృథ్వీ నాసీత్తమో జ్యోతి రభూన్నవాన్యత్ । శ్రోత్రాది బుద్ధ్యానుపలభ్యమేకం ప్రధానికం బ్రహ్మపుమాం స్తదాసేత్ ॥" అనియు "నిర్గుణః సగుణశ్చేతి శివో జ్ఞేయః సనాతనః । నిర్గుణః ప్రకృతేరన్యః సగుణః సకలః స్మృతః" అనియు కలదు.

## సా మ ర స్య ము

శరీరమందున్న సప్తకమలములకు శ్రీచక్రముతో సామరస్యమును భావింపవలసి యున్నది. ఆసామరస్య స్వభావ మిట్లు కలదు.

శ్లో. త్రికోణమష్టకోణం చ దశకోణద్వయం తథా
మనుకోణం చతుష్కోణం కోణచక్రాణి షట్క్రమాత్
మూలాధారం తథా స్వాధిష్ఠానం చ మణిపూరకం
అనాహతం విశుద్ధాఖ్యమాజ్ఞాపద్మం విదుర్బుధాః
తదాధారస్వరూపాణి కోణచక్రాణి పార్వతి
త్రికోణరూపిణీ శక్తిః బిందురూపశ్శివః స్మృతః
అవినాభావ సంబంధః తస్మాద్బిందు త్రికోణయోః ॥

శ్రీచక్రమున బింద్వాది కమలములు ప్రకాశాంశలు. త్రికోణాదిచక్రములు విమర్శాంశలు. ఈ రెంటికిని సామరస్యము కలదు.

శ్రీచక్రమధ్యగత బిందువు సహస్రారాంతర్గత చంద్రమండలమునందు అంతర్ధ్యానము కలది. ఆజ్ఞాకమలమున శ్రీచక్రగతి త్రికోణచక్రము కర్ణికగా వెలసినది. విశుద్ధ కమలమునకు శ్రీచక్రగత అష్టకోణ చక్రము కర్ణికగా వెలసినది. అనాహతమునకు శ్రీచక్రగత అంతర్దశారము కర్ణికగా వెలసినది. మణిపూరకమునకు శ్రీచక్రగత బహిర్దశారము కర్ణికగా వెలసినది. స్వాధిష్ఠాన కమలమునకు శ్రీచక్రగత చతుర్దశారము కర్ణికగా నున్నది. మూలాధారమునకు శ్రీచక్రగత భూపురము కర్ణికగా నున్నది.

మూలాధారాది సహస్రారాంత కమలములతో శ్రీచక్రమును మేళనముచేయుట స్థూలచక్ర మేళన మనబడును. ఇది స్థూలచక్ర సామరస్య భావనము.

## సూ క్ష్మ చ క్ర ము లు

సాధకుని భ్రూమధ్య భాగమునుండి సహస్రార మధ్య భాగమువరకు సూక్ష్మచక్రములని చెప్పబడు తొమ్మిది చక్రములు కలవు. అవి ఆరోహణక్రమములో (1) చంద్రమండలము (2) అర్థచంద్రాకారము (3) రోధిని (4) నాదము (5) నాదాంతము (6) శక్తి (7) వ్యాపిక (8) సమనా (9) ఉన్మనా - అని పిలువబడుచున్నవి. వీటితో క్రమముగా శ్రీచక్రమందు గల భూపురాది బింద్వంతము గల తొమ్మిది చక్రములకు సామరస్యము భావింపవలెను. ఇది సూక్ష్మచక్ర భావన.

సూక్ష్మచక్రములను గురించిన ప్రమాణవచనము లిట్లు కలవు. "ఇందౌ, తదర్ధరోధిన్యాం, నాద, నాదాంత ఏవచ। శక్తౌ, పునర్వ్యాపికాయాం సమనో, న్మనగచరే। మహాబిందౌ పునశ్చైవ త్రిధా చక్రం భావయేత్॥"

శ్లో. ఆజ్ఞాంతం సకలాప్రోక్తం తతస్సకలనిష్కళం
ఉన్మన్యంతం పరే స్థానే నిష్కలం చ తథా స్థితం
దీపాకారార్థమాత్రశ్చ లలాటవృత్య ఇష్యతే
అర్థమాత్ర స్తదాకారాః పాదమాత్ర స్తదూర్ధ్వతః
జ్యోత్స్నాకారో తదర్థాంశో రోధినీ త్రస్యవిగ్రహో
బిందుద్వయాంతరాళస్థో సేవరూపో మణిప్రభః
కలాంశో ద్విగుణాంశశ్చ నాదాంతో విద్యుదుజ్జ్వలః
హాలాకార స్తు సవ్య స్తబిందుయుక్తో విరాజతే
శక్తిర్వామ స్తబిందూద్యత్ని రాకారా తథా పునః
వ్యాపికా బిందువిలసత్త్రికోణాకారతాం గతా
బిందుద్వయాంతరాళస్థ ఋజురేఖామయీ పునః
సమనా బిందువిలసదృజురేఖా తథోన్మనీ
శక్త్యాదీనాం వపుస్స్ఫూర్జద్ద్వాదశాదిత్యసన్నిభం
చతుష్షష్టి స్తదూర్ధ్వం తద్ద్విగుణం ద్విగుణం తతః
శక్త్యాదీనాం తు మాత్రాంశో మనోన్మన్యా స్తథోన్మనీ
దేశకాలానవచ్ఛిన్నం తదూర్ధ్వం పరమం మహత్
నిసర్గసుందరం తత్తు పరానందవిఘూర్ణితమ్ ॥

సూక్ష్మచక్రస్థానములను గురించి-భిన్నాభిప్రాయములు గల శ్లోకములు కలవు. ఆయా మతాంతరముల నుదహరించు చున్నాము. సంమోహన తంత్రవచనము లిట్లు కలవు.

"ఇందుర్లలాటదేశే చ తదూర్ధ్వే భోధినీస్వయమ్। తదూర్ధ్వే భాతినాదోఽసావర్ధచంద్రకృతిః పరః ॥ తదూర్ధ్వే చ మహానాదో లాంగూలాకృతిరుజ్జ్వలః। తదూర్ధ్వే చ కలాప్రోక్తా అఝేతినల్లభా। ఉన్మనీతు తదూర్ధ్వేచ యద్ గత్వానవర్తతే॥" అనగా ఇందు చక్రము ఆజ్ఞాచక్రము పైన కలదు. దానిపైన (ఇందువునందే అర్ధేందువు కలదు) బోధిని (రోధిని) ఉన్నది. దాని తరువాత నాదము కలదు. పిమ్మట నాదాంతము (మహానాదము) కలదు. నాదము అర్ధచంద్రమువలెను మహానాదము హలాకారము వలెను ఉన్నవి. మహానాదము నందే శక్తి వ్యాపికలు అంతర్భూతములు. పిమ్మట సమనా కలదు. సమనా చక్రమునకు అఝె అని నామాంతరము. తదుపరి ఉన్మనికలదు. ఉన్మనిని చేరినవారు తిరిగి వచ్చుటలేదు.

భూతశుద్ధి తంత్రమున రోధిని (బోధిని) చక్రమునకు క్రిందుగా బిందువు కలదనియు (అనగా చంద్రమండలము) బిందువుపైన మాత్రార్థము (అర్ధచంద్రము) నాదము, మహానాదము (నాదాంతము) కలవనియు చెప్పబడినది. "బిందుర్మాత్రార్థతో దేవి తదూర్ధే నాదసంజ్ఞితమ్ । లయస్థానం తస్య వాయోర్మహానాదం తదూర్ధ్వతః ।" మరియు "గాలసూర్య ప్రకాశమామాసే దిందుమదక్షరమ్। తదూర్ధ్వేచార్ధమాత్రా తుగాంధారీరాగ మాశ్రితా" అని బృహత్త్రివిక్రమసంహిత యందు అర్ధమాత్ర యనగా శక్తి యని కలదు. దేవీభాగవత మున అర్ధమాత్ర అను శబ్దప్రయోగము కలదు. (I-1-55 మరియు III-5-29). దానికి నీలకంఠ వ్యాఖ్యానమున పరమ పదమని బ్రహ్మమని తాత్పర్యము చెప్పబడినది. చండీస్తోత్రము

నందుకూడ (I-55) నిట్టి శబ్దప్రయోగమున్నది. (త్వముద్గీతే అర్ధమాత్రాసి). ఉన్మనీనిర్వచనముగా "యత్ర గత్వా తు మనసో మన స్త్వం నైవ విద్యతే! ఉన్మనీసా సమాఖ్యాతా సర్వ తంత్రేషు గోపితా॥" అని కలదు. కంకాళమాలినీతంత్రమున ఉన్మనీనామతస్యాహి భవపాశనికృంతనీ"అని కలదు. భూతశుద్ధి తంత్రమున వ్యాపిక, శక్తి, చక్రములను గురించి చెప్పబడిన దిట్లున్నది. "తతో హి వ్యాపికాశక్తిర్వ్యామాంచితవిదుర్జనాః। సమనీమూర్ధ్వత స్తస్య ఉన్మనీం తు తదూర్ధ్వతః॥" ఇందు, చంద్రార్ధ (మాత్రార్ధ) బోధిని (రోధిని) నాద, నాదాంత(మహా నాద) శక్తివ్యాపిక, సమనా ఉన్మనులు తంత్రసమ్మతములే.

స్థూలచక్రములందు క్రమముగా మూలాధారమున (పాద, గంధ, అఘ్రాణతత్త్వములు) స్వాధిష్ఠానమున (పాణి, జిహ్వా, రసతత్త్వములు) మణిపూరమున (గుద, దర్శన, రూప తత్త్వములు) అనాహతమున (లింగ స్పర్శత్వక్ తత్త్వములు) విశుద్ధియందు (శ్రవో, శబ్ద వాక్ తత్త్వములు) అనగా 15 తత్త్వములు పంచభూతములు (వింశతి) లయింపవలసి యున్నది. ఆజ్ఞాచక్రమున అహంకారము బుద్ధి లయింపవలెను. సూక్ష్మచక్రసమన్వయనము సూక్ష్మ (కారణ) రూపముకూడ పరిత్యజింపవలెను. ఉన్మనీ సంచారమునకు పోవునప్పటికి ఆత్మ యొక్కటే మిగులుచున్నది.

సూక్ష్మచక్రములందు బీజన్యాస మీవిధముగానున్నది. (1) అం ఆం సౌః నమః (చంద్రమండలము) 2. ఐం క్లీం సౌః నమః (అర్ధచంద్ర) 3. హ్రీం క్లీం సౌః నమః (రోధిని) 4. హ్సైం హ్స్క్లీం హ్సౌః నమః (నాద) 5. హ్స్రైం హ్స్క్రీం హ్స్రౌః నమః

(నాదాంత) 6. హ్రీం క్లీం బ్లేం నమః (శక్తి) 7. హ్రీం శ్రీం సౌః నమః వ్యాపిక 8. హ్స్రౌం హ్స్క్లౌం హస్త్రౌః నమః (సమన) 9. పంచదశి (మంత్రము) నమః (ఉన్మనీ) 10. షోడశి నమః (బ్రహ్మరంధ్రే - మహాబిందౌ).

## దశవిధనాదములు

భ్రూమధ్యమునుండి సహస్రారమధ్యము వరకు గల తొమ్మిది సూక్ష్మచక్రములందు సంచారము చేయునపుడు ఆరోహణ క్రమమున దహరాకాశమున కొన్ని దృశ్యములు కనిపించుట కొన్ని నాదములు వినిపించుట జరుగును. దృశ్యమానమగు మండలములు క్రమముగా నిట్లు కలవు. 1. వియన్మండలము 2. తమోమండలము 3. మేఘమండలము 4. విద్యున్మండలము 5. తారామండలము 6. జ్యోతిర్మండలము 7. సూర్యమండలము 8. చంద్రమండలము 9. వహ్నిమండలము 10. హిరణ్మయమండలము. ఈ దశవిధమండలముల తరువాతనే శివశక్తి యుక్తమైన జీవతత్త్వము. అచ్చటనే ఉన్మని అర్ధమాతృక తురీయము విరజ అను నామాంతరముగల శుద్ధతత్త్వము.

ఈ దశవిధమండల దృశ్యములతో దశవిధనాదములు వినిపించును. తొలుత వినిపించునది స్వాంతర్గతప్రాణఘోష. ఇది అభ్యాసదశలో జరుగును. తరువాత క్రమముగా చిణినాద చిణిచిణినాద ఘంటానాద శంఖనాద తంత్రీనాద వేణునాద భేరీనాద మృదంగనాద మేఘనాదములు వినబడును. ఇవి శ్రుతిసిద్ధములే. ఈ నాదముల వివరము లిట్లున్నవి.

షణ్ముఖీ ముద్రచేత శ్రవణములు బంధించుకొని ఆల

కింపగా ప్రణవము మొదట 'చిణి' యని మ్రోగును. తరువాత నది హెచ్చి చిణి చిణి యని ఘోషించును. ఆపైని ఘంటా నాదము చేసినట్లుగా ఘంటానాదము వినిపించును. ఆ ఘంటా నాదము విజృంభణము చెందుచు శంఖమును పూరించినట్లుగా శంఖానాదమై మ్రోగును. ఆనాదము స్నిగ్ధమనోహరముగా మారి వీణా తంత్రీనాదమువలె రూపొంది వీణానాదమువలె మ్రోగును. ఆ తరువాత నా నాదము నిర్మలమై వాయువును తాళముగా గొని పాడుచు నర్తించునట్లు వేణునాదమై మ్రోగును. ఆ తరువాత కామక్రోధాది అరిషడ్వర్గమును జయించిన విజయచిహ్నముగా భేరీధ్వానమై మ్రోగును. ఆ పైని విజయోత్సవచిహ్నముగా రమణీయమైన మృదంగపు మ్రోతగా వినిపించును. ఆ పైని ఆనందవర్షపాతము జరుగు చున్నట్లుగా మేఘములు ఘోషించినట్లుగా మేఘనాదము వినిపించును.

క్రమముగా నీ దశవిధ నాదములు పరానాదములో లయించుట జరుగును. ఆ స్థితిలో మనఃప్రాణములు నాదబిందు కళలతో లయించు నన్నమాట. ఆ యవసనే తురీయమని, ఉన్మనియని, సహజామనస్కమని చెప్పుదురు. ఉన్మన్యవస్థలో అంతఃకరణప్రాణములును, వివిధవిషయములుగల యింద్రియ ములును (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు) నసించును. ఇది ఉపనిషద్వేద్యమైన విషయమే. నాదబిందూపనిషత్తునం దీ వివరములు విశదముగా కలవు.

మనస్సు ప్రపంచరూపమై సంకల్ప మని సంసార మని వాసనారూప మని బంధమోక్షరూపమైన దని చెప్పబడును.

సుషుప్తిరూపమై ప్రకృతి అజ్ఞానము అవిద్య మాయ అనియు చెప్పబడును. కార్యకారణమైన మనస్సులేకుండ స్థితికాబట్టి అమనస్క-యోగమని చెప్పబడుచున్నది. ఇదే రాజయోగము. (నిరస్తవిషయాసంగం సన్నిరుద్ధం మనోహృదియ దాయాత్యు న్మనీభావం తధా తత్పరమం పదమ్. ధ్యానధ్యాతృధ్యేయ భావోయధానశ్యతి తథోన్మనత్వం భవతి జ్ఞానామృత నిషేవ ణాత్.)

ఈ సందర్భమున ఛాందోగ్యశ్రుతి (ఛాందో ౮-౧-౧)ని ఉదహరింపవలసి యున్నది.

"యదిద మస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకం వేశ్మ దహరేఽస్మిన్నన్త రాకాశ స్తస్మిన్యదన్తస్త దన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" అనగా దహరాధికరణమున దహ రాకాశమున బ్రహ్మమని నిర్ణయమైనది. కాబట్టి గగనశబ్ద వాచ్యమైన ఆ బ్రహ్మము శోకరహితము. హృదయపుండరీక మధ్యమున ఏ బ్రహ్మతత్త్వము కలదో అది ఉపాసింపతగినది. ఉపాసించుట యనగా సజాతీయజ్ఞాన ప్రవాహ రూపముగా భావించుటే.

ఇట్టి యర్థమే తెలుపు తైత్తిరీయ శ్రుతి యొకటి కలదు.

"దహ్రం విపాపం పరమేశ్మభూతం
యత్పుణ్డరీక పురమధ్యసగ్ంస్థమ్।
తత్రాపి దహ్రం గగనం విశోక
స్తస్మిన్ యదన్తస్త దూపాసితవ్యమ్। (తైనా ౧౨-౧౬)

దహరపుండరీకమునందు అతి సూక్ష్మమై ఆకాశమువలె అమూర్తమై బ్రహ్మమున్నది. బ్రహ్మము శోకరహితము. అధి

ఉపాసింపదగినది. దహరపుండరీకము అత్యల్పమైనదియు పరిశుద్ధమైనదియు, పరమాత్మకు స్థానభూతమైనదియు శరీర మధ్యమందున్నదియునని చెప్పబడినది. (దహరాకాశ పుండరీకగత బ్రహ్మమును ఉపాసించుటెట్లో పైన వివరింపబడినది.)

## నా ద స్వ రూ ప ము

పరా పశ్యంతీ మధ్యమా వైఖరీభేదములలో నాదము లున్నస్థితి సూక్ష్మమధ్యమ. ఆరోహణక్రమమున నాదాంత సమయమే పశ్యంతి నాదలయమే మనోలయము. అప్పుడే బ్రహ్మానుభవానందము. అది జీవన్ముక్తావస్థ. ఇది సర్వాగమ సిద్ధమైన విషయము.

ఉన్మనిచక్రము తొమ్మిదవది. ఎనిమిదవ చక్రమునకు మనోన్మనీ స్థానమని పేరు. మనోన్మనీ స్థానమునందే మనోలయ మగునని, అచట నిశాదివభేదములేదని, అది శివశక్తి మేళన రూపమని, రుద్రవక్త్రమని చెప్పుదురు మనోన్మనాయనమః.

## సూక్ష్మతర సామరస్యము

మూడవ సామరస్యమునకు సూక్ష్మతర సామరస్యమని పేరు. సహస్రారాంతర్గత చంద్రమండలమైన బిందువునందు నవచక్రయుక్తమైన శ్రీచక్రమును భావింపవలయును. ఈ విధముగా సాధకునిశరీరమున శ్రీచక్రమును మూడు విధములుగా సంభావింపవలెను. బిందుస్థానమే సుధాసముద్రము. దాని యందు రత్నద్వీపము. ఆద్వీపమున పంచయోనులైన కల్ప ద్రుమములు నీపశ్రేణులు. అచట చింతామణి గృహమున్నది. శ్రీదేవి దానియందున్నది. సుధాసింధోరంతర్వపతి మనిశం వాసరమయామ్.

అరుణోపనిషత్తునందు చెప్పబడునట్లు బ్రహ్మరంధ్ర స్థిత సహస్రారకమలము పద్మాటవి. అందుగల బిందుస్థానమునందు శ్రీదేవి కలదు. కావున, పిండాండ బ్రహ్మాండములు సమాన ధర్మములు కలవి. కాబట్టి బిందువునందు సంపూర్ణ శ్రీచక్ర సామరస్యము భావింపవలెను.

ప్రకారాంతముగా చతుర్విధైక మిట్లు కలదు.

శ్లో. పిండ బ్రహ్మాండ యోరైక్యం లింగ సూత్రాత్మనోరపి।
స్వాపావ్యా కృతయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః।

అనగా ముందు పిండాండ బ్రహ్మాండముల కైక్యము భావింపవలెను. అనంతరము లింగాత్మ సూత్రాత్మల కైక్యము తెలియవలెను. పిమ్మట స్వాపావ్యాకృతముల కైక్యము తెలియవలెను. ఆ పిమ్మట క్షేత్రజ్ఞ పరమాత్మల కైక్యము తెలియవలెను.

లింగాత్మ అనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియ దశకము, అంతరింద్రియమైన మనస్సు పంచతన్మాత్రలు అను పదునారింటి సముదాయము. (మన ఆది ఏకాదశేంద్రియగణః సూక్ష్మభూత పంచకం తన్మాత్రాణి ఏవంషోడశకం లింగాత్మ ఇతి.)

సూత్రాత్మ యనగా బ్రహ్మాండా వచ్ఛిన్నమగు వాయువు. వాయువే లింగశరీరమును అర్చిరాదిమార్గము నందుంచునది. ఈ రెండిటి ఐక్యమే లింగాత్మ సూత్రాత్మల ఐక్యము. స్వాపమనగా సుషుప్తి అవస్థాపన్నుడగుచు సాక్షియగు ప్రాజ్ఞుడు. అవ్యాకృతు డనగా అవిద్యాశబలితమైన బ్రహ్మ. ప్రాజ్ఞునకు అవిద్యాశబలిత బ్రహ్మమునకు ఐక్యమే స్వాపావ్యాకృతముల ఐక్యము. క్షేత్రజ్ఞు డనగా జీవుడు పర

మాత్మ యనగా బ్రహ్మ స్వరూపము. జీవునకు బ్రహ్మము నకు ఐక్యమే క్షేత్రజ్ఞ పరమాత్ముల ఐక్యము ఇది మహా వాక్యార్థమైన విషయము. ఈ ఐక్యాను సంధాననే కుండలినీ విషయగతమైనది. అది ముందు వివరింపబడుచున్నది. పైన చెప్పిన సాక్షి సుషుప్త్యాది పదముల నిర్వచనము లీవిధముగా నున్నవి.

సాక్షి :-సాక్షి శబ్ద నిర్వచనము బ్రహ్మోపనిషత్తునందు కైవల్యోపనిషత్తు నందు విశదముగా నున్నది.

బ్రహ్మోపనిషత్ :-

"కర్తారం చ క్రియాం తద్వద్వ్యావృత్తవిషయానపి
స్ఫూరయేదేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః[త్మా
ఏకో దేవస్సర్వభూతేషుగూఢః సర్వవ్యాపీసర్వభూతాంతరా
ః ర్మాధ్యక్షస్సర్వభూతాధివాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ
ఏకోవశీ సర్వభూతాంతరాత్మైకం రూపంబహుధాయఃకరోతి
తమాత్మస్థం యోఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం
[నేతరేషామ్ ॥"

కైవల్యోపనిషత్ :-

"త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః
సాక్షిభూతే సమస్తస్య నిర్వికల్పే చిదాత్మని
నిరిచ్ఛ ప్రతిబింబంతి జగంతి ముకురే యథా
ఏకం బ్రహ్మ చిదాకాశం సర్వాత్మకం సుఖం స్థిరం
ఇతి భావయ యత్నేన చేతశ్చాంచల్యశాంతయే
సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితం

బ్రహ్మరూపం తయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయం
అజ్ఞానాంధతమోరూపం కర్మధర్మాదిలక్షణం
స్వయం ప్రకాశమాత్మానం నైవమాం స్ప్రష్టుమర్హతి
భాసమానమిదం సర్వం భానరూపం పరంపదం
పశ్యన్వేదాంతమానేన సద్యఏవ విముచ్యతే
త్రిధామసాక్షిణం సత్యజ్ఞానానందాదిలక్షణం
త్వమహం శబ్దలక్ష్యార్థమసక్తం సర్వదోషతః
సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్
ప్రజ్ఞానమేవ తద్బ్రహ్మ సత్యప్రజ్ఞానలక్షణః
ఏవం బ్రహ్మపరిజ్ఞానాదేవ మర్త్యోఽమృతో భవేత్
నిస్తత్వే నామరూపే ద్వే జన్మనాశయుతే చ తే
బుద్ధ్వా బ్రహ్మణి వక్షస్వ సముద్రే బుద్బుదాదివత్
సచ్చిదానందరూపేఽస్మిన్పూర్ణే బ్రహ్మణి వీక్షితే
స్వయమేవావజానంతి నామరూపే శనైశ్శనైః
ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానందధీర్భవేత్
అమత్వా సచ్చిదానందం కథం ముక్తో భవిష్యతి ।"

సర్వవ్యాపియై సమస్తమున కాధారభూతమైన బ్రహ్మమే సర్వసాక్షి. సర్వప్రాణుల చేతనములయొక్క బుద్ధిని వికసింప జేసెడు జ్ఞానము.

అవస్థలు నాలుగు. అవి జాగ్రత్, స్వప్నసుషుప్తి తురీయములు. జాగ్రదవస్థయందు మనస్సు బుద్ధి దశేంద్రియములందును పూర్ణవికాసత కలిగియుండును. ఇట్టి స్థితిలో స్థూలదేహాభిమాని యగు జీవుడు విశ్వుడనిపించుకొనును.

శ్లో: సర్వాక్షగోచరత్వేన యా తు బాహ్యతయా స్థితా ।
సృష్టిస్సాధారణీ సర్వప్రక్రియాత్మాఽయం సజాగరః ॥

స్వప్నావస్థలో మనస్సు బుద్ధి యింద్రియ దశకము నందు సంచారమును చేయవు. సూక్ష్మనాడులందు మాత్రము సంచరించుచుండును. ఆ స్థితిలో జీవుడు సూక్ష్మశరీరాభిమానియై తైజసు డని పిలువబడును.

శ్లో. మనోమాత్రపథేఽధ్యక్షవిషయత్వేన విభ్రమాత్ ।
స్పష్టావభాసభావానాం సృష్టిస్స్వప్నపదం మతమ్ ।

సుషుప్తి అవస్థను సుప్తావస్థ - సంప్రసాదావస్థ అనియు చెప్పుదురు. ఈ అవస్థలో మనస్సు బుద్ధి స్థూల సూక్ష్మ నాడీ సంచారమును మానుకొని అంతఃకరణ మనే తమస్సునందు లీనమై యుండును. అప్పుడు మనస్సునకు వృత్తిశూన్యము. బుద్ధికి సుఖదుఃఖముల భావము. ఈ అవస్థలో కారణ (అవిద్యోపాధి) దేహాభిమానియై జీవుడు ప్రాజ్ఞు డనబడును. సుషుప్తావస్థను గురించి శ్రుతి ప్రమాణ మిట్లున్నది.

శ్రు. యదజ్ఞానం తత్ర లీనౌ తౌ విజ్ఞానమనోమయౌ
తయోర్హి విలయావస్థా నిద్రా జ్ఞానం చ సైవ

శివసూత్రములందు కూడ సుషుప్తావస్థ వర్ణింపబడి యున్నది. అది యిట్లు కలదు.

"అవివేకో మాయాసౌ సుప్తిమితి సుఖమస్వాప్స్వం న కించిదవేదిషమితి స్మరణాత్."

నాలుగవదైన తురీయావస్థను గురించిన వివరము లిట్లు కలవు. ఈ అవస్థలో మనోబుద్ధులను సహస్రారమందు చిత్కలా

విమర్శకై యుపయోగింపవలెను. మనస్సు బుద్ధి విభజింప బడ వలెను. మనస్సు లయింపబడవలెను. మనస్సు లయమైన వృత్తి శూన్యము కాగా బాహ్యజ్ఞానముండదు. బుద్ధిలయము కాదు కాబట్టి నిద్రావస్థ కాదు. బాహ్యజ్ఞానము లేదు కావున జాగ్ర దవస్థకాదు. జాగ్రన్నిద్రావస్థలలో మధ్యగా తురీయావస్థ కలదు. ఇచట సుఖము బ్రహ్మానందమే. అభ్యాసపాటవము కలవారికి జాగ్రత్స్వప్నసుషుప్తులలో కూడ బుద్ధి సర్వదా తురీయస్థితి యందే నిలచును. అట్టివారికి తురీయావస్థ అవస్థాత్రయము నందే లీనమైయున్నది. అనగా వారికి అవస్థాత్రయము తురీయ మందే లీనమై సర్వదా తురీయమే గోచరము. తురీయాభ్యాస పాటవమును తురీయాతీత మని చెప్పుదురు. ఈ తురీయావస్థా వివరములకు ప్రమాణవచనము లిట్లు కలవు. శ్రు. "త్రిషు ధామసుయద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః, విద్యాత్తదు భయం యస్తు స భుంజానో న లిప్యతే." (బ్రహ్మోపనిషత్.) మరియు "జాగ్రత్స్వప్నసుషుప్తి భేదేఽపి తుర్యాభోగసంభవ ఇతి, త్రిషు చతుర్థం తైలవదాసేచ్యమితి." (శివసూత్రమ్).

తురీయావస్థలో మహాకారణ శరీరాభిమాని యగు జీవుడు సాక్షి యనబడును.

బ్రహ్మాండమున భూర్భువస్సువర్లోకత్రయమునకు పైన తురీయస్థానము. శరీరమున మూలాధారము మొదలు ఆజ్ఞా చక్రమువరకు అగ్నిసూర్య చంద్రమండలములు. కూటత్రయము. ఆపిమ్మట తురీయము. శ్రీచక్రమున భూపురమునుండి త్రికోణచక్రమువరకు కూటత్రయము. బిందువు తురీయము. మాతృక అవ్యక్తమనే నాదబిందువునుండి వైఖరీవరకు మన్గనల్ల

త్రయము. తురీయమైనది సర్వకారణ బిందువు. జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలు మూడును ప్రకృతి గతములు. తురీయావస్థ స్వస్వరూపావస్థ. విశ్వతైజస ప్రాజ్ఞ నామములు గల జీవుడు ప్రాకృతుడు. సాక్షి తురీయావస్థాభిమాని. పంచదశిమంత్రము కూటత్రయము కలది. శ్రీవిద్య తురీయకూటము కలది. 1. బ్రహ్మాండ, 2. పిండాండ, 3. శ్రీచక్ర, 4. మాతృక, 5. శ్రీదేవి, 6. మంత్రములు తురీయపదము కలవి. తురీయము ఆత్మవస్తుపరము జీవన్ముక్తావస్థ.

షడ్విధైక్యాను సంధానముపై ఆరును సమాన ధర్మములుకలవి. కాబట్టి వాటి సామరస్యమును ఐక్యమును సంపాదింపవలసియున్నది. దీనిని అంతర్యాగమని స్వరూపవేత్తలనుచున్నారు. ఈ షడ్విధైక్యమును శ్రీ గౌడపాదాచార్యుల వారు మరియొకవిధముగా సుభగోదయమునందు వివరించారు.

శ్లో. కలాయాం బింద్వైక్యం తదను చ తయోర్నాద విభవే
తయోర్నాదే నైక్యం తదను చ కళాయామపి తయోః ।
తయోర్బిందా వైక్యం త్రితయమపి భవైక్యం పరశివే
తదేవం షోఢైక్యం భవతి హి సపర్యా సమయినామ్ ॥

చంద్రఖండమున (అకారాది) పదునారు స్వరములు, సూర్య ఖండమున (కాదిమాంతము) ఇరువదిఐదు స్పర్శములును, అగ్నిఖండమున య ర ల వ శ ష స అను సప్తవర్ణములును, బైందవమున హకార ళ కారములు సర్వత్ర క్షకారము అంతర్భూతములు. కళలు తిథిస్వరూపము లని పైన వివరింపబడినది. తిథులు పంచదశ నిత్యాస్వరూపములే. ఈ పంచదశ నిత్యలు మూలమంత్ర మందున్న పంచదశాక్ష రాత్మకములే.

ఆ పంచదశాక్షరములు చంద్రసూర్య అగ్ని ఖండాత్మకములే. ఆ త్రిఖండములు సోమసూర్యాగ్ని రూపములే. అవి గ్రంథి త్రయ యుక్తములు. గ్రంథిత్రయము శ్రీవిద్యయందు హ్రీంకార త్రయాత్మకము. హ్రీం కారము * భువనేశ్వరీ మంత్రము. భువనేశ్వరీ మంత్రము మూల మంత్రాంతర్గతమే. మూలమంత్రమునకు శ్రీచక్రముతో నైక్యము. శ్రీచక్రగత నవచక్రములకు మూలాధారాది షట్చక్రములందును బ్రహ్మగ్రంథి మొదలగు గ్రంథిత్రయమునందును, సహస్రకమల కర్ణికాదియందును తాదాత్మ్యము. కళానాదములయొక్క ఐక్య మనగా నిదియే.

1. నాదముతో బిందువునకైక్యము. 2. బిందువుతో కళకైక్యము. 3. కళకు నాదముతో నైక్యము. ఇవి ఐక్యత్రితయము. 4. కళతో బిందువునకైక్యము. 5. కళతో నాదమునకైక్యము. 6. శ్రీవిద్యతో పై అయిదు ఐక్యములకు నైక్యము. ఈ విధాననే షడ్విధైక్యము. ఇది సమయ మతమున భగవతికి సపర్య.

## నాదబిందు స్వరూపము

బిందు వనగా మూలాధారము మొదలుకొని ఆజ్ఞా చక్రమువరకుగల షట్చక్రసంపుటి. సృష్టిస్థితి లయ కర్తయగు శివుని శక్తివిశేషమే బిందువు (తదేనైకో బిందుర్భవతి జగదు

---

* భువనేశ్వరీమంత్రము, సౌభాగ్యభువనేశ్వరి, మాయాభువనేశ్వరి యని రెండు విధము లవి శారదాతిలక మను మంత్రశాస్త్రగ్రంథము తెలుపుచున్నది. సూర్యముఖ భువనేశ్వరి (చతురక్షర ప్రతిపాదితము) మంత్రమున్న దవి మంత్రదేవతాప్రకాశిక యను గ్రంథమున కలదు. శ్రీ భగవత్పాదుల "ప్రపంచసారము"న భువనేశ్వరీ ఉపాసనా ఫలశ్రుతి కలదు,

త్పత్తి కృదయమ్). అది సహస్రారకమలమునం దున్నది. శక్తి తత్త్వము. ఆ శక్తితత్త్వమునకు మధ్యనున్న శివతత్త్వము నకు నాద మని వ్యవహారము. నాదము చతుర్విధములు. శివ శక్తులు శబ్దార్థరూపులు. వాటికి కళాత్మకత్వముభయసాధారణ మైనది. వాటిమేళనము నాదబిందు కళాతీతమైనది. ఇది సమయ మత రహస్యము. *

ఈ పైని వివరించిన షట్చక్రబిందువు పది విధములు.

"దశధా భిద్యతే బిందుః ఏకఏవ పరాత్మకః
చతుర్ధాఽఽధారకమలే షోఢాఽధిష్ఠాన పంకజే
ఉభయాకారరూపత్వాదితరేషాం తదాత్మతా."

అనగా బిందువే మూలాధారకమలమునందు గల నాలుగు దళములందు నాలుగు విధములుగను, స్వాధిష్ఠాన కమలములందు గల ఆరుదళములందు ఆరువిధములుగను విభజింప బడినది. మూలాధార కమలదళములు బిందు చతుష్టయాత్మక ములు. అవి మనోబుద్ధి చిత్తాహంకారములు. స్వాధిష్ఠానదళము లారును కామక్రోధ లోభ మోహమదమాత్సర్యాత్మకములు. అందుచేత వీటికి సంహృతి బిందువు లని పేరు. పతంజలి స్వాధి ష్ఠాన బిందువులను "స్వాధిష్ఠానే సంహారషడ్బిందు కృతః" అని చెప్పెను. మణిపూరకకమలము దశదళములు కలది. ఇది ఆధార స్వాధిష్ఠానాత్మకము. అనాహతము పండ్రెండుదళములు కలది. ఇందు పూర్వార్థము దశదళములు. అవి మణిపూర ప్రకృతికములు. ఉత్తరార్థము దళద్వయము. ఇవి స్వాధిష్ఠానా

* "భిద్యమానాత్ పరాద్బిందో రవ్యక్తాత్మా రవోఽభవత్" — "శక్తేశ్చ్యుతశక్తితో నాదో నాదాద్బిందు సముద్భవః" (శారదా తిలక) భిద = అవయవే అను ధాతువువలన బిందుశబ్ద మేర్పడినది.

త్మకములు: విశుద్ధిచక్రమున పదునారు దళములు. అందు పండ్రెండును అనాహత చక్రాత్మకములైనవి. నాలుగు ఆధార చక్రాత్మకములు. ఆజ్ఞాచక్రము మూలాధార స్వాధిష్ఠాన స్వరూపములైన దళద్వయముకలది. ఈవిధముగా మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాకమలములు (వెరసి 40 దళములు కలవి) మూలాధార స్వాధిష్ఠానాత్మకమైనవే. కాబట్టి బిందు వొక్కటే పదివిధములుగా విభజింపబడినది. "బిందు శబ్దేన శూన్యాంతు తథాపిగుణ సూచకమ్" (జ్ఞానార్ణవము).

అంతర్యాగమున షట్చక్రసేవ, ధారణ కలవు.

షట్చక్రసేవ :—ఆధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రము లారింటియందు ఆధార స్వాధిష్ఠాన చక్రములు తామిస్రలోకములు. అవి ఉపాసింపతగవు (భవేన్మూలాధారం తదుపరితనం చక్రమపితద్వయం తామిస్రాఖ్యం శశికిరణ సమ్మేళనవశాత్-పరిత్యాజ్యమభయమ్) .మణిపూరక చక్రాది సహస్రకమలమువరకు పూజింపతగినవి. ఈ వివరమునే కాళిదాస మహాకవి సకలజననీస్తోత్రమునందు వ్రాసెను.

"చతుష్పత్రాంతష్షడ్దలపుట భగాంతస్త్రివలయ
స్ఫురద్విద్యు ద్వహ్ని ద్యుమణి నియుతాభద్యుతిలతే
షడశ్రం భిత్వాఽఽదౌ దశదళమథ ద్వాదశదళం
కళాశ్రం చ ద్వ్యశ్రం గతవతి నమస్తే గిరిసుతే"

మణిపూరకచక్రమును పూజించు వారికి సార్ష్టిరూపమైన ముక్తి లభించునట. సార్ష్టిరూపమైన ముక్తియనగా దేవీపుర సమీపమున వేరొకపురము నిర్మించుకొని దేవికి సేవ

చేయు వానిస్థితి. అనాహతకమలమును పూజించువారికి సాలోక్య ముక్తి లభించుట. సాలోక్య ముక్తి యనగా దేవి యొక్క పట్టణమునందే నివసించుచు సేవసేయుట. విశుద్ధి చక్రమును పూజించువారికి సామీప్యముక్తి కలుగునట. సామీప్యముక్తి యనగా దేవ్యంగ సేవచేయుట. ఆజ్ఞాచక్రమును పూజించు వారికి సారూప్యముక్తి కలుగునట. సారూప్య ముక్తి యనగా దేవీ సమానరూపమునందుట. ఈ నాలుగు విధములైన ముక్తి బాహ్యాదుఃఖ నివారకము. కాబట్టి గౌణ ముక్తి. సహస్రారకమ లోపాసనచేయు వారికి సాయుజ్యము. అనగా దేవీరూపము నందుట. అనగా దేవితో నైక్యము అది పరానందాభిఖ్యమైనది.

ధారణ :—ధారణ ముక్తి కల దని ప్రసిద్ధము. ధారణ మనగా కమలములందు నాదముచేత కళచేత వాయువుయొక్క నిరోధము. ఇది మూలాధారము మొదలు ఆజ్ఞాచక్రమునంకు ఆరు విధములు. సహస్రారమందు సమయాభిఖ్య కలది. ఒక్కొక్క కమలమునందు ఏబది విధములు. నాదబిందుకళలతో వేర్వేరుగ కలియుటచేత ననంతమైనవి.

ఆధారాది షట్చక్రములలో ధారణకు ప్రత్యేక ఫలము లున్నవి.

ఆధారచక్రమున ధారణకు ఫలము మతి. మతి యనగా రాబోవుదాని నెరుగుట. స్వాధిష్ఠానచక్రమున ధారణకు ఫలము స్మృతి. స్మృతి యనగా గడిచినదాని నెగురుట. మణిపూరకచక్రమున ధారణకు ఫలము బుద్ధి. తాత్కాలికజ్ఞానమే బుద్ధి. అనాహతకమలమున ధారణకు ఫలము ప్రజ్ఞ. త్రైకాలిక

జ్ఞానము ప్రజ్ఞ. విశుద్ధచక్రమున ధారణకు ఫలము మేధ: అనుభూతమును మరచిపోకుండుట మేధ. ఆజ్ఞాచక్రమున ధారణకు ఫలము ప్రతిభ. నవనవోన్మేషశాలిని ప్రతిభ. సహస్రారకమలమున ధారణకు ఫలము సంవిత్: ఉత్తమ జ్ఞానము సంవిత్.

చతురర్థైక్య షడ్వర్థైక్యములవలన కుండలినీశక్తి ఊర్ధ్వముఖముగా ప్రయాణము చేయును. చతుర్వర్థైక్య షడ్వర్థైక్యములు 'తత్త్వమసి' మహావాక్యానుభవమే.

కుండలినీ:— కుండలినీశక్తి యగు పరాభట్టారికాదేవి సుషుమ్నా *నాడీమార్గమున ఊర్ధ్వాభిముఖ అయి మూలాధారమునుండి బయలుదేరి స్వాధిష్ఠానాదికమలము లారిటినీ, గ్రంథిత్రయమును -అతిక్రమించి స్వస్థానమైన సహస్రాంతర్గత చంద్రమండలమును చేరును. (సుషుమ్నాం సంయోజ్య శ్లథయతి చ షడ్ గ్రంథి శశినమ్.)

గ్రంథులు మూడును బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి అనునవి. గ్రంథి యనగా సత్యమగు చిత్కల అసత్యమగు మాయాస్వరూపప్రకృతి, యీ రెండును మేళనము పొంది పోల్చుటకు వీలుగాక అన్యోన్యము కలిసి యుండుట. "గ్రంథిర్నామ సత్యాసత్య వస్తుద్వయస్యాభేద్యం అన్యోన్య తాదాత్మ్యాపన్నత్వం గ్రంథిః" "ధియం స్వప్రకాశవిమర్శ శక్తిం గ్రసతి మాయామూ పేణాచ్ఛాద్యగృహ్ణాతీతి గ్రంథిః".

మూలాధారస్వాధిష్ఠానములపైన బ్రహ్మగ్రంథిస్థానము

---

* నాడీమండల వివరములు ఒకటవ అనుబంధమున కలవు.

(వృథ్వ్యాప్య చక్రద్వితయం బ్రహ్మగ్రంథి పదోదితం-వాయవ్య సంహిత) స్వాధిష్ఠాన మణిపూరకములమధ్యను వాగ్భవ మాయాబీజస్థానము బ్రహ్మసరస్వతుల స్థానము. సకలమునకు అధిష్ఠానమైన చిత్కళ అనే ఆత్మను అవిద్యారూపముగా నావరించి జీవు డను భ్రమను చిత్కలయందు కలుగజేసినందున అన్నమయకోశమైన స్థూలదేహమునందు నేనను అభిమానము కలిగి జాగ్రదవస్థను పొందిన విశ్వుడను జీవుడు బ్రహ్మగ్రంథి యనిపించుకొనును. సంవిద్రూపిణి యైన జ్ఞానాకృతి పరాశక్తి కృపతో తన నిజస్వరూపము చిత్కలయేగాని స్థూలశరీరము కాదను జ్ఞానము లభించును. అదే బ్రహ్మగ్రంథి భేదము.

అనాహత విశుద్ధకమలములమధ్య కామరాజ మాయాబీజస్థానమందు (లక్ష్మీనారాయణస్థానమందు) ప్రాణమయ మనోమయ విజ్ఞానమయమైన మూడుకోశములను సూక్ష్మశరీరమం దభిమానము కలవాడై స్వప్నావస్థను పొంది తైజసు డను పేరుగల జీవుడు భావభావములు బింబప్రతిబింబములతో సమానమైన జీవబ్రహ్మల అన్యోన్యాధ్యాస విష్ణుగ్రంథి యని చెప్పబడుచున్నది. విష్ణుగ్రంథిని భేదించుట యనగా అనాహత చక్రమున నాదబ్రహ్మాకారమైన మంగళధ్వనులతో సాధకులకు చిత్కళాదర్శనమై ధ్యాననాదార్ఢ్యము గురుకటాక్షమువలన విచారణా బలమువలన జీవత్వము స్వప్నసదృశ మని స్థూలము వలెనే సూక్ష్మశరీరముకూడ కల్పితముగాని తన నిజరూపము కాదని నిశ్చయజ్ఞాన ముదయించును. ఇది విష్ణుగ్రంథిభేదము. (విష్ణుగ్రంథి పదోనోక్తం తైజసం సర్వసిద్ధిదమ్).

రుద్రగ్రంథి యనగా రెండుదళములుగల ఆజ్ఞాచక్రము

పై భాగమందు త్రిపుటిరూపమైన మూలప్రకృతియొక్క స్థానములో ప్రతిబింబ ఆనందమయకోశరూప సుషుప్త్యవస్థను పొందిన ప్రాజ్ఞుడైన జీవుడు ప్రతిబింబాసమానుడై జీవబ్రహ్మాలయొక్క అన్యోన్యాధ్యాసనే రుద్రగ్రంథి. ఇది కేవల మిథ్యారూపము. చిత్కళ పరానాడీరూపముగా స్వస్థానమును పొందు ప్రయత్నమున స్వస్థానరూపమును తెలియుటే రుద్రగ్రంథి భేదము. (ఆకాశాజ్ఞాద్వయీ రూపం చక్రద్వితయముత్తమమ్। రుద్రగ్రంథిపదేనోక్తం మంగళాయతనం మహత్ ॥).

స్వస్థానమైన సహస్రారాంతర్గత చంద్రమండలమును కుండలినీరూప పరాభట్టారిక చేరగా — ఆ చంద్రమండలము శైత్యాధిక్యము చేత ఘనీభవించినఅమృతమయముగానున్నది. దానియందు అగ్నిరూప పరాశక్తిప్రవేశించుటచేత అమృతము ద్రవించి వర్షించును. ఆ సుధావృష్టిచేత నాడీ సముదాయము తుష్టిని పొందును. గ్రంథిత్రయభేదనే శరీరత్రయమునందు అహంభావనారూపభ్రమ నివారణమైన దన్నమాట. అప్పుడు స్వస్థానమైన సహస్రారప్రాప్తి. స్వస్వరూపమైన చిత్కళ తానే నని తెలుసుకొనుట. సర్వచేతనత్వముచిత్కళదే కాబట్టి సకలమును చిన్మయముగా భావించుట జరుగును. అది స్థిరమైన భావము. అది జీవన్ముక్తి. (సుధాధారాసారైః స్నపయసి తనుంభైందవకలే).

ఈ వివరములు వామకేశ్వర తంత్ర గ్రంథమం దిట్లు కలవు.

శ్లో. భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా
శక్తిః కుండలినీ నామ బిసతంతునిభాఽఽశుభా ।

మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ।
పద్మాసనగతస్స్వస్థో గుదమాకుంచ్య సాధకః
వాయుమూర్ధ్వగతిం కుర్వరన్ కుంభకావిష్టమానసః ।
వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతో జ్వలన్
జ్వలనాఘాతపవనాఘాతైరున్నిద్రితోఽహిరాట్ ।
రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః
బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైన కమలాని భినత్తి షట్ ।
సహస్రకమలే శక్తిశ్శివేన సహ మోదతే
సాచావస్థా పరాజ్ఞేయా సైవ నిర్వృతికారణమ్ ॥

గ్రంథిత్రయ భేదనము గురించి ముండకోపనిషత్తునందిట్లు కలదు.

శ్రు. భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే
జ్ఞాత్వా దేవం పాశహానిః క్షీణైః క్లేశైర్న జన్మభాక్
దేవం మత్వా హర్షశోకౌ జహాత్యత్రైవ ధైర్యవాన్
నైనం కృతాకృతే పుణ్యపాపేన తాపయతః క్వచిత్
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి
ఏవం విద్వాన్కర్మణే ద్వేహి త్వాత్మానం స్మరేత్యదా
కృతే చ కర్మణి స్వాత్మరూపేణైవ పశ్యతి
యోవై తాం బ్రహ్మణో వేద అమృతేనావృతాం పురీం
తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ ఆయుః కీర్తిం ప్రజాం దదుః"

కఠవల్లి యందుకూడ నీప్రస్తావన యిట్లు కలదు.

శ్రు. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే
అస్తీత్యే వోపలబ్ధ వ్యస్తత్త్వభావేన చోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి
యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్యహృది స్థితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతేతి.

యాదా సర్వే ప్రముచ్యంతే హృదయస్యేహ గ్రంథయః
అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమితి
అత్ర ఉభయోః తత్త్వభావేనోపలబ్ధస్య ఇత్యుక్తమనేన
జీవబ్రహ్మణోరైక్యభావభావనయా అపరోక్షజ్ఞాన
దార్ఢ్యాన్మర్త్యః అమృతో భవతి బ్రహ్మైవ భవతీత
అత్ర అస్మిన్నేవ జన్మని జీవన్ముక్తదశాప్రాప్తిర్భవతీతి.

పరానాడీ స్వరూప వివరణము, కుండలినీశక్తి చంద్ర మండల ప్రవేశము శ్రుతి ప్రమాణములే. కఠోపనిషత్తునం దీవిధముగా నున్నది. శ్రు. శతం చైకాచహృదయస్య నాడ్యా స్తాసాం మూర్ధానమభినిస్సృతైకా, తయోర్ధ్వమాయన్నమృత త్వమేతి విష్వఙ్ఞన్యా ఉత్క్రమణేభవం తీతి.

అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముంజాదిషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్ర మమృతిమితి" యోగశిఖోపనిత్తునం దీ విధముగ నున్నది.

శ్రు. సుషుమ్నాయై కుండలిన్యై సుధాయై చంద్రమండలాత్
మనోన్మన్యై నమస్తుభ్యం మహాశక్త్యై చిదాత్మనే.

ఏకోత్తరం నాడీశతం తాసాం మధ్యే పరా స్మృతా
సుషుమ్నా తు పరే లీనా విరజా బ్రహ్మరూపిణీ
ఇడా తిష్ఠతి వామేన పింగళా దక్షిణేన తు
తయోర్మధ్యే పరాస్థానం యస్తం వేద స వేదవిత్.

యోగినీహృదయమనే గ్రంథమున యీ వివరము లిట్లుకలవు.

"తథా సర్వరహస్యార్థో కథయామి తవానఘే,
మూలాధారే తటిద్రూపే వాగ్భవాకారతాం గతే
అష్టావింశత్కలా యుక్తాపంచాశద్వర్ణవిగ్రహా
విద్యాకుండలినీరూపా మండలత్రయభేదినీ
తటిత్కోటినిభప్రభ్యాబిసతంతు నిభాఽఽకృతిః
వ్యోమేందుమండలాసక్తా సుధాస్రోతస్స్వరూపిణీ
ఏషాస్యాత్మేతిబుద్ధిస్తురహస్యార్థో మహేశ్వరీ ఇతి॥

(అత్ర బిసతంతుః కమలనాళాంతరతంతుః అతికృశాకృతిరితి.)

అష్టావింశతికలాయుక్తా = శ్రీవిద్యా షోడశాక్షరీరూపమని భావము. షోడశాక్షరియందు అంతర్గతమైన పంచదశాక్షరీ రూపకూటత్రయవిభజనముతో కలసిన అష్టావింశతి యగును. పంచాశద్వర్ణవిగ్రహా = అకారాదిక్షకారాంత మాతృకావర్ణశరీర. ఈ వర్ణములు యోగినీ రూపములతో అంతరకమలము లందున్నవి.

## ప్ర బో ధ ము

కుండలినీ ప్రబోధమును గురించిన సాంప్రదాయవచనముం భావము లిట్లున్నవి. సాధకుడు యమనియమాదులవలన పరిశుద్ధుడై గురూపదేశమువలన కుండలినీ ప్రబోధవిధానము

నెరుగనలెను. హంసమంత్ర ధ్యానముతో గుదస్థానమును కుంచింపనలెను. అప్పుడు జీవాత్మ హృదిస్థానమునుండి మూలాధారమునకు చేరును. తరువాత 'కూర్చ' బీజముతో కుండలినీ ప్రబోధము చేయవలెను.

హృదయూర్ధ్వం సమనునానీత్వాఽనం మూలాంబుజే
హుంకారేణ సముత్థాప్య కుండలీం పరదేవతామ్"
(కాళీకులామృతము.)

"ఆకృష్య ప్రణవేనైన జీవాత్మానం సగేంద్రజే
కుండలిన్యాసహస్రాణం గంధమాదాయసాధకః ।
సోహంతుమనునాదేవి స్వాధిష్ఠానే ప్రవేశయేత్"
(కంకాళమాలినీ తంత్రము).

"పబుద్ధ్వా నహ్ని యోగేన మనసామంధతాహతా
సూచీవగుణమాదాయ వ్రజత్యూర్ధ్వే సుషుమ్నాయా.
ఉద్ఘాటయేత్ కవాటం తు యథా కుంచికయాహఠాత్
కుండలిన్యా తథాయోగీ మోక్షద్వారం ప్రభేదయేత్"
(గోరక్షసంహిత).

ఆగమ కల్పద్రుమమందు మరియు విశదముగానున్నది. సాధకుడు పద్మాసనమున కూర్చుండవలెను. అంకమునందు పాణి ద్వయముంచుకొనవలెను. మానసికముగా హంసమంత్రపుర శ్చరణము చేయుచు గుదస్థానము కుంచించవలెను. అట్లే వాయువును పైకి లాగనలెను. తరువాత చక్రభేదనము చేయ వలెను. మూలాధారమున సుందరమైన త్రికోణమున్నది. దాని మధ్యమున కామవాయు వున్నది. అది కోటిసూర్యసమ ప్రకాశమైనది. కామవాయువు పైన స్వయంభులింగమును

చుట్టి కుండలినీ శ క్తికలదు. కామాగ్ని జ్వలనమువలన, కూర్చ మంత్రపురశ్చరణమువలన కుండలినీశ క్తి సహస్రారమందున్న పరమహంసాభిలాషిణి యగుచున్నది. "పద్మాసనే నివేశ్యాంకే తతః పాణిద్వయం న్యసేత్। తతో హంస ముపస్మృత్యశనైః సంకోచ యేద్గుదమ్। వాయు ముత్తోలయే త్తేన వ ర్త్మనాస పునః పునః। ఉత్తోల్య భేదయేచ్చక్రం తస్యానుస్థానముచ్యతే మూలాధారసరోజేతు త్రికోణమతిసుందరమ్। కామోభవతి తన్మధ్యే బాలార్కకోటిసన్నిభమ్। తదూర్ధ్వే కుండలీశ క్తిం స్వయం భూలింగవేష్టినీమ్." ఈ వివరములు భూతశుద్ధి తంత్ర మున కూడ కలవు. అయితే యీవివరములున్న శ్లోకము నాకు లభించిన భూతశుద్ధి తంత్రగ్రంథప్రతియందు లేవు. హఠయోగ ప్రదీపికయందు భూతశుద్ధి తంత్రివచనముగా ఉదహరింపబడి నవి. "హృదిస్థాకుంచికాం కృత్వాగత్వా తదుదరేశివే। కంఠా ద్యంసమను ప్రాప్యద్వారం కుంచికాయ హఠాత్॥ ఉద్ఘాట్య పరమేశాని పవనేన ప్రదీపయేత్। హుతాశన ప్రత ప్తాం తు తాపేన భృశమూర్ధ్వతామ్। ప్రసు ప్తాం నాగినీం లింగేయోని వక్త్రేప్రబోధయేత్। తతః ప్రచాలయే ద్వాయుం యావ న్నాట్యాం తరేషు చ। గురూపదిష్ట మార్గేణ సకృద్వాకుంభ కేనవై। ఆకమైవం తతోజీవం సుసు ప్తేవ యథా భృశమ్। ఊర్ధోచ్ఛ్వాసై రూర్ధ్వమ ధాన్ కారయేత్ పంకజాన్ శివే। ప్రబోధయన్ శనై ర్భానుం మేరు శృంగనయేత్ సుధీః॥అనగా సాధకుడు హృదయమును కుంచించవలెను (జాలంధరబంధము) కంఠమూలమును యితర భాగములను వాయు స్తంభనతో బంధించవలెను. తరువాత కుంచనాకార్యమువలన వాయువు

చేత కామవాయు ప్రకోపము చేయవలెను. మూలాధార లింగముపైన నిద్రించు కుండలినియోనివక్త్రమందు కామాగ్ని వలన మేలు కొలుపవలెను. దానిని ఊర్ధ్వమార్గమున ప్రవేశ పెట్టవలెను. గురూపదిష్టమార్గమున కుంభకముతో నాడీపూర కము చేయవలెను. అట్లు జీవుని గుప్తమార్గమున ఊర్ధ్వపథము నందు ప్రయాణము చేయించవలెను. శ్వాసవలన కమలము లను ఊర్ధ్వముఖములుగా చేయవలెను. ప్రబోధింపబడిన కుండ లినీ శక్తిని మేరు శృంగమునందున్న హంస సన్నిధికి చేర్ప వలెను. అనగా సహస్రారమునకు చేర్చవలెను.

పై పాఠములనుబట్టి తేలిన సారాంశ మీ విధముగా చెప్పవచ్చును.

సాధకుడు పద్మాసనమునం దుండవలెను. చేతులను అంకమునం దుంచుకొనవలెను. చిత్తమును ఖేచరీముద్రతో ఏకాగ్రము చేయవలెను. గాలి పూరించి కుంభించి, హృదయ మును కుంచించవలెను. గాలి విడువరాదు. అప్పుడు గుదస్థాన మును కూడ కుంచించి (అపానవాయు స్తంభన) వాయువును పైకి లాగవలెను. ఇలాగుటలో మూలాధారకమలమందున కర్ణికలోని త్రికోణనివాసి యగు కామవాయువును వామా వర్తముగా త్రిప్పవలెను. అట్లు చేయుటవలన కామాగ్ని ప్రజ్వలించును. కుండలిని మేలుకొనును. స్వయంభూలింగ వక్త్రమును భేదించి-కూర్చ బీజముతో కుండలినీశక్తిని (పరమ హంసాభిలాషిణిగా నున్న దానిని) ఊర్ధ్వగమనము చేయించ వలెను.

కుండలినీశక్తి ఊర్ధ్వప్రయాణములో 3 లింగములను 6 చక్రములను 5 శివులను (పంచబ్రహ్మలను) అధిగమించును.

ఆ యా చక్రములందు ఆ యా చక్రస్థ శివుని విముగ్ధునిచేసి ఆ యా చక్రసౌందర్యమును గ్రహించి శాశ్వతుని చేయును. ఆయా చక్రములందు దేవి ఆయా రూపములను (తత్తద్రూపములను) ధరించును. అనగా వైఖరీత్యాదిరూపములు. సహస్రారపర బిందువును చేరునప్పటికి పరాస్వరూపమును ధరించియుండును. హంస మంత్రముతో సుషుమ్నా మార్గమున చక్రభేదనము చేయనలెను. సూత సంహితాభాష్యమున శ్రీ విద్యారణ్యులు పారమార్థిక శరీరములో సుషుమ్నయందు ప్రవేశించి వాయువహ్నిరూపములనొంది పోవునప్పుడా ప్రదేశముల నా యా చక్రములు "నకేంద్రమార్గాత్ ఇవప్రదీపః" అన్నట్లు ఆవిర్భవించునని, ఇవి సుషుమ్నాగమన స్వభావమని తెలిపిరి.

చక్రభేదనవివరములు శాక్తానందతరంగిణియందును, మాయాతంత్రమునందును కలవు.

సహస్రారమున కుండలిని పరబిందువు యందైక్యమును చెందును. సాధకులకు శివశక్త్యాత్మకమైన జ్ఞానమువలన పరమస్థితి లభించును. శివశక్తి సమ్మేళనము సామాన్యముగా సర్వ ఆగమగ్రంథములందును వివరింపబడు విషయమే. గంధర్వ మాలికయందు, శారదాతిలకమునందు, మాయాతంత్రము నందు సువిస్తరముగా నున్నవి.

కుండలిని పరబిందువునందు ఐక్యముచేసి పరబిందువును చిదాత్మయందైక్యముచేయుట సమాధి. ఇది లయయోగమే. మంత్రతంత్ర ప్రకాశికయందు, కంకాళమాలినీ తంత్రమునందు లయయోగవివరములు కొన్ని కలవు. విశ్వ

తంత్రము, సంమోహనతంత్రము కూడ లయయోగమును చర్చించినవి.

ఇందు చతుర్విధ షడ్విధ ఐక్యానుసంధానములు వివరింపబడినవి. వీటితో ఇంచుమించు సరిపోవుచున్న అంతర్యాగ విధానము భావనోపనిషత్తునందు కలదు. భావనోపనిషద్వ్యాఖ్యానమును రెండవ అనుబంధముగా చేర్చడమైనది. నిత్యా సాధనావిశేషము చక్రమంత్రముల కైక్యము మూడవ అనుబంధముగా చేర్చడమైనది. శ్రీచక్రస్వరూపవర్ణనము గల దేవీ ఖడ్గమాలా స్తోత్రము ఐదవ అనుబంధముగా చేర్చడమైనది. ఇది సంస్కృత నాటకము కాదు కాబట్టి గోపుచ్ఛవిధముగ (సాహిత్యదర్పణము) నుండుట లేదు.

శ్లో. భూమౌస్ఖలితపాదానాం భూమి రేవావలంబనమ్ ।
త్వయి జాతాపరాధానాం త్వమేవ శరణం శివే ।

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యదత్రాః స్థిరై రంగై స్తుష్టువాగ్ం స స్తమాభిః। వ్యశేమ దేవహితం యదాయుః । స్వ స్తిన ఇంద్రో వృద్ధశ్రవాః । స్వ స్తినః పూషా విశ్వవేదాః । స్వ స్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వ స్తినో బృహస్పతిర్దధాతు ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్లో. సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ।

శ్లో. సదాత్మ ధ్యాననిరతం విషయేభ్యః పరాఙ్ముఖమ్ ।
నామిశా స్త్రేషు నిష్ణాతం చంద్రశేఖరభారతీమ్ ॥

శ్లో. చైతన్యః శాశ్వతః శాంతో వ్యోమాతీతో నిరంజనః ।
బిందునాదకలాతీత స్తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో. విద్యానిధి స్త్వభినవో విద్యాతీర్థాభిధో మహాన్ ।
అవిద్యాద్విపపంచాస్యో జయత్యద్య జగద్గురుః ॥

ఓం సహనా వవతు । సహనౌభున క్తు । సహవీర్యం కరవావహై ।
తేజస్వి నావధీతమ స్తు మావిద్విషావహై ।
ఓం శా న్తి శ్శా న్తి శ్శా న్తిః ॥

శ్రీ లలితామహాత్రిపురసుందరీ మాణిక్యపాదుకార్పణమ స్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

# శ్రీ చక్ర విలసనము

## *నాడీమండల వివరణము

(ఒకటవ అనుబంధము).

మానవ స్థూలదేహమున డెబ్బది రెండువేల నాడులున్నవి. ఆ నాడులలో గుదస్థానముకంటె కొంచెము పైన లింగస్థానముకంటె క్రిందుగా శరీరమధ్యమున మూలాధార చక్రము విలసిల్లుచున్నది. ఆ మూలాధారము మొదలుకొని సహస్రార కమలము పర్యంతము వీపు తట్టున వీణాదండము వలె సర్వనాడులకు ఆధారమైన బ్రహ్మదండి యనబడుచున్న యొక పెద్దయెముక కలదు. అది రెండువైపులను నదుకబడిన వెదురువలె నుండును. అది ఆధారచక్రముతో కూడినదే. దీనికి మేరుదండ మని పేరు కలదు.

బ్రహ్మదండి మొదటనున్న మూలాధారచక్రముయొక్క మధ్యకోణమునుండి బ్రహ్మరంధ్రమునవరకు బ్రహ్మనాడి వ్యాపించి యున్నది. ఈ బ్రహ్మనాడికే సావిత్రి సరస్వతి అని నామాంతరములు. దీనికే సుషుమ్నా నాడి అని కూడ వ్యవహారము. ఈ సుషుమ్నానాడి కుండలినీ యను పేరుగల పరాశక్తి యుక్తమైనది. కుండలినీశక్తి నాగకన్యాకాకృతిని పొంది మూలాధార చక్రమునందు శిరస్సును ఊర్ధ్వకుండలియందు

---

* నాడీ వివరములు. 'షట్చక్రనిరూపణ' భూతశుద్ధతంత్రము, సమ్మోహనతంత్రము, శారదాతిలకము, మాయాతంత్రము, గోరక్షాసంహిత, తంత్ర చూడామణి, రుద్రయామళము, గౌతమీయతంత్రమునందు కలవు.

పుచ్ఛమును కలిగియున్నది. సుషుమ్నా మధ్యభాగమునకుండ లిని కి తామరతాడులోని నూలువలె కలదు. సుషుమ్నా నాడియే ప్రాణవాయువు, జఠరాగ్ని, బుద్ధి, ప్రణవము అను వాటికి స్థానము. లలితాసహస్రనామావళిలో శ్రీదేవికి 'కుండ లినీ బిసతంతునిభాకృతీ' అని కలదు.

ఆ బ్రహ్మనాడియొక్క యెడమ కుడి ప్రక్కలందు ఆధారచక్రము మొదలుకొని నాసికాగ్రపర్యంతము నాజ్ఞీ చక్రమునచేరి ఇడాపింగళానాడులున్నవి. ఇడానాడికి పితృయాన మని చంద్రనాడి యని నామాంతరములు. పింగళానాడికి దేవయాన మని సూర్యనాడి యని నామాంతరములు. ఇడా నాడి చంద్రమండలమున చరించునది. పింగళానాడి సూర్య మండలమున చరించునది.

శ్లో. ఇడా చ నామనిశ్శ్వాసా । సోమమండలసంచరా
పితృయానమితిజ్ఞేయం । వామమాశ్రిత్యతిష్ఠతీ।

ఇడానాడి పునరావృత్తికి అనుకూలము. ధూమమార్గము. ఇడానాడి యెడమముక్కులోని యూపిరి నిశ్శ్వాసరూపముగ చంద్రమండలము నాశ్రయించి మూలాధారమాదిగ బ్రహ్మ రంధ్రపర్యంతముగా నుండును.

దేహముయొక్క దక్షిణభాగమున అగ్నిమండల గోచ రమై పుణ్యకర్మానుసారిణియై యుండునది పింగళానాడి యన బడును.

శ్లో. దక్షిణే పింగళానాడీ । వహ్నిమండలగోచరా ।
దేవయానమితిజ్ఞేయం । పుణ్యకర్మానుసారిణీ।

పింగళానాడి పునరావృత్తిరహితమైనది. దేవయానము.

నాడీచక్రము పొక్కిలిని ఆశ్రయించియున్నది. దాని స్వరూపము కోడిగ్రుడ్డువలె నున్నది. ఇడాపింగళానాడులు నాడీచక్రమునం దావిర్భవించినవి. నేత్రముల చివరవరకును వ్యాపించియున్న నాడులు గాంధారి హస్తి జిహ్వా అని పిలువబడుచున్నవి. చెవులను రెంటిని పొందియున్న నాడులు పూష అలంపూష యని పిలువబడుచున్నవి.

శుక్ల అనబడు నాడి కనుబొమల నడుమయందున్నది. ముక్కుయొక్క రెండు ద్వారములును చెవుల రెండు రంధ్రములును కనుబొమలయొక్క క్రిందిభాగమున కలసియున్నవి. ఆ ప్రదేశమునకు శృంగాటకము చతుష్పదము అను పేర్లు కలవు.

గంగా యమునా సరస్వతీ యను పేర్లుగల ఇడాపింగళా సుషుమ్నా నాడులు కనుబొమల మధ్యస్థానమున చేరుచున్నవి. దానికి త్రికూటమని త్రివేణీసంగమ మని పేరు.

సరస్వతీ నాడీశాఖ వాక్ప్రసారిణియై నోటియందు నాలుక చివరవరకు వ్యాపించియున్నది. విశ్వోదరి యనునాడి భక్ష్య భోజ్యాదిచతుర్విధమగు ఆహారమును భక్షించును. కంఠస్థానమందున్న పయస్వినీనాడి ఆకలిదప్పులను కలిగించును. మరియు జలపానము చేయును.

నాడీచక్రమునం దుద్భవించిన మూడునాడు లధోముఖముగా నున్నవి. అవి రక్తా, సినీవాలీ, కుహూ అనునవి. రక్తానాడి రేతస్సును, సినీవాలీనాడి మూత్రమును, కుహూనాడి మలమును వెలుపలికి త్రోయుచున్నవి.

శంఖినీదామినీనాడులు భుజింపబడిన ఆహారముయొక్క

సారమును సంగ్రహించి బ్రహ్మరంధ్రమంటుచేరి అమృతమును కలిగించుచున్నవి.

హృదయస్థానమైన అనాహతచక్రమున నూటొక్క నాడు లున్నవి. వాటిలో నొకటి అమృతనాడి. అది చిదాకాశమును పొందినది. అమృతనాడీమార్గమునే మోక్షమార్గమని, కైవల్యమార్గమని విద్వాంసులు పలుకుదురు. (శ్రు. శతైంచైకా చ హృదయస్యనాడ్యః తాసాం మూర్ధానమభినిస్సృతైకా తయోర్ధ్వ మాయాన్నమృతత్వమేతి తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః).

అన్ని నాడులందు ఇడాపింగళాసుషుమ్నా ముఖ్యమైనవి. సుషుమ్నానాడికి నాడీశిరోమణి యనిపేరు. ఇట్లు ఊర్ధ్వముఖముగా, అధోముఖముగా, తిర్యఙ్ముఖముగా నాడులు వ్యాపించినవి. నాడులకు శ్రేష్ఠమైన రంధ్రము లున్నవి. నాడీసంఖ్య డెబ్బది రెండువేలు. సుషుమ్నామార్గమునకు తపోమార్గమని పేరు.

శ్లో. దేహేతు, పశ్చిమే, భాగే, వీణాదండాఖ్యదేహభృత్ ।
దీర్ఘాస్థిమూర్ధపర్యంతం బ్రహ్మదండేతి కథ్యతే ॥
తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః ।
ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ ।
సర్వంప్రతిష్ఠితం తస్మిన్ సర్వగంధర్వతోముఖం ।
తస్య మధ్యగతాస్సూర్య సోమాగ్ని పరమేశ్వరా ॥
భూతలోకాదిశః క్షేత్రసముద్రాః పర్వతాశ్శిలాః ।
ద్వీపాశ్చ నిమగ్నా వేదశ్శాస్త్రవిద్యాకళాక్షరాః ॥
సర్వమంత్రపురాణాని గుణాస్సత్వాదయోపిచ ।

బీజం బీజాత్మ కా స్తేషాం క్షేత్రజ్ఞః ప్రాణవాయవః ॥
సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం ।
అమరావతినాసేగ్రే పూర్వస్యాం దిశి వ ర్తతే ।
అగ్నిలోక స్తథా జ్ఞేయశ్చక్షు స్తేజోవతీ పురీ ।
యామ్యా సంయమనీ శ్రోత్రేయమలోకప్రతిష్ఠితః ।
నైరుతో వ్యాదత త్పార్శ్వ నైరుతో లోకఆశ్రితః ।
విభావతీ ప్రతీచ్యాం తు పృష్ఠే వారణికాపురీ ।
వాయోర్గంధవతీకర్ణ పార్శ్వ లోకప్రతిష్ఠితః ।
సామ్యే పుష్పవతీసామ్యా సోమలోక స్తు కంఠతః ॥
వామకర్ణే తు విజ్ఞేయా దేహమాశ్రిత్య తిష్ఠతి
వామచక్షుషి ఐశానం శివమ స్తిమనోన్మయం ।
మూర్ధ్ని బ్రహ్మపురీజ్ఞేయా బ్రహ్మాండం దేహమాశ్రితమ్ ॥

అని *ఉత్తరగీతయందు బ్రహ్మాండదేహసామ్యగుణములు చెప్పబడినవి.

నాడులయందు కదలుట, పరుగెత్తుట, కంపము నొందుట, ముడుచుట, బడలికచెందుట మొదలగు గుణములు కలిగినట్టి ప్రాణ అపానవ్యాన ఉదానసమాననాగకూర్మకృకర

* ఉత్తరగీత :— మహాభారతమున అశ్వమేధపర్వాంతర్గతము. ఇది భగవద్గీతకు పరిశిష్టభాగమువంటిదే. జ్ఞానమార్గప్రతిపాదకము. దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయమునకు చెంది తంజావూరుమండలమున చంప కారణ్యక్షేత్ర (మన్నారుగుడి) వాసియగు శ్రీ పరమానందతీర్థులవారు దీనికి టీక వ్రాసిరి. వారు 16 వ శతాబ్దివారు. శ్రీ గౌడపాదాచార్యుల వారు ఉత్తరగీతకు సంస్కృతమున వివరణము వ్రాసిరి.

దేవదత్త ధనంజయము లనెడు దశవిధప్రాణములు సంచరించు చుండును.

ప్రాణవాయువు వక్షస్థలమున వసించి (హృదిప్రాణః అని అమరము) వశిష్ఠుడను అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడి ఉచ్ఛ్వాసరూపముచేత ఇడాపింగళలను నాడీరంధ్రమార్గముగ వెలుపలికి పండ్రెండు అంగుళములు ప్రసరించి అచ్చటనే లయించును. 'ప్రకర్షేణ బహిరానయతి శ్వాసాదీనితి ప్రాణః' అని వ్యుత్పత్తి. నీఞ్ప్రాణే యని ధాతువు. ప్రకర్షముగా శ్వాసాదులను బయలువెడలించున దని యర్థము.

అపానవాయువు నిశ్శ్వాసరూపముగ ప్రాణవాయువునకు క్రిందివైపుగ నిర్గమించుచు అధోముఖనాడీ త్రితయము వలన (అనగా కుహూ, సినీవాలి, రక్తానాడులు) మలమూత్ర రేతస్సులను బహిర్గతముచేయును. దానికి స్థానము గుద. (గుదేఽపానః అని అమరము). విశ్వకర్తలనెడు అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడినదై అధోముఖసంచారము చేయును. కుహూనాడివలన మలమును, సినీవాలీనాడివలన మూత్రమును, రక్తానాడివలన శుక్లమును బహిర్గతములగును. "అధో విణ్మూత్రా నిత్యాజనానంత్యనేనేత్యపానం" అనగా దీని వలన మలమూత్రాదులు అధోముఖముగా విసర్జింపబడి ప్రాణులు జీవింతురు- అని వ్యుత్పత్తి. మరియు 'అధోమలాన్నయతీతివా అపానః' - మలమూత్రాదులను అధోభాగమును పొందించునది - అనియువ్యుత్పత్తి.

వ్యానవాయువు శరీరమంతయు ప్రసరించి (వ్యానస్సర్వ శరీరగః) యున్నది. దానికి విశ్వయోని అధిష్ఠానదేవత. ఆ

దేవతచేత ప్రేరేపింపబడి బాహ్యమైన శీతోష్ణములను లోపలకు, ఆంతరశీతోష్ణములను బయటకు తోపింపజేయుచుండును. భక్షితాహారసారమును శరీరమాద్యంతము వ్యాపింపజేయును. "వినయతీతివ్యానః"- శరీరమంతట నుండున దని యర్థము.

ఉదానవాయువు కంఠమందు వసించును (ఉదానః కంఠదేశ స్థః - అని అమరము). అజుడ నెడు అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడి మనస్సుయొక్క సంకల్పవికల్పములను, జిహ్వాద్యష్టస్థానములందు (కొండనాలుక, దవడలు, కంఠము, శిరస్సు, దంతములు, పెదవులు, నాసిక, మిశ్రములును అష్టస్థానములు)పంచాశద్వర్ణోచ్చారణరూపముగా వాక్కును కలుగజేయును. సుప్తావస్థయందు చతుర్దశేంద్రియములను స్వాధీనపరచుకొని తనకు కారణమైన అజ్ఞానమునందు లయించును. జాగ్రదవస్థలో ఆయా యింద్రియములను వాటివాటిస్థానములందు నిలుపును. ఉత్క్రమణకాలమున సర్వేంద్రియములను సంగ్రహించి లోకాంతరమునకు పోవుటకు సమర్థమైయున్నది. ఈ వాయువు సుషుమ్నామార్గమున సహస్రారమువరకు సంచరించుచుండును. "భాషణాది సామర్థ్యజననా దూర్ధ్వమనంతనే నేత్యుదానః" అనగా 'మాటలాడుట మొదలైన సామర్థ్యములను కలుగజేయుటవలననే ఊర్ధ్వప్రదేశమున దీనివలన బ్రతుకుదుగా—' అని వ్యుత్పత్తి. మరియు "ఉత్ ఊర్ధ్వమానయతిశబ్దాదీనితివా ఉదానః" అనగా శబ్దములు మొదలైనవానిని ఊర్ధ్వమునకు తీసికొనివచ్చునట్టి దని వ్యుత్పత్తి.

సమానవాయువు నాభిప్రదేశమున (సమానోనాభిసంస్థితః అని అమరము) నివసించును. దానికి అధిష్ఠానదేవత

జయుడు. ఆ దేవతచేత ప్రేరేపింపబడి జఠరాగ్నిని ప్రజ్వలింప జేసి భుజింపబడిన ఆహారమును జఠరాగ్నిచేత పచనము చేయించి శరీరమందుగల డెబ్బదిరెండువేల నాడులకును విభాగించును. ఆహారసారమును సమానముగా విభాగించున దని వ్యుత్పత్తి.

పైన వివరింపబడిన వాయువులు పంచప్రాణవాయువులు. మిగిలిన వైదును ఉపవాయువులు.

"నాగః హిక్కాకరః; కూర్మః నిమేషోన్మేషకారకః క్షుతం కరోతికృకరః; దేవదత్తో విజృంభణమ్ ధనంజయః స్థౌల్యం కరోతి మృతంచాపి న ముంజతి"(ఇతి మానసోల్లాసేసురేశ్వరాచార్యః తత్ టీకాకారః రామతీర్థశ్చ).

నాగవాయువు వాంతిని కలుగజేయును. కూర్మవాయువు కంటిరెప్పలను మూయించుట తెరపించుట చేయును. దేవదత్త వాయువు ఆవలింతను కలుగజేయును. కృకరవాయువు తుమ్మును కలుగజేయును. శరీరమాద్యంతము వ్యాపించియున్న ధనంజయ వాయువు మరణానంతరము కూడ శరీరమును విడువదు. శరీరమందు వ్యాపించి శరీరమును వృద్ధిపరచును.

శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః.

శ్రీః

# శ్రీ చక్ర విలసనము

## భావనోపనిషత్తు

### రెండవ అనుబంధము

### అవతారిక

శ్లో. సదాశివసమారంభాం విద్యాశంకరాచార్యమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందేగురుపరంపరామ్ ॥

ఈశ్వర ఉచ్ఛ్వాస నిశ్శ్వాసరూపములైన వేదములు అపౌరుషేయములు. మహర్షులు తపస్సామర్థ్యముచేత వేద మంత్రద్రష్టలై లోకోపకారార్థము వేదములను శిష్య ప్రశిష్య సంప్రదాయమున లోకవ్యాప్తిగావించినారు. వేదము కర్మ, ఉపాసనా, జ్ఞానములను కాండత్రయము కలిగియున్నది.

బ్రహ్మకాండ మను నామాంతరముగల ఉపాసనాజ్ఞాన భాగములకు ఉపనిషత్తు లని పేరు. ఒక్కొక్క వేదశాఖకు నొక్కొక్క ఉపనిషత్తు కలదట. కాని నేటికి 108 ఉపనిషత్తులు మాత్రమే లభించుచున్నవి. వీనిలో దశోపనిత్తులను పేరుగల ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములు (ఈశ, కేన, కఠప్రశ్న ముండక మాండూక్యతిత్తిరిః ఐతరేయంచ, ఛాందోగ్యం బృహదారణ్యకందశ) బహుళప్రచారమున నున్నవి. మిగిలిన ఉపనిషత్తులలో 20 ఉపనిషత్తులకు యోగోపనిషత్తు లని పేరు. అవి 1. అద్వయతారక, 2. అమృతనాద,

3. అమృతబిందు, 4. క్షురిక, 5. తేజోబిందు, 6. త్రిశిఖ బ్రాహ్మణ, 7. దర్శన, 8. ధ్యానబిందు, 9. నాదబిందు, 10. పాశుపతబ్రహ్మ, 11. బ్రహ్మవిద్య, 12. మండలబ్రాహ్మణ, 13. మహావాక్య, 14. యోగకుండలి, 15. యోగచూడా మణి, 16. యోగతత్త్వ, 17. యోగశిఖ, 18. వరాహ, 19. శాండిల్య, 20. హంస అను పేర్లు గలవి.

సామాన్య వేదాంతోపనిషత్తులని పిలువబడుచున్నవి యిరువదినాలుగు. అవి: 1. అక్షి, 2. అధ్యాత్మ, 3. అన్నపూర్ణ, 4. ఆత్మ, 5. ఆత్మబోధ, 6. ఏకాక్షర, 7. కౌషీతకి బ్రాహ్మణ, 8. గర్భ, 9. నిరాలంబ, 10. పైంగల, 11. ప్రాణాగ్నిహోత్ర, 12. మంత్రిక, 13. మహా, 14. ముక్తిక, 15. ముద్గల, 16. మైత్రాయణి, 17. వజ్రసూచిక, 18. శారీరక, 19. శుకరహస్య, 20. సర్వసార, 21. సావిత్రి, 22. సుబాల, 23. సూర్య, 24. స్కంద – అనునవి.

సన్న్యాసోపనిత్తు లని పేరుగలవి 17 ఉపనిషత్తులు. అవి 1. ఆరుణి, 2. అవధూత, 3. కఠరుద్ర, 4. కుండిక, 5. జాబాల, 6. తురీయాతీతావధూత, 7. నారదపరివ్రాజక, 8. నిర్వాణ, 9. పరబ్రహ్మ, 10. పరమహంసపరివ్రాజక, 11. పరమహంస, 12. బ్రహ్మ, 13. భిక్షుక, 14. మైత్రేయి, 15. యాజ్ఞవల్క్య, 16. శాట్యాయనీయ, 17. సన్న్యాస అనునవి.

శైవోపనిషత్తులని పేరుగలవి 15 ఉపనిషత్తులు. అవి 1. అక్షమాలిక, 2. అధర్వశిరస్, 3. అధర్వశిఖ, 4. కాలాగ్ని రుద్ర, 5. కైవల్య, 6. గణపతి, 7. జాబాలి, 8. దక్షిణా

మూర్తి, 9. పంచబ్రహ్మ, 10. బృహజ్జాబాల, 11. భస్మజాబాల, 12. రుద్రహృదయ, 13. రుద్రాక్షజాబాల, 14. శరభ, 15. శ్వేతాశ్వతర అనునవి.

వైష్ణవోపనిషత్తులని పేరుగలవి 14 ఉపనిషత్తులు. అవి 1. అవ్యక్త, 2. కలిసంతారణ, 3. కృష్ణ, 4. గరుడ, 5. గోపాలతాపిని, 6. తారసార, 7. త్రిపాద్విభూతిమహానారాయణ, 8. దత్తాత్రేయ, 9. నారాయణ, 10. నృసింహతాపిని 11. రామతాపిని, 12. రామరహస్య, 13. వాసుదేవ, 14. హయగ్రీవ అనునవి.

దేవ్యుపనిషత్తులని, శాక్తేయోపనిత్తులని చెప్పబడినవి 8 ఉపనిషత్తులు. అవి 1. త్రిపుర, 2. త్రిపురతాపిని, 3. దేవి, 4. బహ్వృచ, 5. భావన, 6. సరస్వతీరహస్య, 7. సీతా, 8. సౌభాగ్యలక్ష్మి అనునవి.

భావనోపనిత్తు దేవ్యుపనిషత్తులలోనిది. ఉపనిషత్తు అనగా బ్రహ్మవిద్య. ఇందుల కనేక వ్యుత్పత్తి అర్థములు సాంప్రదాయికముగ చెప్పబడుచున్నవి.

వైయాకరణమైన వ్యుత్పత్తులు మూడుకలవు.

1. 'ఉపనిషదితి బ్రహ్మవిద్యా తచ్ఛీలినాం కర్మజన్మమరణాది నిశాతనాత్.' ఉపనిషత్తు బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మజన్మమరణాదులను శిథిలము చేయునది. కాబట్టి ఉపనిషత్తు అని చెప్పబడును.

2. తదవసాదనాద్వా లేక అజన్మమరణాదికమైన దానిని నశింపజేయునది కాబట్టి బ్రహ్మవిద్య ఉపనిషత్తు అని చెప్పబడుచున్నది.

3. బ్రహ్మణః ఉపనిగమయితృత్వాత్ - తదర్థత్వాత్ గ్రంథోఽప్యుపనిషత్ లేక - బ్రహ్మపదార్థలాభమును కలుగ జేయునది కాబట్టి బ్రహ్మవిద్య ఉపనిషత్తని చెప్పబడుచున్నది. ఆవిషయమును కలిగియున్న గ్రంథముకూడఉపనిషత్తనబడును.

ఈమూడు నిర్వచనములు గాక సామాన్యముగా చెప్ప బడుచున్న మరియొక నిర్వచనమున్నది. 'ఉపనిషణ్ణం అస్యాం పరంశ్రేయం ఇతి ఉపనిషత్తు' —తదర్థత్వాత్ 'గ్రంథోఽప్యు పనిషత్' ఈ బ్రహ్మవిద్యయందు మోక్షము సమీపవిషయమై యున్నది కాబట్టి ఉపనిషత్ అనబడును. ఆ విద్యాప్రయోజన మైన గ్రంథముకూడ ఉపనిషత్తనబడును.

ఉపనిషత్ శబ్దము ఉ+ప+ని అను ఉపసర్గలతో కలసిన షద్ల ధాతుజన్యము. క్విప్ ప్రత్యయరూపము. ఈ ధాతువునకు 'షద్ల-విశరణ, గతి, అవసాదనేషు' అని మూడర్థము లున్నవి. విశరణ మనగా శిథిలమగుట. గతి అనగా పొందుట. అవసాధన మంటే నాశనము. ఈ మూడర్థములకు తగినట్లే పై వైయా కరణ నిర్వచనత్రయ మున్నది.

ఈ భావములే శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారి నిర్వచనములం దున్నది. శ్రీమదాచార్యులవారి సాంప్రదాయక నిర్వచన శ్లోకము లిట్లున్నవి.

"ఉపనీయ తమాత్మానం బ్రహ్మపాస్తద్వయం యతః।
నిహంత్యవిద్యాం తజ్జం చ తస్మాదుపనిషత్ భవేత్ ॥
నిహంత్యనర్థమూలాం స్వావిద్యాం ప్రత్యక్తయా పరమ్।
నయత్యపాస్తసంభేదమతశ్చోపనిషత్ భవేత్ ॥

ప్రవృత్తిహేతూన్ నిశ్శేషాన్ తన్మూలోచ్ఛేదకత్వతః।
యతోఽవసాదయేద్విద్యా తస్మాదుపనిషత్ భవేత్

శ్రీమదాచార్యులవారు భాష్యమున ఉపనిషత్ శబ్ద వ్యాఖ్యానము చేయుచునిట్లు వివరించిరి. "య ఇమాం బ్రహ్మ విద్యాముపయంతి ఆత్మభావేన శ్రద్ధాభక్తి పురస్సరాః సంతః తేషాం గర్భజన్మ జరారోగాద్యనర్థ పూగంనిశాతియను పరం వాబ్రహ్మగమయతి అవిద్యాది సంసారకారణం చ అత్యంత మవసాదయతి-వినాశయతీ త్యుపనిషత్; ఉప + నిపూర్వస్య సదేః ఏవ మర్థస్మరణాత్." (భక్తిశ్రద్ధలతో సేవించుచున్న వారియొక్క జన్మజరామరణాది అనర్థములను బ్రహ్మవిద్య శిథిలము చేయును; పరబ్రహ్మను పొందించును; సంసార హేతువైన అవిద్యను నాశనముచేయును. కాబట్టి బ్రహ్మవిద్య 'ఉపనిషత్తు' అనబడును. ఉప+ని+పూర్వకమైన సద్ధాతువున కిట్టి యర్థమున్న దని పండితుల అభిప్రాయము).

ముక్తికోపనిషత్తులో 108 ఉపనిషత్తుల వివరము లున్నవి. ఇవిగాక ప్రకటింపబడిన యితర ఉపనిషత్తులు 70 కలవు. ఇవి గాక మరియు 37 ఉపనిషత్తులున్న వని గీతా ప్రెస్సువారి ప్రకటనమునం దున్నది.

ఉపనిషత్తులలో కొన్ని పద్యరూపమున, కొన్ని గద్య రూపమున కలవు. గద్యభాగములుకూడ లలితపదయుక్తమై ఓజోగుణప్రధానమై, లయాన్వితమై, అర్థప్రతీతి కలిగియున్నవి. ఉపనిషత్తులు వేదశాఖల చివరిభాగము లందుండుటచేత వేదాంతము లనబడును. పరతత్త్వ ప్రకాశనము లగుటచేత వేదశిరస్సు లని పేరు కలిగినది.

భావనోపనిషత్తు అధర్వణ వేదాంతర్గతమైనది. దీని శాంతిపాఠ మిట్లున్నది. "ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యేమ క్షభిర్యజత్రాః స్థిరై రంగైస్తుష్టువాగ్ం స స్తనూభిః। వ్యశేవ దేవహితం యదాయుః స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః స్వస్తినస్తార్క్ష్యో అరిష్ట నేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు, ఓం శ్శాంతిశ్శాంతిశ్శాంతిః."

శాంతిపాఠముయొక్క భావము "నాయొక్క చెవులు మొదలగు యింద్రియము లెల్లప్పుడు శుభచింతనము నందే నిమగ్నములై యుండునుగాక. ఇంద్రుడు మొదలగు దేవతలు నాయొక్క ఇంద్రియములను ఆవేశించి నన్ను సర్వదాశుభ కార్యములందు ప్రవర్తింపజేయుచుందురుగాక !"

" భావనోపనిషత్సార తాత్పర్యము "

' భద్రం కర్ణేభిరితి శాంతిః '

మూ. "ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః" 1

తా. చిద్విద్యాపూర్ణ దీక్షనొసగిన శ్రీ గురువులు శ్రీ పరాదేవి స్వరూపులే. శ్రీ గురుదేవుల అనుగ్రహముచేత మహా వాక్యప్రాప్తి తదర్థాను సంధానరూప బ్రహ్మాత్మైక్యసిద్ధి లభించుచున్నందున గురువులే పరమకారణమైన పరాశక్తి స్వరూపు లని చెప్పబడుచున్నది.

మూ. "తేనసవరంధ్ర రూపో దేహః నవచక్రంరూపం శ్రీచక్రం." 2

తా. కావున తొమ్మిది రంధ్రములు కలిగియున్న సాధకుని శరీరమే (స్థూల) తొమ్మిది చక్రములు కలిగియున్న శ్రీచక్రముగా భావింపనలసియున్నది. (శ్రుతి "దేహో దేవాలయః

ప్రోక్తో జీవో దేవస్సనాతనః త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్).

మూ. "వారాహీపితృరూపా, కురుకుల్లావళి దేవతామాతా."3

తా. బ్రహ్మాండమైన శ్రీచక్రమున శ్రీదేవి ప్రధాన దేవత. ఆమె శరీరోద్భవములైన తేజః కిరణములు అణిమాదులైన దేవతలై యున్నవి. ప్రతి జన్యవస్తువునకు - అట్లే సాధకుని శరీరమునకు తలిదండ్రు లుండవలయును కాబట్టి వారాహీ స్వరూప దేవత తండ్రియని కురుకుల్లావళీ స్వరూప దేవత తల్లియని సంభావింపవలసి యున్నది. (మాతా పరిమితం దదాతీతిమాతా- మాతృచ సాధకుని యోగ్యతనుబట్టి మోక్షమో కామ్యమో ప్రదానము చేయునది.)

సుధాసింధువు మధ్యమణి ద్వీపమందున్న శ్రీదేవీ పట్టణమునకు అవ్యక్తము మహత్తత్వము అనురెండుప్రాకారములు (కోటగోడలు) కలవు. వాటి మధ్యలో రెండు సరస్సు లున్నవి. అవి ఆనందవాపీ, విమర్శవాపీ అను పేర్లు కలవి. ఆనందవాపి ప్రకాశాంశమైన శివతత్త్వభాగము. విమర్శవాపి విమర్శాంశమైన శక్తితత్త్వభాగము. విమర్శవాపికి అధిష్ఠానదేవత 'కురుకుల్లావళీ' అను పేరుగల దేవత. ఈప్రముఖమైన దేవత కాబట్టి మాతృదేవతగా భావింపవలసి వచ్చినది. కురుకుల్లావళీ దేవతా విషయము లలితా స్తవరాజమునందు కనుపించుచున్నది. ఛాందోగ్యోపనిషత్తులో (8-5-3) బ్రహ్మలోకమున కేగు అర్చిరాదిమార్గమున సముద్రములవంటి రెండు సుధాసరస్సు లున్నవని చెప్పబడినది. ఆ సరస్సులు ఇరమ్మదీయములట. ఇర మనగా

అన్నము. మదీయ మనగా ఆనందము. అమృతవర్షముగల సోమసవన మను వృక్షమున్నదట. అచ్చట అపరాజితా నామపట్టణ మున్నదట.

మూ. "పురుషార్థాస్సాగరాః" 4

తా. సప్తసముద్రములు సప్తద్వీపములు పైన సుధా సముద్రము కలదు. సుధాసముద్రమధ్యమున శ్రీదేవి నివాస మైన మణిద్వీపమున్నది. ధర్మ అర్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములును కలనని భావింపవలెను. శారీరకముగ, మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహతవిశుద్ధ ఆజ్ఞా సహస్రారకమలములు సప్తద్వీపములు. కమలములపైన సప్త సముద్రములు. అన్నిటిపైన సుధాసముద్రము. మణిద్వీపము. అదే ద్వాదాశాంతము. ఈ వివరములు సులభముగా గ్రాహ్యమగుటకు పట్టీగా చూపబడినవి. (149 వ పుట చూడుడు.)

బిందుస్థానమునకు ద్వాదశాంతమని పేరురానడమునకు కారణ మది యీ క్రిందిక్రమమున పంద్రెండవది కావడనే. (1) మూలాధారమునకు క్రిందుగానున్న రక్తవర్ణముగల సహస్రదళకమలము. దీనికి కులపద్మ మని వ్యవహారము. (2) ఆపిమ్మటగల అష్టదళపద్మము, (3)తరువాతనున్న షడ్దళపద్మము, (4) మూలాధారపద్మము,(5) స్వాధిష్ఠానము,(6)మణిపూరము, (7) అనాహతము, (8) విశుద్ధము, (9)విశుద్ధలంబికాగ్రము అష్టదళము, (10) ఆజ్ఞాచక్రము, (11) శుక్లవర్ణముగల సహస్రార కమలము, (12) సహస్రారకమలకర్ణిక. దీనికి అకులపద్మ మని పేరు కలదు. దీనిని బిందుస్థానమని చంద్రమండలమని వ్యవహా

| శుక్లపక్ష తిథి | బీజము | స్వరము | అధిష్ఠాన నిత్యాదేవత | స్థానము | సప్తద్వీప, సప్త సముద్రము | బహుళ తిథి |
|---|---|---|---|---|---|---|
| 1 | క | అం | కామేశ్వరీ | మూలాధారపాయువు | జంబూద్వీపము | 15 |
| 2 | ఏ | అః | భగమాలినీ | శూన్యం | లవణసముద్రము | 14 |
| 3 | ఈ | ఇం | నిత్యక్లిన్నా | స్వాధిష్ఠానము (లింగము) | ప్లక్షద్వీపము | 13 |
| 4 | ల | ఈం | భేరుండా | శూన్యం | ఇక్షుసముద్రము | 12 |
| 5 | హ్రీం | ఉం | వహ్నివాసినీ | మణిపూర (నాభి) | కుశద్వీపము | 11 |
| 6 | హ | ఊం | మహావజ్రేశ్వరీ | శూన్యం | సురాసముద్రము | 10 |
| 7 | స | ఋం | శివదూతీ | అనాహత (హృదయ) | క్రౌంచద్వీపము | 9 |
| 8 | క | ౠం | త్వరితా | శూన్యం | సర్పిస్సముద్రము | 8 |
| 9 | హ | ఌం | కులసుందరీ | విశుద్ధ (కంఠం) | శాకద్వీపము | 7 |
| 10 | ల | ౡం | నిత్యా | శూన్యం | దధిసముద్రము | 6 |
| 11 | హ్రీం | ఏం | నీలపతాకా | ఆజ్ఞా (భ్రూమధ్యం) | శాల్మలీ ద్వీపము | 5 |
| 12 | స | ఐం | విజయా | శూన్యం | క్షీరసముద్రము | 4 |
| 13 | క | ఓం | సర్వమంగళా | సహస్రారము | పుష్కరద్వీపము | 3 |
| 14 | ల | ఔం | జ్వాలామాలిని | శూన్యం | జలసముద్రము | 2 |
| 15 | హ్రీం | అః | చిత్రా | కర్ణిక (చంద్రమండలం) | మేరువు | 1 |
| 16 | శ్రీం | అం | లలితా | ద్వాదశాంతం (మహాశూన్యము) | సుధాసింధువు | 16 |

రించుట కలదు. ద్వాదకమలాంతమందున్నది ద్వాదశాంతము.
మూ. "దేహోనవరత్నద్వీపః." 5

తా. సాధకునియొక్క శరీరమే సుధాబిందుమధ్యగత మణిద్వీపమని భావింపవలెను. మణిద్వీపము శ్రీదేవీనిలయము.

మూ. "త్వగాదిసప్తధాతుభిరనేకైస్సంయుక్తా సంకల్పాఃకల్పతరవః". 6

తా. సప్తధాతువుల (చర్మము, రక్తము, మాంసము, మెదడు, అస్థి, మజ్జా. - ఎముకలలోనిగుజ్జు, - శుక్లములు, త్వగసృఙ్మాంసమేదోఽస్థిమజ్జాశుక్లాశ్చధాతవః) తో కలసినట్టి సాధకుని శరీరములోని సంకల్పములే కల్పవృక్షసముదాయ మని భావింపవలయును.

మూ. "తేజఃకల్పకోద్యానం." 7

తా. సహస్రారగత చిత్కలాప్రతిబింబము జీవస్వరూపము. దానియొక్క కాంతికిరణములు శరీరమంతయువ్యాపించి యున్నవి. ఆతేజస్సును కల్పకఉద్యానమని భావింపవలయును.

మూ. " రసనయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయ లవణ రసాష్షడృతవః." 8

తా. నాలుకకు తెలియబడే షడ్రసముల (తీపి, ఉప్పు, కారము, వగరు, చేదు, పులుపు) ను ఆరు ఋతువులుగా భావింపవలయును. ఆరు ఋతువులు వసంతగ్రీష్మవర్ష శరత్ హేమంత శిశిరములు.

శ్రీదేవి నివాసమైన మణిద్వీపరూపమైన సాధకుని శరీరమును గురించి చెప్పబడినది. శ్రీదేవియొక్క పరివార దేవతలను-గురించి వివరింపబడనున్నది.

మూ. "క్రియాశక్తిపీఠంకుండలినీజ్ఞానశక్తిర్గృహా, ఇచ్ఛాశక్తి ర్మహాత్రిపురసుందరీ." 9.

తా. సాధకుని శరీరమున ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులున్నవి. ఈ మూడుశక్తుల నిర్వాహణమువలననే అన్ని పనులును జరుగు చున్నవి. ఇందు చేయవలయునను సంకల్పరూపమైన ఇచ్ఛాశక్తి ప్రధానమైనది. అదే శ్రీదేవి. జ్ఞానశక్తి మందిరము. క్రియాశక్తిపీఠము. ఈ విధముగా భావింపవలయును.

పరాశక్తియే ఇచ్ఛాశక్తి (యాసాంతరోహరూపాసా పరా అంతర్గతేచ్ఛాశక్తిః) జ్ఞానక్రియాశక్తులతో కలసి పశ్యంతీ మధ్యమా వైఖరీరూప మగుచున్నది.

మూ."జ్ఞాతాహోతాజ్ఞానమర్ఘ్యం, జ్ఞేయగ్ంహవిః, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయోనామభేదభావనగ్ం శ్రీచక్రపూజనమ్." 10

తా. సాధకుడే శ్రీచక్రఅంతరార్చనా యాగమునకు యజమాని. అతడే జ్ఞాత. (అనగా విషయపరిజ్ఞానము కలిగిన సాధకుడు.) అర్ఘ్యమేజ్ఞానము.హవిస్సు జ్ఞేయము. (తెలియదగినది) జ్ఞాతజ్ఞానము జ్ఞేయము - ఇవి మూడును త్రిపుటి. వీటిని ఐక్యముగా సంభావించుట శ్రీచక్రపూజ. త్రిపుటిలో జ్ఞాతజ్ఞాన జ్ఞేయములకు అభేదము సంభవించు టెట్లో వివరణ మిట్లు కలదు.

జ్ఞాతజ్ఞానము జ్ఞేయము.ఇందులో మధ్యపదము జ్ఞానము దానివలననే తెలిసికొనువాడు (జ్ఞాత) తెలిసికొనబడినది (జ్ఞేయము) కలుగుచున్నవి. (మధ్యవికాసాచ్చిదానందలాభో భవతి) ఈమధ్యపదమే మిగిలిన రెంటికి ప్రసవస్థానమన్నమాట. కాబట్టి అది వికసించినప్పుడు మిగిలినవి రెండును దానియందే

లీనము కాగలవు. అనగా జ్ఞానము అభివృద్ధిపొందినప్పుడు దానియందు జ్ఞాతము జ్ఞేయమును విలీనము కాగలవు. అప్పుడు నిలచునది జ్ఞాన మొక్కటే. అదే పరబ్రహ్మము. అదే ఆత్మయొక్క స్వస్వరూపము. అది బ్రహ్మానందము.

కనుక త్రిపుటిని లయింపజేయుట శ్రీచక్రపూజయై బ్రహ్మానందఫలదాయి యగును.

మూ. "నియతిసహితశృంగారాద యోనవరసాఅణిమాదయః"

తా. ఇప్పటివరకు శ్రీచక్రస్థానమైన మణిద్వీపమును గురించి, దేవతాపీఠమును గురించి, పూజనుగురించి చెప్పి, యిప్పుడు శ్రీచక్రముయొక్క నవావరణదేవతలను గురించి చెప్పబడుచున్నది. శ్రీచక్రార్చనము భూపురమునుండి ఆరోహణ క్రమమున చేయవలసియున్నది. కాబట్టి ప్రథమావరణ మందున్న దేవతలను గురించి ముందుగా చెప్పబడుచున్నది.

సాధకుని శరీరమున శృంగారరసము మొదలగు రసములు (నవ) ఆయాకాలములందు అనుభవికములే. ఈ నవ రసములు (శృంగారహాస్యకరుణ రౌద్ర వీరభయానకభీభత్స, అద్భుతశాంతములు) మొదటి ఆవరణయగు భూపురమున మొదటిరేఖయందున్న దేవత లని భావింపవలెను. వారు అణిమాసిద్ధి, లఘిమాసిద్ధి, గరిమాసిద్ధి, మహిమాసిద్ధి, ఈశిత్వసిద్ధి, వసిత్వసిద్ధి, ప్రాకామ్యసిద్ధి, భుక్తిసిద్ధి, ఇచ్ఛాసిద్ధి, ప్రాప్తిసిద్ధి, సర్వకామసిద్ధి అనువారు భూపురమున మూడురేఖ లున్నవి. వీరు మొదటి రేఖలోనివారు.

మూ. "కామ క్రోధ లోభ మోహమదమాత్సర్య పుణ్యాపాప మయాబ్రాహ్మ్యాద్యష్టశక్తయః."

తా. భూపురమున రెండవ రేఖయందున్న దేవత లెని మిది మంది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్స ర్యము లారును, పుణ్యపాపములు కలసి యెనిమిదియై భూపుర మున రెండవ రేఖయందు దేవతాకారములతో నున్న వని భావింపవలెను. ఆ దేవతలు బ్రాహ్మి, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మాహేంద్రి, చాముండా, మహాలక్ష్మి అనువారు. వారు అష్టమాతృకలు.

మూ. "ఆధారనవకంముద్రాశక్తయః." 13

తా. భూపురము మూడవ రేఖయందు తొమ్మిదిమంది ముద్రాదేవతలు కలరు. మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధలంబికాగ్ర ఆజ్ఞాసహస్రార ద్వాదశాంతములు తొమ్మిదియు తొమ్మిది ముద్రాదేవతలై భూపురము మూడవ రేఖయందు కలవు. ఆ ముద్రాదేవతలు "సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని అనువారు.

మూ. "పృథివ్యప్తేజోవాయ్వాకాశశ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థమనోవికారాష్షోడశశక్తయః."

తా. శ్రీచక్రమునకు రెండవ ఆవరణము షోడశదళ పద్మము. అందుపదునారుమంది దేవతలు కలరు. పృథివి జల అగ్ని వాయు ఆకాశము లను పంచభూతములు; జ్ఞానకర్మేం ద్రియములు (చెవులు చర్మము నేత్రములు జిహ్వా, నాసిక, వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ) మనస్సు కలసి పదు నారై పదునారు దేవతాకారములతో ద్వితీయావరణమునందు

కలవు. ఆ దేవతలు కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, మాయాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షిణి అనువారు.

మూ. "వచనాదానగమనవిసర్గానందహానోపాదానోపేక్షాబుద్ధ
యోనంగకుసుమాదిశక్త్యోష్టౌ." 15

తా. శ్రీచక్రమున మూడవ ఆవరణము అష్టదళపద్మము. ఇందు యెనిమిదిమంది దేవత లున్నారు. కర్మేంద్రియముల ధర్మము లైదును (వచనము, దానము, గమనము, విసర్గము అనగా మలవిసర్జనము, సంభోగాదిసుఖము) ప్రవృత్తి, నివృత్తి, ఉపేక్ష అనునవి మూడును కలసి యెనిమిదియై యెనిమిది దేవతాకారములు ధరించి తృతీయావరణమునందు కలవు. ఆ దేవతలు అనంగకుసుమా, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలిని అనువారు.

మూ. అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా,
యశస్వతీ, (పయస్వతీ) అశ్వినీ, గాంధారీ, పూషా;
శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా, చేతి,
చతుర్దశనాడ్య,సర్వసంక్షోభిణ్యాదిచతుర్దశారదేవతాః.

తా. శ్రీచక్రమునకు నాలుగవ ఆవరణము చతుర్దశారము. ఇందు పదునాలుగురు దేవత లున్నారు. అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వినీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా

అను పదునాలుగు నాడులు పదునాలుగు దేవతలై నాలుగవ ఆవరణమైన చతుర్దశారమునందు కలవు. ఆ దేవతలు సర్వ సంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వ సమ్మోహిని, సర్వ స్తంభిని, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వ రంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధికా, సర్వసంపత్తిపూరణి, సర్వమంత్రమయీ, సర్వద్వంద్వక్షయంకరి అనువారు.

మూ. ప్రాణాపాన, వ్యానో, దాన, సమాన, నాగ, కూర్మ,
కృకర, దేవదత్త, ధనంజయాదశవాయవస్సర్వసిద్ధి
ప్రదాది, దేవ్యో బహిర్దశారదేవతాః. 17

తా. శ్రీచక్రమున అయిదవ ఆవరణము బహిర్దశారము. ఇందు పదిమంది దేవత లున్నారు. ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానము లను ప్రాణములైదును నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ లను ఉపప్రాణములైదును కలసి దశదేవతలై అయిదవ యావరణమునం దున్నవి. ఆ దేవతలు సర్వసిద్ధిప్రద, సర్వప్రియంకరి, సర్వమంగళకరి, సర్వవశంకరి, సర్వకామప్రద, సర్వదుఃఖవిమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్న నివారిణి, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయిని అనువారు.

మూ. ఏతద్వాయుదశకసంసర్గోపాధిభేదేన రేచకపూరకశోషక
దాహకప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచ
విధోస్తి మనుష్యాణాం మోహకో దాహకో భక్ష్య
భోజ్యలేహ్య చోష్యపేయాత్మకం చతుర్విధమన్నం
పాచయంత్యేతాః దశధనకలాసర్వజ్ఞ త్వాద్యంతర్ద
శారదేవతాః. 18

తా. శ్రీచక్రమున ఆరవ ఆవరణము అంతర్దశారము.

దానియందు పదిమంది దేవత లున్నారు. పైనవివరించిన దశవిధ వాయువుల (ప్రాణము లైదు, ఉపప్రాణము లైదు) యొక్క సంసర్గమువలననే రేచక (ఊపిరి విడచుట) పూరక (ఊపిరి పూరించుట) శోషక (శోషిల్లుట) దాహక (దాహకగుణము) ప్లావకగుణములు కలుగుచున్నవి. అట్లే చతుర్విధాన్నములను పచనము చేయు శక్తులను కలుగుచున్నవి. ఇవి పదియు పది దేవతలై అంతర్దశారమునన్నవి. ఆ దేవతలు సర్వజ్ఞ, సర్వశక్తి, సర్వైశ్వర్యప్రద, సర్వజ్ఞానమయి, సర్వవ్యాధివినాశిని, సర్వాధారస్వరూప; సర్వపాపహర, సర్వానందమయి, సర్వరక్షా స్వరూపిణి, సర్వేప్సితఫలప్రద అనువారు.

మూ. శీతోష్ణసుఖదుఃఖేచ్ఛా సత్వరజస్తమోగుణావశిన్యాది శక్తయోష్టౌ. 19

తా. శ్రీచక్రమున యేడవ ఆవరణ అష్టకోణచక్రము. దానియందు యెనిమిది దేవతలు కలరు. శీత ఉష్ణ సుఖ దుఃఖ ఇచ్ఛ అనునవి ఐదును, సత్వరజస్తమోగుణములు మూడును కలసి యెనిమిదిమంది దేవతలై ఏడవ ఆవరణమం దున్నారు. ఆ దేవతలు వశినీ, కామేశ్వరి, మోదినీ, విమలా, అరుణా, జయినీ, సర్వేశ్వరీ, కౌలినీ అను వాగ్దేవతలు.

మూ. శబ్దస్పర్శరూప రసగంధాః పంచతన్మాత్రా పంచపుష్ప బాణాః. 20

తా. శ్రీదేవిహస్తమున ఐదు పుష్పబాణములను ధరించి యున్నది. శబ్దస్పర్శరూపరసగంధములను పంచభూతధర్మములైదును ఆపుష్పబాణములైనవి. ఆపుష్పములు తామరపువ్వు, అశోకపుష్పము, మామిడిపువ్వు, మల్లెపువ్వు, నల్లకలువ.

'మూ. మనఇక్షుధనుః నశ్యో బాణః రాగః పాశో ద్వేషో
ఙ్కుశః. 21

తా. శ్రీదేవి చేతియందున్న చెఱకువిల్లు సాధకుని మనస్సు. వశ్యత బాణము. అనురాగము పాశము. ద్వేషము అంకుశము.

మూ. అవ్యక్తమహత్తత్త్వాహంకారాః కామేశ్వరీ వజ్రేశ్వరీ
భగమాలిన్యోంత స్త్రికోణాగ్రగా దేవతాః. 22

తా. శ్రీచక్రమునకు యెనిమిదవ ఆవరణము త్రికోణము. అందు ముగ్గురు దేవతలుకలరు. అవ్యక్త మహత్తత్వ అహంకారము లీ దేవతలైనవి. ఆ దేవతలు కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అనువారు. వారు పార్వతీ లక్ష్మి సరస్వతులే.

మూ. పంచదశతిథిరూపేణ కాలస్యపరిమాణావలోకనం పంచ
దశ నిత్యాః. 23

తా. శ్రీచక్రమునందు బిందువును క్రమ్ముకొనిఉన్న మూడు (త్రిభుజ) రేఖలందు రేఖకు అయిదుమంది చొప్పున పదునైదుమంది దేవత లున్నారు. కాలపరిమాణమును తెలుపు పదునైదు తిథులును పదునైదు నిత్యాదేవతలైనవి. ఆనిత్యా దేవతలు కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్న, భేరుండ, వహ్నివాసిని, శివదూతి, త్వరిత, కులసుందరి, నిత్యా నీలపతాకా, విజయ, సర్వమంగళ, జ్వాలామాలిని, చిత్రా అనువారు.

మూ. శ్రద్ధానురూపాధీర్దేవతాతయోః కామేశ్వరీసదానంద
ఘనాపూర్ణాస్వాత్మైకరూపా దేవతా. 24

తా. ఇంతవరకు సాధకుని శరీరమే శ్రీచక్ర మని చెప్పి

సాధకుని యింద్రియాదులు యెనిమిది ఆవరణదేవతలుగా చెప్ప బడినవి. ఇప్పుడు తొమ్మిదవ ఆవరణ అయిన బిందువునందు గల ప్రధానదేవత యగు శ్రీదేవిని గురించి వివరింపబడుచున్నది. బిందువునందున్న ప్రధానదేవత కామేశ్వరీ ద్వంద్వము.

అజ్ఞానులు తాము శరీరమనిజీవుడని పరిపరివిధములుగా భావించెదరు. ఆత్మ శరీరమున ప్రజ్ఞానమైయున్నది. శ్రద్ధాను రూపమైన బుద్ధి శ్రీచక్రమందు బిందువుగా నున్న కామేశ్వరీ కామేశ్వరము. సాధకుని ఆత్మయే కామేశ్వరీదేవి యని భావము. ఆత్మకును శ్రీదేవికిని ఐక్యమును సంభావింపవలెను.

సాధకుని ఆత్మయే శ్రీదేవి అయినప్పుడు, ఆతడు తటస్థ లక్షణముగల బ్రహ్మమే. ఇదే మహావాక్యములచేత నిరూపింప బడుచున్న బ్రహ్మాత్మైక్యానుసంధానము. ఇదే విదేహకైవ ల్యము. జీవన్ముక్తి.

మూ. సలిలమితిసౌహిత్యకరణగ్ంసత్వమ్. 25

తా. ఇంతవరకు సాధకుని శరీరమందే శ్రీచక్రము, ఆవరణలు, ప్రధానదైవము కల వని నిరూపించి ఇప్పుడు ప్రధానదేవతను అర్చించుటకు అంతర్యాగవిధానము వివరింప బడుచున్నది.

ఇది అంతరంగపూజావిధానము. బాహిరమైనవస్తువులు వాసనాదూషితములు కాబట్టి పరిహార్యములు. ఆంతరవస్తు వులచేతనే పూజ జరుగవలెను. పూజకు జలము ముఖ్యము కదా. శరీరమందున్న సత్వరజస్తమోగుణములను మూడు గుణములలో సత్వగుణమును అభివృద్ధిచేసికొని మిగిలిన రెండు

గుణములను తగ్గించుకొనుటవలన ప్రవృద్ధమైన సత్వగుణాధి క్యనే జలము.

మూ. కర్తవ్యమకర్తవ్యమాదాసీన్యమితివివేకభావనాయుక్త ఉపచారః. 26

తా. దేవతకు బాహ్యపూజావిధానమున రాజోపచార దేవోపచారములు కలవు. అంతరపూజలో ఉపచారమెట్టి దనగా అనిత్యమైనవాటియందు ప్రవృత్తి త్యజింపవలసియున్న దనియు, బ్రహ్మసత్యమే సత్యము కాబట్టి నివృత్తి అవలంబింప వలసియున్నదనియు, ఉదాసీనభావము తూష్ణీంభావముగా రూపొందకూడదనియు వివేకభావమును కలిగించుకొనుట. ఇదే ఆత్మరూపమైన ప్రధాన దేవతోపచారము.

మూ. "అస్తినాస్తీతి కర్తవ్యతా అనుపచారః." 27

తా. బ్రహ్మవస్తువు ప్రత్యక్షముగా కనుపింకపోయినను సర్వత్ర వ్యాప్తిచెంది యున్నది. సర్వజీవభావమును బ్రహ్మకలే. బ్రహ్మమున్నదని గ్రహింపవలెనని వేదవాక్కు కలదు. (అస్తి బ్రహ్మేతివ్యజనాత్) కాబట్టి వేదప్రమాణమునకు విరుద్ధముగా బ్రహ్మపదార్థము లేదనుకొనుట అపచారము. అపరాధము. పూజయందు అపచారము చేయరాదు.

మూ. బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్త్వి త్యావాహనమ్. 28

తా. పూజావిధానమందు ఆవాహన కలదు. త్వగాది బాహ్యజ్ఞానేంద్రియములందు మనోబుద్ధి అంతఃకరణలనే అంత రింద్రియములందును గలశక్తి సామర్థ్యరూపముగ ఆత్మదేవత

భాసించుచున్నదని గ్రహించి వాటివాటియొక్క స్వరూపము లను అవగాహన చేసుకోనడమే ఆవాహన.

మూ. తస్య బాహ్యాంతః కరణానామేకరూప విషయగ్రహణ మాసనమ్. 29

తా. పూజావిధానమునందు ఆసనము సమర్పింపవలసి యున్నది. జ్ఞానేంద్రియ కర్మేంద్రియదశకము అంతఃకరణ చతుష్టయము కలసి పదునాలుగును భిన్నభిన్న ధర్మములు కలవి. ఆధర్మములను నిరోధించి యివియన్నియు బ్రహ్మ పదార్థమేనని సంభావించుట ఆసనసమర్పణ.

మూ. రక్తశుక్లపదైకీకరణం పాద్యమ్. 30

తా. పూజావిధానమునందు పాద్యము (పాదములకు యిచ్చు జలము) అర్పింపవలసి యున్నది. (పాద్యం శ్యామాక దూర్వాబ్జ విష్ణుక్రాంతాభి రుచ్యతే.)

శ్రీదేవి సాధకుని ద్వాదశాంతమందు చిత్కలారూప మున నున్నది. తనవలన ఉత్పన్నమైన ప్రపంచమునకు స్థాన ముగా ఉన్న ఆత్మశక్తియందు ప్రవేశించి బ్రహ్మము శుక్ల బిందు రూపమును పొందెను. విమర్శశక్తి స్వాంతర్గత శుక్ల బిందువునందు ప్రవేశించి రక్తబిందు భావమును పొందును. అప్పుడు అన్యోన్య సమ్మేళనము వలన మిశ్రబిందు వేర్పడినది. రక్త శుక్లబిందువులు చంద్రాగ్నులు. మిశ్రబిందువు సూర్య బింబము. మిశ్రబిందువు వికసనము పొందినప్పుడు నాదము ఉత్పన్నమగును. దానినుండి కలలు. అవి కలాతత్త్వ భువ నాత్మకములు.

బిందునాదములకు అహమనే వర్ణద్వయము శరీర

మైనది. మిశ్రబిందు స్వరూప శ్రీకామేశ్వరీ ద్వంద్వమునకు యెడమపాదము రక్తవర్ణమైన విమర్శాంశము కుడిపాదము శుక్లవర్ణమైన ప్రకాశాంశము. ఈ రెండు చరణముల సమ్మేళన ప్రభాపుంజమును ధ్యానించుచు వాటికి అభేదభావన స్థిరము చేసుకోవడమే పాద్యమును సమర్పించుట.

మూ. ఉజ్జ్వలదామోదానుసంధానమర్ఘ్యమ్. 31

తా. పూజయందు అర్ఘ్యమొసగుట ఆచారము. అర్ఘ్య మనగా శ్రమనివారకమైన అల్పాహారము. ఆత్మయే శ్రీదేవి యని గ్రహించి బ్రహ్మానందానుసంధానము చేయుటయే అర్ఘ్య ప్రదానము. (అఖిలాఘ ప్రశమనర్ధనప్రవృత్తి వివర్ధనాత్ । అనర్ఘ్య ఫలదానాచ్చ అర్ఘ్యమిత్యభిధీయతే).

మూ. స్వచ్ఛం స్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్. 32

తా. పూజయందు ఆచమన మిచ్చుట ఆచారము. ఆత్మ రూపమైన శ్రీదేవి స్వచ్ఛమైనదనియు, ఆస్వచ్ఛత స్వయం సిద్ధమైన దనియు గ్రహించుటే ఆచమన మిచ్చుట. బ్రహ్మ పదార్థము తేజఃపూర్ణమై స్వచ్ఛమై నిర్గుణమని చెప్పుటకు అనేకముగా వేదవాక్య ప్రమాణములు కలవు. (జాతీలవంగ కక్కోలైరుక్త మాచమనీయకమ్.)

మూ. చిచ్చంద్రమయీ సర్వాంగస్రవణగ్ం స్నానమ్. 33

తా. పూజయందు పంచామృతాదులతో దేవతలకు స్నానము చేయింపవలెను.

సుషుమ్నానాడి (కుండలినీ) మూలాధారము నుండి బయలుదేరి స్వాధిష్ఠాన మణిపూరక అనాహతవిశుద్ధ ఆజ్ఞాకమ

లములను స్పృశించుచు పుష్పమాలయందుగల సూత్రము వలె స్వాధిష్ఠానగతమైన అగ్నిని సహస్రారమునకు వేధించును. అప్పుడు అమృతధారాప్రవాహము కలుగును. అందువలన 72 వేల సంఖ్య గల నాడీసముదాయమునకు తృప్తికలుగును. అమృతవర్షమువలన ఉష్ణాధిక్యము తగ్గును. అగ్నివలన శీతాధిక్యముండదు. సమశీతోష్ణమగును. (ఈ వివరములు ముందు భాగమునకలవు.) అమృతవర్షమువలన శరీరమంతయు తడిసిన దని సంభావించుట ఆత్మదేవతకు స్నానము. అమృతవృష్టి చైతన్య వ్యాప్తియే.

అమృతవృష్టి కలుగుటకు అంతఃకరణశాంతి యుండవలెను. దేహమునందు సహస్రారము చిత్కలాస్థానము. చిత్కల సాక్షియే. భ్రూమధ్యము ఈశ్వరస్థానము. హృత్కమలము జీవస్థానము. ఉష్ణము మోహమువంటి గుణములు అగ్నిసంబంధములు. కామక్రోధములు ఆకాశాంశములు. భయ దుఃఖములు తమోగుణములు. ఇట్టి గుణములు జీవునియందు ఉద్రేకించినపుడు ఉష్ణాధిక్యమై సుధావృష్టి జరుగదు. పై గుణములు శమించి అంతఃకరణ శాంతి కలిగినప్పుడే సుధావృష్టి జరుగును. (శ్రు. అమృతస్య ధారా బహుధాదోహమానం చరణం నోలోకే సుధితాం కరోత్వితి) (దేహప్రక్షాలనం స్నానం సుగంధి సలిలైః సహ.)

మూ. చిదగ్నిస్వరూప పరమానందశక్తి స్ఫురణం వస్త్రమ్.

తా. పూజయందు దేవతకు వస్త్రము సమర్పించుట ఆచారము. వస్త్రము శరీరమును ఆచ్ఛాదించుటకు (కప్పుకొనుటకు) ఉద్దేశింపబడినది. సాధకుని శరీర చైతన్యమంతయు

చిత్కలా తేజస్సని గ్రహించి సర్వము బ్రహ్మాకారమని తెలిసి బ్రహ్మానంద స్ఫురణము కలుగజేసికొనుట వస్త్రప్రదానము.

మూ. ప్రత్యేకగ్ం సప్తవింశతిధా భిన్నత్వేనేచ్ఛా జ్ఞాన క్రియాత్మక బ్రహ్మగ్రంథి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్. 35

తా. పూజయందు దేవతకు బ్రహ్మసూత్ర మనబడు యజ్ఞోపవీతమును సమర్పించు టాచారము.

జగత్తు బ్రహ్మాకార మని యుద్బోధించు సూత్రము కాబట్టి బ్రహ్మసూత్ర మని పేరు వచ్చినది. సుషుమ్నా నాడికి బ్రహ్మనాడి యని నామాంతర మున్నది. కాబట్టి సుషుమ్నా నాడినే బ్రహ్మసూత్రముగా అంతరపూజయందు భావింపవలెను.

సమష్టిరూపమైన మూలావిద్య వ్యష్టిరూపమైన తూలావిద్య యను రెండు రూపములుగల మలినసత్వప్రధానయగు మూలప్రకృతి తన త్రిగుణములచేత తొలుత త్రిశక్తులుగా తోఁచి పిమ్మట ఆ త్రిశక్తుల పరస్పరసమ్మేళమువలన నవవిధము లయి మరల ఆ నవవిధాన్యోన్యసమ్మిళితముచేత సప్తవింశతి విధములయి తెల్లనివస్త్రమున చిత్రములు కల్పితమైనట్లు శుద్ధ బ్రహ్మమందు పైన జెప్పిన యిరువదియేడు భేదములుగల సృష్టి కలయట్లు కనబరచినది.

ఈ యిరువదియేడు భేదములుగల సృష్టికి కారణమైన ప్రకృతిమయమైన గాయత్రి మూడుపాదములును (భూర్భువస్సువయను) వ్యాహృతిత్రయముతోఁ కలసి యిరువదియేడు అక్షరములుకలవనియు దానిని ద్విజు లుపాసింపవలయుననియు వేదవేత్తల నిర్ణయము. గాయత్రికి ప్రతీకవంటి యజ్ఞోపవీతము

తొల్లుత ఏకసూత్రము. 96 బెత్తలు ప్రమాణము కలది. అవి తత్త్వములను సూచించును. సూత్రము అవిచ్ఛిన్నముగా త్రిగుణితమైనది. త్రిరావృత్తముచేసి రెండు అగ్రములుగా కలిపి గ్రంథినిర్మితము. ఒక గ్రంథి గల మూడు సూత్రములు. అనగా గ్రంథికలితములై మూడు అంతరసూత్రము లున్నవి. ఆ అంతరసూత్రములం దొక్కటొక్కటికి మూడుపోగులు కలవు. అనగా యజ్ఞోపవీతము తొమ్మిదిసూత్రములు కలిగి యిరువదియేడు తంతులు కలిగియున్నది. ఆ తంతువులే యిరువదేడు భేదములు గల జగత్తు. ఆ జగత్తుయొక్క రూపమైన యజ్ఞోపవీతమును ద్విజులు ధరించి బ్రహ్మపరమైన కర్మాచరణము చేయుచున్నారు.

గాయత్రి యజ్ఞోపవీత ప్రపంచవిచారణచేత యజ్ఞోపవీతమందున్న మూడు తంతువులకు కూటస్థానమైన ముడియే బ్రహ్మముడి యనియు, అదే అమలసత్వప్రధానమైన గుణసామ్యావస్థ యనియు తెలిసినపిమ్మట యజ్ఞోపవీతమును పరిత్యజించుట సన్న్యాసము. అట్లు చేయువాడే బ్రహ్మకాంశ మనుష్ఠించువాడు. ఈ విషయము తెలిసినవాడు సర్వకర్మవిముక్తుడు. జీవన్ముక్తుడు.

బ్రహ్మోపనిషత్తునందీ విషయ మిట్లు చెప్పబడినది. "శ్లో. న శిఖాం, న వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః । బ్రహ్మసూత్ర మిదం జ్ఞేయం సూత్రం నామ పరం పదం. । తత్సూత్రం ధారయేద్యోగీ స విప్రో వేదపారగః." (పండితుడు శిఖాధారణము ముండనము మొదలైన కర్మలు ముఖ్యములని తలపోయక వెలుపలి యజ్ఞోపవీతధారణము

వ్యర్థ మని తెలిసి బ్రహ్మసూత్ర ధారణమే ముఖ్య మని కను గొనును. బ్రహ్మసూత్ర మనగా త్రిగుణ విభాగములవలన నేర్పడిన యిరువదియేడు భేదములు గల ద్వివిధప్రకృతికంటె పరమమైన పద మని యర్థము. అట్టి బ్రహ్మసూత్రమును ధరించిన మహనీయుడు బ్రాహ్మణుడు. ఆయనయే యోగి. ఆయన వేదములపారమ్య మెరిగినవాడు.)

సుషుమ్నా నాడి యగు బ్రహ్మనాడియందు సూక్ష్మ నాడులు కలియుచోటు గ్రంథి. అక్కడ తత్త్వత్రయము. అది 27 సూక్ష్మనాడుల సముదాయము కలదే. కాబట్టి సుషుమ్నా నాడి యజ్ఞోపవీతమే. బాహ్యమైన యజ్ఞోపవీతము కంటె సత్యమైన దిది. సహజమైనది.

మూ. స్వవ్యతిరిక్తవస్తుసంగరహితస్మరణంవిభూషణమ్. 36

తా. పూజాయందు దేవతకు విభూషణములు సమర్పించుట యాచారము. జీవుడు తాను బ్రహ్మపదార్థమై, మాయా కారణముచేత తానొక మానవుడనని ప్రపంచాభిమానముతో భ్రమపతితుడైనాడు. కాబట్టి సాధకుడు తాను బ్రహ్మమేకాని తదితర పదార్థము కాదనియు, మాయాదివస్తువులతో తనకు సంబంధము లేదనియు తెలిసికొనుట ఆత్మస్వరూపమైన దేవ తకు ఆభరణములు సమర్పించుట.

మూ. సత్సంగపరిపూర్ణతానుస్మరణంగంధః. 37

తా. పూజయందు దేవతకు చందన మొసగుట యాచా రము. చందన మనగా శ్రీగంధము. గంధ మలదికొనుటచేత సువాసనాభరితమైన పావిత్ర్య మబ్బును. సాధకుడు తన సహ స్రార కమలమందు చిత్కళల కలవనియు, దానియొక్క కాంతి

శరీరమంతయు చైతన్యమయముగా వ్యాపించియున్న దనియు తెలిసికొని, అందుచేత తాను సర్వదా పవిత్రుడనే యని గ్రహించి స్మరించుట శ్రీగంధసమర్పణము. గంభీరాపార దార్భాగ్యక్లేశనాశనకారణాత్ ధర్మజ్ఞాన ప్రదానాచ్చ గంధం త్యభి ధీయతే.

మూ. సమస్త విషయాణాం మనసః స్థైర్యేణాను సంధానం కుసుమమ్.

తా. పూజయందు నానావిధపుష్పములతో పూజించుట ఆచారము. జ్ఞానకర్మ అంతరింద్రియముల వాంఛావిషయము లందు ఇంద్రియములను ప్రవర్తింపకుండునట్లుచేసి మనస్సును బ్రహ్మపదార్థమున లయింపజేసి సర్వము బ్రహ్మపదార్థమని తెలియుట పుష్పములతోడి పూజ.

మూ. తేషామేవసర్వదాస్వీకరణంధూపః. 39

(ధూతాశేషమహాదోషగంధప్రభావతః పరమానంద జననాత్ ధూపత్యభిధీయతే) పూజయందు ధూపమును ఆఘ్రాణము చేయుట ఆచారము. సాధకుడు తన యింద్రి యములను స్వాధీనపరచుకొనుటే ధూపము.

మూ. పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశ దేహో దీపః. 40

తా. పూజయందు దీపమును దర్శింపజేయుట ఆచా రము. బ్రహ్మతేజః పుంజము వాయువుతో కలసి ఊర్ధ్వ జ్వాలగా ప్రకాశించుచున్నది. అది ఆకాశమంతయు వ్యాపించి నది. సాధకుని శరీరముకూడ బ్రహ్మతేజోమయముగా ప్రకా శించుచున్నది. ఆకాశమునే శరీరముగాభావించి శరీరమందున్న

చిత్తలను దీపాకారముగా భావించుట దీపమునుసమర్పించుట. (దీర్ఘాజ్ఞానమహాధ్వాంతకార పరివర్జనాత్ పరతత్త్వ ప్రకాశాచ్చ దీప ఇత్యభిధీయతే.)

మూ. సమస్తయాతాయాతవర్జనం నైవేద్యమ్. 41

(చతుర్విధం ద్రవ్యం షడ్రసాన్వితం నివేదనాద్భవేత్తృప్తి రైన్వేద్యం సముదాహృతమ్.)

తా. పూజయందు నైవేద్యము చేయుట ఆచారము. ఇంద్రియములను ప్రవృత్తి నివృత్తి రహితముచేసి, చాంచల్యము లేనివిధముగ, బ్రహ్మాకారవృత్తితో నుండుట నైవేద్యము. బ్రహ్మాకారవృత్తి బ్రహ్మానందానుభవమే.

మూ. అవస్థాత్రితయైకీకరణం తాంబూలమ్. 42

తా. పూజయందు తాంబూలమును సమర్పించుట ఆచారము. తాంబూలమున మూడువస్తువులు కలవు. జాగ్రత్ స్వప్న సుషుప్తులను తురీయావస్థా విలీనము చేయుటయే తాంబూల సమర్పణము. (తురీయాభ్యాసమును గురించి వివరింపబడినది).

మూ. మూలాధారాదాబ్రహ్మబిలపర్యంతం బ్రహ్మరంధ్రాదా మూలాధారపర్యంతంగతాగతరూపేణ ప్రాదక్షిణ్యమ్.

తా. పూజావసానకాలమున ప్రదక్షిణము చేయుట ఆచారము. సుషుమ్నానాడీ మార్గమున ప్రాణవాయువు మూలాధారమునుంచి సహస్రారమువరకు మరల సహస్రారము నుండి మూలాధారమువరకు సంచారము చేయుచుండును. దీనికి అజపారూపహంసమని వ్యవహారమున్నది. ప్రాణవాయువు సంచారము ఆత్మరూప దేవతకు ప్రదక్షిణము.

(హంకారేణ బహిర్యాతి సకారేణ విశేత్ పునః । హంసేతి పరమం మంత్రం జీవో జపతి సర్వదా॥). హంసశబ్దవివరములు ప్రాసంగికముగా నీయబడుచున్నవి.

షడ్భావవికారములు లేని పరమాత్మకును, కేవల జడాత్మకమగు ప్రకృతికిని వేర్వేరుగా కర్తృత్వభోక్తృత్వంబులు మొదలగు స్వభావములు గల సంసారము లేదు గనుక హకారసంజ్ఞ గల యాత్ముడు సర్వశక్తియైన సకారసంజ్ఞ గల ప్రకృతితో కలసియుండుటవలన కలిగినఆత్మయే తానను అభేదస్ఫురణచేత చేరినవాడై హంసస్వరూపమగు శబళ బ్రహ్మ మగును. * అట్టి ఆ శబళబ్రహ్మము తొమ్మిది ద్వారములుగల శరీరమను పట్టణమందు ప్రవేశించి ఇంద్రియములతోడను, ప్రాణములతోడను, మనస్సుతోడను కూడినవాడయి పంజరమందు సంచరించుచున్న పక్షిచందమున బయలువెడలుటకు ఉపాయము తెలియక అనేకవిధములయిన సుఖముల ననుభవించుచు క్రీడించుచుండును. అట్లు క్రీడించుచున్న హంస యనబడు జీవుడు అగ్నిమండల చంద్రమండలములను రెండు రెక్కలుగాను, ఓంకారమును శిరస్సుగాను, జ్ఞాననేత్రము ముఖముగాను, రుద్రబీజమైన హకారమును శక్తిబీజమయిన సకారమును పాదములుగాను గలవాడై ప్రకాశించుచు, కొయ్యలయం దగ్నియు, నువ్వులయందు నూనెయు, పాలయందు ఘృతమును వ్యాపించియుండుచందమున సమస్తప్రాణులయందు హృదయకమలము నాశ్రయించి యుండును. సహస్రారము

* హంకారః పుమాన్ ప్రోక్తః 'స' ఇతి ప్రకృతిః స్మృత (ప్రపంచ సారోపనిషత్).

నూటయిరువదియైదు చిన్న రేకులుగల పెద్దదళములు యెనిమిది దిక్కులందు యెనిమిది దళములు కలది కావున తూర్పుదిక్కున రేకునందు సద్బుద్ధియు, అగ్నిదిక్కున రేకునందు నిద్రఆలస్యము దప్పి మొదలగునవియు, దక్షిణపు రేకునందు క్రూరబుద్ధియు, నైఋతి దిక్కురేకునందు పాపబుద్ధియు, పశ్చిమటి దిక్కురేకునందు విలాసమును, వాయవ్యమూలయందుండు రేకునందు నడచుట మొదలగువానియందు బుద్ధియు, ఉత్తరపువైపు రేకునందు సురతమునందాసక్తియు, ఈశాన్యపుమూలయందుండు రేకునందు ద్రవ్యమును దానము చేయవలయునను తలంపును, పద్మాంతరాళమునందు యిహపరలోకవిముక్తియు, కింజల్కమునందు మెలకువయు, దుద్దునందు కలయును, దుంపయందు నిద్రయును చెందుచుండును. మరియు ఏసమయమున సహస్రారమును విడచునో ఆసమయమందు అఖండసచ్చిదానంద పరబ్రహ్మమునందైక్యమగును. ఆ ఐక్యమునకే తురీయావస్థ యనిపేరు. జ్ఞానస్వరూపమై బ్రహ్మవిద్యాయుక్తమైనది. ప్రణవనాద, జ్ఞానబిందు, జ్ఞానకళల కది కారణము. నాదబిందుకళాజన్యములగు ప్రవేశ్వర జగత్తునకు సాక్షి. సకారము శరీరేంద్రియ చిత్తములను ఆకారముగా కలది. అజ్ఞానరూపాకృతి కలది. త్రిగుణములతో కూడినది. పుట్టుకలేనిది. షడ్భావవికారము లేనిది. * హకార సకార స్వరూపములైన పురుష

* హం అనగా గతిచలనము. నిత్యచలనము కలవారగుటచేత సూర్యునికి హంస యని పేరు. (సాయణ భాష్యము.) ఋగ్వేదమున హంసవతి ఋక్కుగలదు. (IV-42) ఇది యజుర్వేదమున (X-24) (XII-III) కూడ కలదు. దీనిని మహానిర్వాణతంత్రము ఉద్ఘాటించినది.

ప్రకృతులయొక్క చేరికయే మధ్యనున్న బిందువు. అందుచేత జీవుడని చెప్పబడుట. జీవుడు మనోమారుతయుక్తుడు. నాదము ప్రణవవాచ్యమైన పరబ్రహ్మము. ఆ నాదము ఆధారచక్రము మొదలు సహస్రారమువరకు నిర్మల స్ఫటికతుల్యమై సంపూర్ణమై యుండును. ఆ పరబ్రహ్మమునే ఉత్కృష్టవాచ్యమైన యథార్థముయొక్క గోప్య మని బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

మూ. తురీయావస్థా నమస్కారః. 44

తా. పూజయందు నమస్కారముచేయుట ఆచారము. సాధకుడు తురీయావస్థను చేరుట నమస్కారముచేయుట.

మూ. దేహశూన్యప్రమాతృతాని మజ్జనం బలిహారణమ్. 45

తా. పూజావసానకాలమున బలిహారణము ఆచారము. సాధకుడు స్థూలశరీము మాయాగతమని గ్రహించి, తా నది కా దని గుర్తించి తాను జ్ఞానస్వరూపమునను జీవభావమును బ్రహ్మమునందు విలీనముగా భావించుట బలిసమర్పణము.

మూ. సత్యమస్తి కర్తవ్య మకర్తవ్యమౌదాసీన్యనిత్యాత్మ విలాపనగ్ం హోమః. 46

తా. పూజావసానకాలమున హోమము చేయుట సామాన్యకర్తవ్యము. సత్యమను బ్రహ్మపదార్థ మున్నదనియు లేదనియు మొదలుగాగల సర్వభావములను అహంభావ జీవ భావములను పరబ్రహ్మమునందు విలీనము చేయుటయే హోమము చేయుట.

ఇందులకు ఇతర శ్రుతిప్రమాణము లున్నవి. "శ్రు. అంతర్నింతరనిరింధనమేధమానే మోహాంధకార పరిపంథిని

సంవిదగ్నౌ కస్మిం శ్చిదద్భుతమరీచివికాసభూమౌ విశ్వం జుహోతి వసుధాది శివావసానమ్".

మూ. స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణ ధ్యానమ్. 47

తా. పూజాంతమున ధ్యానముచేయుట ఆచారము. సాధకుడు తన్ను శ్రీదేవియొక్క చరణారవింద తేజఃకాంతిలో విలీనముగా సంభావించి తాను తేజస్స్వరూపమైనట్లు సర్వము బ్రహ్మమయమైనట్లు భావించుట పరిపూర్ణమైన ధ్యానము.

మూ. ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి,
తస్య దేవతాత్మైక్యసిద్ధిః. 48

తా. పైన వివరించిన అంతరంగపూజను బ్రహ్మాకార వృత్తి యుక్తుడై, మూడు ముహూర్తములకాలము (ఆరు గడియలు) శ్రీదేవియందు లగ్న భావన కలిగినవాడు శ్రీదేవితో ఐక్యతాసిద్ధిని పొందును. అనగా బ్రహ్మత్వసిద్ధి.

మూ. చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవశివయోగీతి
కథ్యత ఇత్యుపనిషత్. 49

తా. సిద్ధుడైన సాధకునికి చింతితకార్యములు అప్రయత్నముగా సఫలమగును. అతడే శివయోగి యని చెప్పబడును. ఇది ఉపనిషత్తు.

"ఓం భద్రం కర్ణేభిరితిశాంతిః"

భావనోపనిషత్తు నందున్న అంతర్యాగమునకు దగ్గరగా నున్న మరియొక అంతర్యాగవిధానము ఆగమము లందు కన్పించుచున్నది. దాని వివరము లిట్లున్నవి.

"హృత్పద్మాసనం దద్యాత్ సహస్రారచ్యుతామృతైః।
పాద్యం చరణయోర్దద్యాన్మనసార్ఘ్యంనివేదయేత్ ॥

తేనామృతేనాచమనం స్నానీయమపి కల్పయేత్ ।
ఆకాశతత్త్వం వసనం గంధం తు గంధతత్త్వకమ్ ।
చిత్తం ప్రకల్పయేత్ పుష్పం ధూపం ప్రాణాన్ ప్రకల్పయేత్ ।
తేజస్తత్త్వం చ దీపార్థే నైవేద్యం చ సుధాంబుధిమ్ ॥
అనాహతధ్వనిం ఘంటాం వాయుతత్త్వం చ చామరమ్ ।
నృత్యమింద్రియకర్మాణి చాంచల్యం మనసస్తథా ।
పుష్పం నానావిధం దద్యాదాత్మనో భావసిద్ధయే ।
అమాయామనహంకారమరాగమమదం తథా ।
అమోహామదంభం చ అద్వేషాక్షోభకే తథా ।
అమాత్సర్యమలోభం చ దశపుష్పం ప్రకీర్తితమ్ ॥
అహింసా పరమం పుష్పమింద్రియనిగ్రహమ్ ।
దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతఃపరమ్ ॥
ఇతి పంచదశైర్పుష్పైః ర్భావపుష్పైః ప్రపూజయేత్ ।

దీని తాత్పర్యభావ మిట్లున్నది.

"హృదయపద్మమును ఆసనముగా నొసగుము. సహస్రారము నుండి ప్రవహించుచున్న అమృతమును పాద్యముగా నిమ్ము. మనస్సును అర్ఘ్యముగా నివేదించుము. ఆచమనమునకు స్నానమునకు సహస్రారచ్యుతఅమృతమునే యిమ్ము. ఆకాశతత్త్వమును వస్త్రముగానిమ్ము. గంధతత్త్వమును గంధముగా నిమ్ము. చిత్తమును పుష్పముగా నిమ్ము. ప్రాణములను ధూపముగా నొసగుము. సుధాంబువిధిని నైవేద్యము చేయుము. (సుధాంబుధి సహస్రారమున కలదు.) అనాహతపద్మమునందు గల ధ్వనిని ఘంటానాదముగా నొసగుము. వాయుతత్త్వమును

చామరముగా నుపయోగించుము. ఇంద్రియధర్మములను మనో చాంచల్యమును నృత్యముగా నొసగుము. ఆత్మభావసిద్ధికొరకై వివిధమైన పుష్పముల నిమ్ము. ఆ పుష్పము లేవనగా, 1. మాయానిరోధము చేయుట, 2. అహంకారము విసర్జించుట, 3. రాగమును త్యజించుట, 4. మదమును విడచుట, 5. మోహమును విసర్జించుట, 6. దంభమును త్యజించుట, 7. ద్వేషమును వదలుట, 8. క్షోభపడకుండుట, 9. మాత్సర్యమును విడచుట, 10. లోభమును వదలుట, ఇవి దశపుష్పములు. మరియు అహింసా, ఇంద్రియనిగ్రహము, దయా, క్షమా, జ్ఞానములు ఉత్తమపుష్పములు. ఈ పదునైదు పుష్పములతో పూజింపవలెను."

ఈ విధానమునకు సంవిహితమైన భావములతో శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారి స్తోత్ర శ్లోక మున్నది.

"ఆత్మాత్వం గిరిజామతిః పరిజనాః ప్రాణాః శరీరం గృహమ్
పూజాతే విషయోప భోగరచనా నిద్రా సమాధిస్థితిః।
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మకరోమిత త్తదఖిలం శంభోతవారాధనమ్॥"

శ్రీమద్భగవద్గీతా వచన మిట్లున్నది.

"బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా."

సామాన్యముగా నిత్యపరిచయమైన శ్లోక మొకటి భావములు వివరించుచున్నది. "ప్రాతరుత్థాయసాయాహ్నం సాయాహ్నాత్ ప్రాతరేవతు యత్కరోమి జగన్మాత స్తదేవ తవ పూజనమ్."

ఇతర విధములైన అంతర్యాగములను గురించి తైత్తిరీయమునందును, ఛాందోగ్యమునందు కలదు. పాఠకుల సౌకర్యమునకై ఆ వివరముల నిట చేర్చితిమి.

తైత్తిరీ యోపనిషత్. నారాయణప్రశ్నః. అశీతమోఽనువాకః "ఆత్మయజ్ఞమ్"

1. తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానశ్శ్రద్ధా పత్నీ శరీరమిధ్మమురో వేదిర్లోమాని బర్హిర్వేదశ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశుస్తపోఽగ్నిర్దమశ్శమయితా దక్షిణావాగ్ఘోతా ప్రాణఉద్గాతాచక్షురధ్వర్యుర్మనో బ్రహ్మ శ్రోత్రమగ్నీత్.

2. యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవిర్యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యావ్యాహృతి రాహుతిర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయంప్రాతరత్తి తత్సమిధం యత్ప్రాతర్మధ్యన్దినగ్ం సాయం చ తాని సవనాని.

3. యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యేఽర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబన్ధా యేసంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాస్సర్వవేదసం వాఏతత్సత్త్రంయన్మరణాం తీదవభృథః.

4. ఏతద్వై జరామర్య మగ్నిహోత్రగ్ం సత్త్రం యఏవం విద్వా నుదయగనే ప్రమీయతే దేవానామేవ మహిమానంగత్వాఽఽదిత్యస్య సాయుజ్యంగచ్ఛత్యదయో దక్షిణే ప్రమీయతే పితౄణామేవ మహిమానంగత్వా

చన్ద్రమ సస్సాయుజ్యగ్ం సలోక తామాప్నో త్యేతౌ
వై సూర్యా చంద్రమ సోర్మహిమానౌ బ్రాహ్మణో
విద్వానభి జయతి తస్మాద్బ్రహ్మణో మహిమాన
మాప్నోతి తస్మాద్బ్రహ్మణో మహిమానమ్.

(తత్త్వజ్ఞానియొక్క సర్వమైన లౌకిక వ్యవహారములు యాగాంగము లని నిరూపింపబడుచున్నది. మొదట యోగి యొక్క శరీరాంగములు యజ్ఞాంగములుగా చెప్పబడినవి. పర బ్రహ్మయొక్క మాహాత్మ్యమును సాక్షాత్కారము చేసికొనిన జీవన్ముక్తుడగు వానియజ్ఞమునందు అతని ఆత్మయే యజమాని (ఆత్మదేహేంద్రియాదులకు సాక్షి) అంతఃకరణమందున్న శ్రద్ధ యజమానియొక్క ధర్మపత్ని. పత్నీసహితుడు కాని వాడు యజ్ఞముచేయుటకు అర్హుడు కాడు. అట్లే శ్రద్ధావిహీనుడు యజ్ఞముచేయుటకు అధికారి కాడు. కావున శ్రద్ధపత్నిగా చెప్పబడినది. శరీరము ఇధ్మము అనగా వంటచెఱకు. ఉరస్సు యజ్ఞవేదిక. రోమములు దర్భలు. శిఖ వేదము. హృదయము యూపము. కామము ఆజ్యము. క్రోపము పశువు. తపస్సుఅగ్ని. దమము అనగా ఇంద్రియోపశమనము దక్షిణ. వాక్కుహోత. ప్రాణము ఉద్గాత. నేత్రము అధ్వర్యుడు. శ్రోత్రము అగ్నీధ్రుడు.

యోగియొక్క వ్యావహారికకృత్యములును జ్యోతిష్టోమ క్రత్వంగములుగా నిరూపింపబడినవి. భుజింపకుండునట్టికాలము దీక్ష. భుజించుట హవిస్సు. జలపానము సోమపానము. క్రీడ ఉపసదిష్టులు. సంచరించుట, కూర్చుండుట, నిలబడుట ప్రవర్గ్యము. ముఖము ఆవహనీయాగ్ని. మాటాడుట ఆహుతి.

చేయుట. విజ్ఞానము హోమము. సంధ్యాకాలముల భోజనము సమిధలు. త్రిసంధ్యలు సవనములు.

కాలవిశేషములను విధమైన యజ్ఞములుగా చెప్పుట జరిగినది. అహోరాత్రములు దర్శపూర్ణమాసయజ్ఞములు. పక్షములు మాసములు చాతుర్మాస్యయజ్ఞములు. ఋతువులు పశుబంధములు. సంవత్సర,పరివత్సర, ఇదావత్సర మొదలైనవి ద్విరాత్ర త్రిరాత్ర మొదలైన అహర్గణములు. సాధకుడైన యోగియొక్క ఆయుర్దాయము సర్వదక్షిణాకమైన సత్ర యాగము. మరణమే అవభృథస్నానము.

సంవత్సరములలో ప్రభవాదిక్రమముగా సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, అనువత్సర ఇద్వత్సరము లని పేర్లు కలవు. ఇవి యుగపంచక మని నామాంతరము కలవి. తిరిగి ఆరవ సంవత్సరమునుండి మరల నివే పేర్లు. ఇట్లే క్రమమైన పునః పునరావృత్తి.

జీవన్ముక్తునకు లభించు ఫలమును గురించి చెప్పబడు చున్నది. యోగియైన జీవన్ముక్తుని జరామరణవృత్తాంతమే సహస్ర వర్షసత్రయాగమునరకు గల కర్మస్వరూపము. ఇట్టి యోగి ఉత్తరాయణమున మరణించినచో ఇంద్రాదులయొక్క ఐశ్వర్యమహిమలు పొంది ఆ తరువాత ఆదిత్యుని సాయుజ్య మును పొందుచున్నాడు. యోగి దక్షిణాయనమున మరణించి నచో అగ్నిష్వాత్తుడు మొదలైన పితృదేవతల మహిమను పొంది చంద్రునియొక్క సాయుజ్యమును పొందుచున్నాడు. సూర్యచంద్రుల మహిమను అనుభవించిన పిమ్మట సగుణ బ్రహ్మస్వరూపుడైన హిరణ్యగర్భుని తెలిసికొని తదుపాసకు

లలో గణనీయుఁడగును. అంతట హిరణ్యగర్భ సాక్షాత్కార మును పొందును. హిరణ్య గర్భలోకవాసుల దేహపాతానంతరము హిరణ్యగర్భుని మహిమను పొందుచున్నాడు. పిమ్మట హిరణ్యగర్భలోకమున బ్రహ్మతత్త్వ సాక్షాత్కారమును పొంది ఆ తరువాత పరబ్రహ్మ తాదాత్మ్యమును పొందుచున్నాడు.

ఆత్మయజ్ఞమనంబడే యగు పురుషయజ్ఞమునుగురించి ఛాందోగ్య మందున్నది. "పురుషో వావ యజ్ఞస్తస్య యాని చతుర్వింగ్ంశతివర్షాణి తత్ప్రాతస్సవనం చతుర్వింగ్ం శత్యక్షరా గాయత్రీ గాయత్రం ప్రాతస్సవనం తదస్య వసవోఽన్వాయత్తాః ప్రాణావావ వసవ ఏతే హీదగ్ం సర్వం వా సయంతి. ౧. తం చేదే తస్మిన్వయసి కించిదుపత పేత్స బ్రూయాత్ప్రాణా వసవ ఇదం మే ప్రాతస్సవనం మాధ్యందినగ్ం సవనమను సంతనుతేతి మాఽహం ప్రాణానాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదోహ భవతి. ౨. అథ యాని చతుశ్చత్వారింశద్వర్షాణి తన్మాధ్యందినగ్ంసవనం చతుశ్చత్వారింశ దక్షరాత్రిష్టుప్త్రైష్టుభం మాధ్యందినగ్ం సవనం తదస్య రుద్రాఅన్వాయత్తాః ప్రాణావా వరుద్రావితే హీదగ్ం సర్వగ్ంరోదయంతి. ౩. తం చేదే తస్మిన్వయసికించిదుపత పేత్సబ్రూయాత్ప్రాణారుద్రాఇదం మే మాధ్యం దినగ్ం సవనంతృతీయసవన మనుసంతనుతేతి మాఽహంప్రాణానాగ్ం రుద్రాణాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హ భవతి. ౪. అథ యాన్యష్టా చత్వారింశద్వర్షాణి తత్తృతీయ సవనమష్టా చత్వారిగ్ంశదక్షరా జగతీ జాగతం తృతీయసవనం తదస్యాదిత్యా అన్వాయత్తాః ప్రాణావావాఽఽ

దిత్యా ఏతే హీదగ్ం సర్వమాదదతే. ౫. తం చేదేతస్మిన్వయసి
కించి దుపతత్సబ్రూయాత్ప్రాణా ఆదిత్యా ఇదం మే తృతీయ
సవనమాయురను సంతనుతేతి మాఽహం ప్రాణానామా
దిత్యానాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో
భవతి. ౬. ఏతద్ధస్మవై త ద్విద్వానాహ మహీదాన ఐతరేయఃస
కిం మ ఏతతదుపతపసి యోఽహమనేన న ప్రేష్యామీతి సహ
షోడశం వర్షశతమజీవత్ప్రహాషోడశం వర్షశతంజీవతి యఏవం
వేద :-ఇతి ఛాందోగ్యే తృతీయాధ్యాయే షోడశః ఖండః.

స యదశిశిషతి యత్పిపాసతి యన్నరమతే తా అస్య
దీక్షాః, ౧. అథ యదశ్నాతి యత్పిబతి యద్రమతే తదుపసదై
రేతి, ౨. అథయద్ధసతి యజ్జక్షతి యన్మైథునం చరతి స్తుత
శస్త్రైరేవ తదేతి, ౩. అథ యత్తపోదాన మార్జవమహిగ్ంసా
సత్యవచనమితి తా అస్య దక్షిణాః, ౪. తస్మాదాహు
స్సోష్యత్యసోష్టేతి పునరుత్పాదనమేవాస్య తన్మరణమేవావ
భృధః, ౫. తద్ధైతద్ఘోర అంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా
యోక్త్వోవాచా పిపాస ఏవ స బభూవసోఽన్తవేలాయా
మేతత్త్రయం ప్రతిపద్యేతాక్షి తమస్యచ్యుతమసి ప్రాణసగ్ం
శితమసీతి తత్రైతే ద్వే ఋచౌ భవతః. ౬. ఆదిత్ప్రత్నస్య
రేతసః ఉద్వయం తమసస్పరిజ్యోతిః పశ్యంత ఉత్తరగ్ంస్వః
పశ్యన్త ఉత్తరం దేవం దేవత్రాసూర్యమగన్మజ్యోతి
రుత్తమమితి జ్యోతి రుత్తమమితిః. (ఇతి ఛాందోగ్యే తృతీయా
ధ్యాయే సప్తదశః ఖండః.)

పురుషుడు అనగా జీవాత్మయజ్ఞమని సంభావింపవల

యును. అతని జీవితకాలమున మొదటి ఇరువది నాలుగు సంవత్సరములును ప్రాతస్సవనము. ప్రాతస్సవన మనగా గాయత్రిసంబంధమైనది. గాయత్రికి ఇరువది నాలుగక్షరములు. ఈ యాగమునకు వసువులు దేవతలు. ప్రాణములు వసువులు. యాగదేవతలైన వసువులే సమస్తమును జీవించునట్లు చేయువారు.

ఇరువది నాలుగేండ్ల లోపుగావచ్చిన ఆపదను నివారించుకొనుటకు చేయదగిన మంత్రముయొక్క అర్థసంగ్రహమిది. "ఓ ప్రాణరూపులగు వసువులారా! ప్రాతస్సవనము మధ్యాహ్న సవనము అనుష్ఠింపబడు నట్లగునుగాక. ప్రాణముల మధ్య నాకెట్టి లోపమును రాకుండునుగాక." ఈ విధముగా జపించినయెడల ప్రాణాపదతొలగి ఆరోగ్యము లభించును.

ఇరువదినాలుగేండ్లనుండి అరువది యెనిమిదిదేండ్ల వయస్సువరకు (అనగా 24 వ సంవత్సరమునుండి 44 సం॥ముల కాలము) మాధ్యాహ్నసవనము. త్రిష్టుప్ చందస్సు. దీనికి నలుబది నాలుగక్షరములు. దేవతలు రుద్రులు. వారే ప్రాణములు. వారే సమస్తమును జీవించునట్లు చేయువారు.

అరువది యెనిమిది సంవత్సరముల వయస్సులోపల ఆపదయేదేని సంభవించినయెడల దానిని నివారించుకొనుటకు చేయదగిన మంత్రముయొక్క అర్థసంగ్రహమిది. "ఓ ప్రాణ స్వరూపులగు రుద్రులారా! మధ్యాహ్నసవనము సాయం సవనము అనుష్ఠింపబడు నట్లగునుగాక. ప్రాణముల మధ్య నాకెట్టి లోపమును రాకుండును గాక." ఈవిధముగా జపించిన యెడల ప్రాణాపద తొలగి ఆరోగ్యము లభించును.

అరువదియెనిమిది సంవత్సరముల వయస్సు తరువాత జరిగెడు నలువదియెనిమిది దేండ్లు — అనగా నూటపదునారు సంవత్సరముల వయస్సువరకును సాయంసవనము. ఇది జగతీ ఛందస్సంబంధమైనది. నలువదియెనిమిదక్షరములు. దీనికి ఆదిత్యులు దేవతలు. వారే ప్రాణములు. వారే సమస్తమును జీవించునట్లు చేయువారు.

నూటపదునారు సంవత్సరముల వయస్సులోపల ఆపద యేదేని సంభవించినయెడల దానిని నివారించుకొనుటకు చేయదగిన మంత్రముయొక్క అర్థసంగ్రహమిది. "ఓ ప్రాణస్వరూపులగు ఆదిత్యులారా! సాయంసవనము సంపూర్ణముగా అనుష్ఠింపబడునంతవరకు నాకు యే ఆపదయు కలుగకుండును గాక." ఈ విధముగా జపించినయెడల ప్రాణాపద తొలగి ఆరోగ్యము లభించును.

ఈ నిశ్చయము తెలిసికొనిన మహిదాస మహర్షి "ఓసీ రోగమా! నన్ను నీవేమియు చేయజాలవు. వృథా శ్రమపడి నన్నేల పీడించుటకు ప్రయత్నింతువు" అని రోగమును నివారించిరి. ఆయన నూటపదారేండ్లు జీవించిరి. ఈ విధముగా నుపాసించువారు నూటపదారేండ్లు జీవింతురు. (ఛాందోగ్యము 16 వ ఖండము సమాప్తము.)

పురుషునకు యాగమునకు సామ్యగుణములు చెప్పబడుచున్నవి.

యజ్ఞమునందు దీక్షకలదు. పురుషుడు దేనిని భక్షించుటకును త్రాగుటకును అభిలషించుచున్నాడో ఏది లభింపలేదని దుఃఖించుచున్నాడో అదియెల్ల యజ్ఞవ్రతదీక్ష.

పురుషుడు దేనిని భుజించుచున్నాడో, దేనిని త్రాగుచున్నాడో, దేనిని పొంది సంతోషించుచున్నాడో అదియెల్ల యజ్ఞమునందు అల్పాహారరూపమైన ఉపసదము.

భుజించుట, హసించుట, దాంపత్యజీవనము-ఇవి యెల్ల యజ్ఞమునందు స్తోత్రములు.

తపస్సు చేయుట, దానము చేయుట, ఋజుత్వమవలంబించుట, అహింసను అనుష్ఠించుట, సత్యవచనము చెప్పుట-ఇవి యెల్ల యజ్ఞమునందు దక్షిణలు.

యజ్ఞమునందు 'సోష్యతి అసోష్టా' అను శబ్దప్రయోగము లున్నవి. వాటియర్థము సోమరసమును త్రాగబోవుచున్నాడు, సోమరసమును త్రాగినాడు అని చెప్పుట. ఈ పదములు అనగా సోష్యతి అసోష్టా అనునవి పురుషుని జీవితమునందుకూడ అన్వయించుచున్నవి. పురుషపరమునందు పొందబోవుచున్నాడు పొందినాడు అను భావములతో నున్నవి. ఇచట శబ్దసామ్యము చెప్పబడినది. పురుషయజ్ఞమునకు అవభృథస్నానము మరణమే. అనగా ముగింపు మరణముతోనే.

ఈ పురుష యజ్ఞవిద్యను దేవకీపుత్త్రుడగు శ్రీకృష్ణునకు ఘోర అను పేరుగల అంగిరస్సుడు ఉపదేశించెను. ఈ విద్య సర్వోత్కృష్టమైన దని తెలిసిన శ్రీకృష్ణుడు అంగిరస్సుని మరియే యితర విద్యయు నర్థించలేదు. ఈ పురుషయజ్ఞవిద్యను తెలిసికొనిన పురుషుడు తన మరణకాలమునందు జపము చేయవలసినట్టి వేదబుక్కులు రెండుకలవు. అందు 'అక్షితమసి'(లోపము లేకున్నావు) అచ్యుతమసి (చ్యుత మనగా జారుట - దానిని

లేకున్నావు) ప్రాణసంశిత మని (సూక్ష్మమైన ప్రాణమవై యున్నావు) అనునట్టిభావములు కలవు.

మేము సర్వోత్తమమైన జ్యోతిని దర్శించినవారమై యున్నాము. ఆ జ్యోతిని పొందినవారమై యున్నాము. ఆ జ్యోతి సర్వదేవతలకంటె ఉత్తమమైనది. మేలైనది. అది తపస్సుకంటె ఉత్కృష్టమైనది. అది బ్రహ్మసంబంధమైనది.అది పురాణసంబంధమైనది. (ఛాందోగ్యము 3 వ అధ్యాయమున 17 వ ఖండము సమాప్తము).

తైత్తిరీయమునందు ప్రతిపాదింపబడిన ఆత్మయజ్ఞమును గురించి బ్రహ్మసూత్రములందు (ఉత్తరమీమాంసా శాస్త్రము) కూడ కలదు. కొంత చర్చ జరిగినది. ఆ బ్రహ్మ సూత్ర సందర్భమైన వ్యాఖ్యానమున శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు ఈ విద్యను పురుషయజ్ఞ మని చెప్పిరి. తైత్తిరీయ వ్యాఖ్యానములో శ్రీవిద్యారణ్యులవారు ఈ విద్యను 'పురుషవిద్య' అని వివరించిరి.

ఈ విద్యను చర్చించిన బ్రహ్మసూత్రమిది. 'పురుషవిద్యాయామివ చేతరేషామనామ్నానాత్' 3-3-24.

ఈ పురుషవిద్యనుగురించి వైయాసిక న్యాయమాలయం దిట్లు కలదు.

శ్లో. పుంవిద్యైకా ? విభిన్నా వా ? తైత్తిరీయకతాండినో ।
మరణావభృథత్వాదిసామ్యాదేకేతి గీయతే ॥
బహునారూపభేదేన కించిత్సామ్యస్య బాధనాత్ ।
న విద్యైక్యం తైత్తిరీయే బ్రహ్మవిద్యాప్రశంసనాత్ ॥

పైన ఉదహరింపబడిన బ్రహ్మసూత్రమునకు శ్రీశంకర భగవత్పాదుల భాష్యవివరణ మిట్లు కలదు.

"అస్తి తాండినాం పైంగినాం చ రహస్యబ్రాహ్మణే పురుషవిద్యా. తత్ర పురుషః యజ్ఞః కల్పితః, తదీయమాయుస్త్రేధా విభజ్య సవనత్రయం కల్పితం అశిశిషాదీని చ దీక్షాది భావేన కల్పితాని, అన్యే చ ధర్మాస్తత్ర సమధిగతా ఆశీర్మంత్ర ప్రయోగాదయః, తైత్తిరీయకా అపి కంచిత్పురుషయజ్ఞం కల్ప యంతి - తస్యైవం విదుషోయజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధాపత్నీ (నారా 80) ఇత్యేతేనానువాకేన. తత్ర సంశయః, కిం య ఇతరత్రోక్తాః పురుషయజ్ఞస్య ధర్మాః తేత్తైత్తిరీయేషు ఉపసంహర్తవ్యాః కింవా నోపసంహర్తవ్యాః ?

పురుషయజ్ఞత్వావిశేషాదుపసంహారప్రాప్తావాచక్ష్మహే-నోపసంహర్తవ్యా ఇతికస్మాత్? తద్రూపప్రత్యభిజ్ఞానాభావాత్, తదాహాచార్యః-పురుషవిద్యాయామివేతి, యథైకేషాం శాఖినాం తాండినాం పైంగినాంచ పురుషవిద్యాయామామ్నానం నైనమితరేషాం తైత్తిరీయాణామామ్నానమస్తి తేషాం హీతరవిలక్షణమేవయజ్ఞసంపాదనం దృశ్యతే పత్నీయజమాన వేద వేదిబర్హిర్యూపాజ్యపశ్వృత్విగాద్యనుక్రమణాత్. యదపి కించి న్మరణావభృథత్వాదిసామ్యం తదప్యల్పీయస్త్వాద్భూయసా వైలక్షణ్యేనాభిభూయమానం నప్రత్యభిజ్ఞాపనక్షమంనచతైత్తిరీయకే పురుషస్య యజ్ఞత్వం శ్రూయతే. విదుషో యజ్ఞస్యేతి హినచైతే సమానాధికరణే షష్ఠ్యౌ విద్యానేవ యో యజ్ఞస్తస్యేతి భవతి హి పురుషస్య ముఖ్యో యజ్ఞసంబద్ధః, సత్యాం చ గతౌ ముఖ్యఏవార్థఆశ్రయితవ్యో న భాక్తః. ఆత్మా యజ

మానఇతి చ యజమానత్వం పురుషస్య నిర్బ్రువన్ వైయధి కరణ్యేనైవాస్య యజ్ఞసంబంధం దర్శయతి, అపిచ తస్యైవం విదుషఇతిసిద్ధవదనువాదశ్రుతౌ సత్యాం పురుషస్య యజ్ఞభావ మాత్రాదీనాం చ యజమానాదిభావం ప్రతిపిత్సమానస్య వాక్యభేదః స్యాత్, అపిచ ససన్న్యాసామాత్మవిద్యాం పుర స్తాదుపది శ్యానంతరం 'తస్యైవ విదుష' ఇత్యాద్యనుక్రమణం పశ్యంతః పూర్వశేషఏవైష ఆమ్నాయో న స్వతంత్ర ఇతి ప్రతీమః, తథాచైకమేవ ఫలముభయోరప్యనువాకయోరుపల భామహే. "బ్రహ్మణో మానమాప్నోతి (నారా 80) ఇతి. ఇతరేషాం త్వనన్యశేషః పురుషవిద్యామ్నాయః, ఆయురభి వృద్ధిఫలోహ్యసౌ సహషోడశం వర్షశతం జీవతి యఏవంవేద (ఛాం. 3-16-17) ఇతి సమభివ్యాహారాత్. తస్మాచ్ఛాఖాంత రాధీతానాం పురుషవిద్యాధర్మాణామాశీర్మంత్రాదీనాప్రాప్తి స్తైత్తిరీయకే (ఠ )".

శ్రీమదాచార్యులవారి భాష్యమునకు సంగ్రహతాత్పర్య మిట్లున్నది. "తాండిపైంగి అను వేదశాఖల రహస్యబ్రాహ్మణ మున పురుషవిద్య అను పేరుగల ఉపాసనావిశేష మొకటి కలదు. ఆవిద్యయందు పురుషుడు యాగముగా కల్పన చేయ బడినాడు. పురుషుని ఆయుర్దాయము మూడు విభాగములుగా చేయబడి మూడు సవనములుగా కల్పనచేయబడినది. అశి శిష = అనగా ఆహారమును భుజింపవలెను మొదలైన వాంఛలు మున్నగునవి దీక్షాభావములుగ కల్పింపబడినవి. ఇంతేగాక తైత్తిరీయోపనిషత్తునందు నారాయణ ప్రశ్నము నందుకూడ పురుషయజ్ఞ మొకటి కల్పింపబడినది. ఈ రెండిటి

యందు మూడుసవనములు మరణమే అవభృథస్నానమువంటి సామ్యధర్మము లున్నవి. అందుచేత రెండు విద్యలను ఐక్యముగా భావించి తైత్తిరీయమునందు చెప్పబడని ధర్మములను తాండిశ్రుతినుండియు తాండిశ్రుతియందు చెప్పబడని ధర్మములను తైత్తిరీయమునుండి గ్రహింపవలయునని కొందరు భావించుచున్నారు. ఇది సరికాదు.

అట్లు గ్రహించుట తప్పనిసిద్ధాంతము. ఏమనగా 'మరణమే అవభృథస్నానమువంటి యే యొకటి రెండు సామ్యధర్మము లున్నను వైలక్షణ్యము చాల కలదు. పత్నీయజమాన వేదవేది బర్హిర్యూపాజ్యపశు ఋత్విక్ మున్నగు' అనుక్రమణకల్పనము. తైత్తిరీయమున కలదు. తాండిశ్రుతియందు లేదు. కేవలసవనత్రయముమాత్రమే తైత్తిరీయమున కలదు. తాండిశ్రుతిలో ఆయుస్సు మూడు విభాగములుగా చేయబడినది. తైత్తిరీయమందు ఫలప్రాప్తిగా బ్రహ్మప్రాప్తి (బ్రహ్మణో మహిమానమాప్నోతి) చెప్పబడగా తాండిశ్రుతియందు "సహషోడశం వర్ష శతం జీవతి" అనగా 116 సం।ముల ఆయుర్వృద్ధి కలదు. కాబట్టి శాఖాంతరమున చెప్పబడిన ఆశీర్మంత్రాదికము తైత్తిరీయ ప్రతిపాదితపురుష విద్యాసందర్భమున స్వీకరింప నక్కరలేదు."

శ్రీమదాచార్యులవారు వివరించినట్లు ఒకటి రెండు సామ్యధర్మము లున్నంతమాత్రమున భిన్నభిన్నశ్రుతులచేత ప్రతిపాదింపబడిన విద్యలకు ఐక్యము చెప్పరాదు.

కాబట్టి భావనోపనిషత్తు ప్రతిపాదించిన అంతర్యాగము

నకు తైత్తిరీయ ప్రతిపాదితయజ్ఞమునకు, ఛాందోగ్యప్రతిపాదిత పురుషయజ్ఞమునకు ఐక్యము లేదు. అవి విభిన్నవిద్యలే. భావనోపనిషత్తు ప్రతిపాదించిన అంతర్యాగమునకు సంహారయాగ మని వ్యవహారము కలదు.*

తైత్తిరీయాంతర్గత ఆత్మయజ్ఞమునకు దేహపాతానంతరము క్రమప్రాప్తముగా బ్రహ్మప్రాప్తియే ఫలప్రాప్తి. ఛాందోగ్య పురుషయజ్ఞమునకు ఫలప్రాప్తి ఆయుర్వృద్ధి. భావనోపనిషత్తు అంతర్యాగమునకు ఫలప్రాప్తి జీవన్ముక్తి. ఇవి విభిన్నవిద్యలే. భావనోపనిషత్తు స్వస్వరూపానుసంధానమునే ప్రతిపాదించుచున్నది. ("స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" శ్రీశంకరభగవద్పాదులు.)

---

శ్రీః

# భా వ నో ప ని ష త్

## (మూ ల పా ఠ ము)

ఓం భద్రం కర్ణేభి రితి శాంతిః

ఓం శ్రీగురుః పరమకారణభూతా శక్తిః; తేన నవ రంధ్రరూపో దేహః నవచక్రరూప శ్రీచక్రం; వారాహీ పితృరూపా కురుకుల్లావళి దేవతామాతా; పురుషార్థాస్సాగరాః; దేహోనవరత్నద్వీపః; త్వగాదిసప్తధాతుభిరనేకై

* సంహారయాగమనగా లయయోగము.
"పూజకోటి సమంస్తోత్రం స్తోత్రకోటి సమోజపః ।
జపకోటి సమంధ్యానమ్ ధ్యానకోటి సమోలయః॥"

స్సంయుక్తా సంకల్పాః కల్పతరవః; తేజః కల్పకోద్యానం; రస నయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయలవణరసాష్ష డృతవః; క్రియాశక్తి పీఠకుండలినీ జ్ఞానశక్తిర్గృహా, ఇచ్ఛా శక్తిర్మహాత్రిపురసుందరీ; జ్ఞాతా హోతా జ్ఞానమర్ఘ్యం జ్ఞేయ గ్ం హవిః జ్ఞాతృజ్ఞానజ్ఞేయో నామ భేదభావనగ్ం శ్రీచక్ర పూజనమ్; నియతి సహితశృంగారాదయోనవరసా అణిమా దయః; కామక్రోధలోభమోహ మదమాత్సర్యపుణ్యాపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః; ఆధారనవకంముద్రాశక్తయః; పృధివ్యప్తేజో వాయ్వాకాశశ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణ వాక్పాణిపాదపాయూపస్థమనోవికారాష్షోడశశక్తయః;వచనా దానమనవిసర్గానంద హానోపేక్షాబుద్ధయోనంగకుసుమాది శక్తయోష్టౌ; అలంబుసా కుహూ విశ్వోదరీ వరుణా హ సి జిహ్వా యశస్వతీ, అశ్వనీ గాంధారీ పూషా శంఖినీ సరస్వతీ, ఇడాపింగళాసుషుమ్నా చేతిచతుర్దశనాడ్యాసర్వసంక్షోభిణ్యాది చతుర్దశారదేవతాః, ప్రాణాపానవ్యానోదానసమాన నాగ కూర్మకృకరదేవదత్త ధనంజయాదశవాయవస్సర్వసిద్ధిప్రదాది దేవ్యోబహిర్దశారదేవతాః, ఏతద్వాయుదశక సంసర్గోపాది భేదేనరేచకపూరకశోషకదాహకప్లావకామృతమితిప్రాణముఖ్య త్వేన, పంచవిధో స్తి మనుష్యాణాం మోహకో దాహకో భక్ష్య భోజ్యలేహ్యచోష్యపేయాత్మకం చతుర్విధమన్నంపాచయంత్యే తాఃదశధనకలాసర్వజ్ఞత్వాద్యంతర్దశారదేవతాః, శీతోష్ణసుఖ దుఃఖేచ్ఛాసత్వ రజస్తమోగుణావశిన్యాదిశక్తయోష్టౌ; శబ్ద స్పర్శరూపసగంధాః పంచతన్మాత్రా, పంచపుష్పబాణాః;మన ఇక్షుధనుఃవశ్యోబాణఃరాగఃపాశోద్వేషోఽఙ్కుశః;అవ్యక్తమహ

తత్త్వాహంకారా కామేశ్వరీవజ్రేశ్వరీభగమాలిన్యంతస్త్రికోణా గ్రగా దేవతాః; పంచదశ తిథిరూపేణ కాలస్యపరిణామావలోకనం పంచదశ నిత్యాః; శ్రద్ధానురూపా ధీర్దేవతా తయోః కామేశ్వరీసదానంద ఘనాపూర్ణాస్వాత్మైక్యరూపా దేవతా; సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్త్వమ్; కర్తవ్యమకర్తవ్యమౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః, అస్తి నాస్తీతి కర్తవ్యతాఅనుపచారః, బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతా స్తీత్యావాహనమ్; తస్య, బాహ్యాంతఃకరణానామేకరూపవిషయ గ్రహణమాసనమ్; రక్తశుక్లపదైకీకరణం పాద్యమ్; ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్; స్వచ్ఛం స్వతస్సిద్ధమిత్యాచమ నీయమ్, చిచ్చంద్రమయీ సర్వాంగ స్రవణగ్ం స్నానమ్; చిదగ్నిస్వరూపపరమానందశక్తిస్ఫురణం వస్త్రమ్; ప్రత్యేకగ్ం సప్తవింశతిధాభిన్నత్వే నేచ్ఛాజ్ఞాన క్రియాత్మకబ్రహ్మగ్రంథిమద్రసతంతు బ్రహ్మనాడీ, బ్రహ్మసూత్రమ్; స్వవ్యతిరిక్తవస్తుసంగ రహితస్మరణం విభూషణమ్; సత్సంగపరిపూర్ణతాను స్మరణంగంధః; సమస్తవిషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమమ్; తేషామేవ సర్వదా స్వీకరణం ధూపః; పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశ దేహోదీపః; సమస్తయాతాయాతవర్జనం నైవేద్యమ్; అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్; మూలాధారాదా బ్రహ్మబిలపర్యతం బ్రహ్మరంధ్రాదామూలాధారపర్యంతం గతాగతరూపేణ ప్రాదక్షిణ్యమ్; తురీయావస్థా నమస్కార, దేహశూన్యప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్; సత్యమస్తి కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ం

హోమః; స్వయం తత్పాదుకానిమజ్జనం పరిపూర్ణధ్యానమ్;
ఏవం ముహూర్త త్రయం భావనయా యుక్తో భవతి తస్య
దేవతాత్మైక్యసిద్ధిః; చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి సఏవ
శివయోగీతి కథ్యతే - ఇత్యుపనిషత్.

ఓం భద్రం కర్ణేభి రితి శాంతిః.

శ్లో. బాలభావానుసారేణ మనేదంహి విచేష్టితమ్ ।
మాతృవాత్సల్యసదృశం త్వయాదేవి విధీయతామ్ ॥

శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



శ్రీః

# శ్రీ చక్రవిలసనము

## చక్రమంత్రములకైక్యము

(మూడవ అనుబంధము)

శ్రీచక్రము సోమసూర్యాగ్ని ఖండత్రయ యుక్తము. చంద్రునకు పదునారు కళలు. సూర్యునకు యిరువది నాలుగు కళలు. అగ్నికి పది కళలు. మొత్తము ఏబది కళలు. ఇవి పంచ శద్వర్ణాత్మకములు (అకారాదిక్షకారాంత మగు వర్ణ రూపములు).

శ్లో. షోడశేందోః కళాభానోర్ద్విర్ద్వాదశదశానలే ।
సాపంచశత్కలాజ్ఞేయా మాతృకా చక్రరూపిణి ।

ఈ ఏబదికళలును కలసి మాతృకాచక్రరూపిణి యగు షోడాఖ్యకళ. ఏబదికళలును యేబదివర్ణములు. చంద్రకళలోని నిత్యాకళగాక మిగిలిన 15 కళలలో నంతర్భూతములే. ఇవియే పంచదశి మంత్రాక్షరములు. అనగా పంచాశద్వర్ణములు షోడశ నిత్యాంతర్భూతములు.

శ్రీచక్రము సూర్యచంద్రాగ్ని ఖండత్రయము. అట్లే పంచదశిమంత్రమును త్రిఖండయుక్తము. అదియు సోమ, సూర్య ఆగ్నేయ ఖండములని వ్యవహారము. చంద్రకళలు పదునారును చంద్రఖండగతములు. మంత్రచంద్రఖండము యంత్రమున చంద్రఖండమున చేరినది. ఇట్లే మిగిలిన రెండు ఖండము

లును. ఈ విధమున నేబదికళలును శ్రీచక్రమునకు, మంత్రమునకు ఐక్యము. ఇది పూర్ణోదయమత మని చెప్పబడుచున్నది.

సుభగోదయమున (దర్శాద్యాః పూర్ణిమాం తాశ్చ కలాఃపంచదశైవతు,షోడశీతుకలాజ్ఞేయ సచ్చిదానందరూపిణి) పదునారవకల సచ్చిదానందరూపిణి యని చెప్పబడినది.

1. దర్శ (శివతత్త్వాత్మిక), 2. దృష్ట-శక్తి తత్త్వాత్మిక, 3. దర్శతా-మాయా తత్త్వాత్మిక, 4. విశ్వరూప-శుద్ధవిద్యా తత్త్వాత్మిక,5.సుదర్శనా-జలతత్త్వాత్మిక.ఇవి అయిదు ఆగ్నేయ ఖండము. అధిదేవత అగ్ని. కామదేవుడు సర్వత్ర అధిదేవత. కామేశ్వరి సర్వత్ర అధిష్ఠాత్రి, 6. అప్యాయమాన-తేజస్తత్త్వాత్మిక, 7.ఆప్యాయమాన-వాయుతత్త్వాత్మిక, 8.ఆప్యాయమన సత్త్వాత్మిక, 9. సూనృత-పృథివీతత్త్వాత్మిక, 10. ఇరా-ఆకాశతత్త్వాత్మిక, 11. ఆపూర్వమాణ-విద్యాతత్త్వాత్మిక. ఈ ఆరును సూర్యఖండము. సూర్యుడు దేవత. కామదేవుడు సర్వత్ర అధిదేవత. కామేశ్వరి సర్వత్ర అధిష్ఠాత్రి. అపూర్వమాణకల చంద్రఖండమునకు చెందినదయ్యు సౌరఖండమునం దంతర్భూతము. ఇరాకలలోని భేదమే అపూర్వమాణము. రెండిటికి ఐక్యము. 12. ఆపూర్వమాణ-మహేశ్వరతత్త్వాత్మిక, 13. పూరయంతీ-పరతత్త్వాత్మిక, 14. పూర్ణ-ఆత్మతత్త్వాత్మిక, 15. పౌర్ణమాసీ-సదాశివ తత్త్వాత్మిక, ఇవి సోమఖండము. సోముడు దేవత. కామదేవుడు సర్వత్ర అధిదేవత. కామేశ్వరి సర్వత్ర అధిష్ఠాత్రి. పదునారవకల నిత్యాకల. ధ్రువకల. అది సాదాఖ్య తత్త్వాత్మిక.

ఈ కలలు విశుద్ధిచక్రమున షోడశారమున షోడశదిక్కు-

లందు ప్రాగాదిగ నున్నవి. మరియు నాదర్శాదికలలే ఆజ్ఞా చక్రము తరువాతనున్న చంద్రమండలమునందు పదునారు కళలుగా నున్నవి. శ్రీగౌడపాదాచార్యులవారి సుభగోదయ మీా విషయమును చెప్పుచున్నది. నిత్యాకల సహస్రారము నందు కలదు.

మూలశ్లోకమందలి కలల తత్త్వములను చెప్పు నామ ములవలన పంచదశి మంత్రబీజాక్షరములువ్యక్తమగుచున్నవి.*

పదునైదు తిథులకు పదునైదు నిత్యలు. సాముదాయిక మంత్రానుష్ఠానము, నిత్యానుష్ఠానము ప్రత్యేకము.

పదునారవకల మహానిత్య. సాదాఖ్య (శ్రు. ఇయంవావ సరఘా) అది చంద్రకలయై అమృతస్యందిని. శ్రీ చక్రాత్మక చంద్రుడు. అది సరఘ. ఆ శ్రీచక్రసరఘకు అగ్నిస్థానమున (బైందవత్రికోణము) కలిగిన మధువే సుధాసింధురూపము. (శ్రు. "తస్యాఽగ్ని రేవ సారఘుమధు).

## మ ం త్ర మ న గా నే మి ?

ఈగ్రంథమునందు ముందుభాగమున, వర్ణములు (అక్షర ములు) శబ్దములు, మంత్రములు అని చెప్పబడినది. అంతరకమ లములైన మూలాధారాది కమలములందుగల దళములందు

* ఈ మంత్రబీజముల సమష్టిరూపమును శ్రీ భగవత్పాదులు సౌందర్య లహరియం దిట్లు చెప్పిరి.

శ్లో. శివశ్శక్తిః కామః క్షితిరథర విశ్శీతకిరణః
స్మరో హంసశ్శక్రః తదనుచపరామారహరయః ।
అమీహృల్లేఖాభి స్తిసృభి రవసానేషుఘటితా
భజంతేవర్ణాస్తే తవజనని నామావయవతామ్ ॥

అక్షరము లున్నవనియు, ఆ కమలములందు బీజాక్షరములు (లం, యం, వం, రం, హాం యిత్యాది) కూడ కలవనియు చెప్ప బడినది. బీజాక్షరము లనగా మంత్రబీజము లన్నమాట. కుండలినీశక్తి జ్యోతిర్మయి మాత్ర మేగాక మంత్రమయికూడ. కుండలినీశక్తిని మంత్రబీజములవలననే జాగరితము చేయవలసి యున్నది.

మంత్రములకు వ్యుత్పత్తి సందర్భముగా మననమువలన రక్షించునదనిఅర్థము చెప్పబడుచున్నది.అనగా సంభావనమన్న మాట. మానవశబ్దమునకుకూడ సంభావన (మననము) చేయ గలవాడనియే వ్యుత్పత్తి. కాబట్టి మంత్ర మనగా స్థూలతమ ముగా మననశక్తియని చెప్పుకొనవచ్చును. ఆలోచనా-సంభా వనాశక్తియొక్క విస్తృత కార్యకలాపముగా - ఎదుటివారి ఆలోచనలను చెప్పుట (thought reading). తన ఆలోచన లను ఇతరుల మనస్సులకు మార్పుచేయుట (transfer of thoughts). సమ్మోహాత్మకమైన సూచన (Hypnotic Suggestion) గ్రాహణము, ధారణము, ఇంద్రజాలము — మొదలైనవాటినిసామాన్యజనులుకూడఅంగీకరించుచున్నారు. ఇది భారతదేశమునందు పురాతనముగానున్న మంత్రవిద్య— (సంభావనాశాస్త్రము).

మంత్ర మనగా సృష్ట్యాకృతిని స్వీకరించినశబ్దబ్రహ్మమన్న మాట. శబ్దము, ధ్వని అనగా నేమి? శబ్దము ఆకాశము యొక్క తత్త్వము. శబ్దమును రెండువిధములుగా తెలుసు కొనుచున్నాము. (1) వర్ణాత్మకశబ్దము, మరియు (2) ధ్వన్యా త్మకశబ్దము. ధ్వన్యాత్మకశబ్దము రెండువస్తువుల సంఘర్షణ

వలన ప్రభవించుచున్నది. శబ్దము అనాహతమునందు సంఘర్షణలేకుండ సంభవించు బ్రహ్మము. వర్ణాత్మకశబ్దము, అక్షర, పద, వాక్యములవలన కలుగుచున్నది. అట్టి శబ్దమునకు అర్థము ఉండును. వాక్కుగా వెలువరింపబడుచున్న శబ్దము నిత్య మని దార్శనిక వాదమున్నది.

ఉచ్చరించుటకుముందు శబ్దములేదు. ఉచ్చారణపూర్తి అయినతర్వాత శబ్దములేదు. శబ్దముయొక్కపుట్టుక, మరణము తెలియబడుచున్నవి కదా! శబ్దోచ్చారణప్రయత్నము కన్పడుచున్నదికదా. (దర్శింపబడుచున్నదిగదా!) 'కర్మైకే తత్రదర్శనాత్' మరియు శబ్దము ఉచ్చరింపబడిన తర్వాత ముహూర్త మాత్రముండును. ఆపిమ్మట అదృశ్యమగును (అస్థానాత్) కనుక శబ్దము అనిత్యము కాదా? శబ్దముచేయవలదు - శబ్దమును చేయుము మొదలైనవి (కరోతిశబ్దాత్) వ్యావహారికమునందున్నవే. చేయబడుచున్న కుండలు (ఘట) మొదలగునవన్నియు అనిత్యములే కాబట్టి శబ్దము అనిత్యమే కావలయును కదా. చేయబడు కుండలు మొదలగునవన్నియు కర్త్రాపేక్షికములు. కర్త్రాపేక్షికములన్నియు అనిత్యములే. మరియు నొక్కనిచేత చేయబడిన శబ్దము ఏకకాలమునందు అనేకులకు విన్పించుచున్నది కదా. (సత్వాంతరేచ యౌగపద్యాత్). కాబట్టి శబ్ధమునకు విస్తృతమైన అంగములు అవయవములు కలవన్నమాట. అనగా శబ్దము 'సావయవి' అని నిర్ధారింపబడుచున్నది. 'సావయవి' అనబడు వస్తువులన్నియు అనిత్యములే. కనుక శబ్దముకూడ అనిత్యమే కావలయును. శబ్దముపైన ప్రకృతి వికృతుల ప్రభావము కలదు (ప్రకృతి వికృత్యోశ్చ).

ఉదాహరణకు తపః, శక్తి అనునవి తపశ్శక్తిగా మార్పు చెందుట తెలిసిన విషయమే. ఇట్లు ప్రకృతి వికృతులబద్ధమైన శబ్దము అనిత్యమైనదే కావలయును. మట్టిచేత అనేకములగు కుండలు చేయబడినప్పుడు మట్టి బహుళములైన కుండలరూప ములతో కన్పడును కదా. అట్లే శబ్దము ఉచ్చరించు జనులు ఎక్కువమంది అయినప్పుడు దానియొక్క బృహత్త్వము దర్శ నీయమగుచున్నది. (వృద్ధిశ్చకర్తృభూమ్నాస్య) కాబట్టి శబ్దము న్యూనత అధికత అనుగుణములచేత పాలింపబడుచున్నది. న్యూనాధిక్యతా గుణములుగల వస్తువులన్నియు అనిత్యములే. కావున శబ్దము అనిత్యము కావలయును. ఈ భావములు కణాద గౌతముల వైశేషిక న్యాయసూత్రములందును, ప్రశస్తపాదుని పదార్థ ధర్మసంగ్రహమునందు, శంకరమిశ్రుని ఉపస్కార భాష్యమునందు, వాచస్పతి మిశ్రుల న్యాయసూచీనిబంధన మున ఉదయనాచార్యులవారి న్యాయకుసుమాంజలియందును కనిపించుచున్నవి.

పై అనిత్యవాదమునకు పూర్వమీమాంసకులు, వైయా కరణులు సమాధానము చెప్పిరి.

శబ్దము ఉత్పత్తి అగుటలేదు. అనగా జన్మించుటలేదు. శబ్దము పూర్వమే ఉన్నది. దానిని ప్రయత్నముచేత బయట పెట్టుట మాత్రమే జరుగుచున్నది. ప్రయత్నము ఉత్పత్తికా జాలము. ప్రయత్నానంతరము అభివ్యక్తము కాబడుచున్న శబ్దము పుట్టుచున్నదని చెప్పుటతప్పు. ఉత్పత్తి అభివ్యక్తము భిన్నములే (సమంతు తత్రదర్శనమ్) అనగా శబ్దము పూర్వ మున్నదే. దానిని ప్రయత్నముచేత వెల్లడించుచున్నాము. అది

ఇప్పుడు క్రొత్తగా పుట్టుటలేదు. కాబట్టి శబ్దము నిత్యము. ఉచ్చారణానంతరము ఒక్క ముహూర్త మాత్రముండునని చెప్పుట సరికాదు (సతఃపరమదర్శనం విషయానాగమాత్). శబ్దమెల్లప్పుడు నున్నదే ముహూర్తమాత్రకాలమే కాదు. సదా ఉండును. కాని శ్రోత్రేంద్రియములు శబ్దమును ముహూర్తమాత్రకాలము మాత్రమే స్వీకరించుటకు శక్తి కలిగియున్నవి. కనుక ఆశబ్దము తరువాత లేనట్లు తోచుచుండు టన్నలోపము చెవులదిగాని శబ్దమునకు చెందదు. శబ్దగ్రహణ సామర్థ్యములో చెవులకునైన లోపమును శబ్దమునకు అధ్యారోపించుట సమర్థనీయముకాదు. శబ్దము తరంగములుగా దిగంతములవరకు ప్రయాణించుచునే ఉన్నది. కాబట్టి శబ్దము నిత్యమే. శబ్దము చేయుము, శబ్దము చేయవలదు అనువాక్య ప్రయోగములలో (ప్రయోగస్యపరం) లాక్షణికత్వమే గ్రహింపవలసి యున్నదిగాని ముఖ్యార్థముకాదు. గంగలో గొల్లపల్లెయనునప్పుడు గంగ గట్టుపై గొల్లపల్లెయని గ్రహించినట్లు శబ్దముచేయుము, చేయకుము-అను వాక్యములను - శబ్దమును బయటపెట్టుటకు ప్రయత్నింపుము - అట్టి ప్రయత్నము వలదు - అన్న భావములుగా గ్రహింపవలెను. కాబట్టి శబ్దము నిత్యమే. ఒక సూర్యుడు అనేకమందికి ఏకకాలమునందు కన్పించుట లేదా అందువలన ఆసూర్యుని ఏకత్వమునకు దోషము వచ్చినదా?(ఆదిత్యవద్యౌగపద్యం)రాలేదు.అట్లే ఏకకాలమున శబ్దము బహుజనులకు విన్పించినంత మాత్రమున న్యూనాధిక్యతల వలనకాదు. న్యూనాధిక్యతలు శబ్దమును బాధించవు.న్యూనాధిక్యతా గుణసంబంధమైన అనిత్యతశబ్దమునకు వర్తించదు.

కాబట్టి శబ్దము నిత్యమే. శబ్దములసంధిలో (తపశ్శక్తి) శబ్దాంతరమేగాని ప్రకృతి వికృతుల బద్ధత్వముకాదు. కాబట్టి శబ్దము నిత్యమే (వర్ణాంతరమవికారః). శబ్దవృద్ధి అనగా అభివ్యంజనమున నిరంతరమైన సంయోగవియోగముల హేతువుగా నాదవృద్ధి గోచరించును. (నాదవృద్ధిపరా). అంతమాత్రముచేత శబ్దమునకు అనిత్యతవాటిల్లదు. శబ్దము పదార్థస్ఫురణము చేయుచున్నది. వస్తువు పదముయొక్క అర్థముకదా! వస్తువు దాని నామము - పదము - శబ్దముపైన ఆధారపడియున్నదనుట స్పష్టము. పదార్థము (Matter) వ్యక్తిలక్షణముగాకాక జాతిపరముగా నిత్యమైనది. ఆ పదార్థమును స్ఫురింపజేయు శబ్దముకూడ నిత్యమైనదే. 'గోవు' శబ్దముచేత జాతిపరముగా సకలగోవ్యక్తులును స్ఫురింప జేయబడుచున్నవి. గోశబ్దము నిత్యాకృతివచనము (సర్వత్ర యౌగపద్యాత్) ఇచట నిత్యానిత్యముల సంబంధములేదు. పద, అర్థములకు సంబంధము నిత్యము. కాబట్టి శబ్దము నిత్యమే. ఒక ఆవును రెండుసారులు పిలువగా అది రెండు ఆవులు కాజాలదు. రెండు పర్యాయము లుచ్చరించినంత మాత్రమున ద్వయాకృతి చెందదు. ఏకత్వమే నిలచును. అనిత్యములకు వర్తించు సంఖ్య శబ్దమునకు వర్తించదు. కాబట్టి శబ్దము నిత్యమే. కుండలు, వస్త్రములు మొదలగునవి నశించుట మనము చూచుచున్నాము. అనగా వాటియొక్క నాశనము మనకు గోచరమగుచున్న దనుట. ఇదే విధముగా శబ్దముయొక్క నాశనము మనకు గోచరముకాదు (అనపేక్షత్వాత్). కాబట్టి శబ్దమునకు వినాశము లేదు. అది నిత్యమైనదే. శబ్దము ఇతరద్రవ్య వికా

రముకాదు. ఇతరద్రవ్య వికారమైనచో చెవులకు అనుగుణ విషయాభాసమేర్పడ వలసియున్నది. అట్లు యేర్పడుటలేదు. కావున శబ్దము పరద్రవ్యవికారము కాదన్నమాట. అంతేగాక శబ్దము ఆకాశభూత సూక్ష్మాకృతి యనియు దానిని చెవులు (ధీఇంద్రియములు) ఇంద్రియవిషయము కావించుకొన్న వనియు ప్రసిద్ధవిషయములు. కాబట్టి శబ్దము ప్రత్యేకద్రవ్యము. (ప్రఖ్యాభావాశ్చ యోగస్య). అది నిత్యమైనదే. వేదములు ప్రమాణములు. అచ్చట శంకలకు తావులేదు. వేదము స్వతః ప్రామాణ్యత కలది. వేదము శబ్దమును నిత్య మని చెప్పినది. 'వాచావిరూపనిత్యతా' అని ఋగ్వేదీయ వాక్యము. కాబట్టి శబ్దము నిత్యమైనదే. నిత్య మనగా (లింగదర్శనాశ్చ) అభావ వ్యతిరక్తమైనదని అర్థము. ఈ భావములు జైమినిమహర్షి రచించిన పూర్వమీమాంసా సూత్రములం దున్నవి.

జైమినిమహర్షి వాదము ప్రస్థానద్వయమైనది. కుమారిల భట్టు, ప్రాభాకరభట్టుల అభిహితాన్వయవాదము (అభిధా శక్తి సంపన్నములైన పదములు వాక్యములై వాక్యార్థమును కలిగించుచు - (ప్రత్యేకార్థములు కలిగియుండుట.) అన్వితాభిధానవాదము (అర్థస్ఫురణము గల అక్షరములే పదములై పదార్థమును సూచించు చున్న వనియు - అట్లే వాక్యములందు పదములును) రెండు విభిన్న వాదములు.

వైయాకరణులు పదమునందున్న అక్షరములకు యుగపత్ స్థితి (ఏకకాలికత్వము) లేక నశించుచు, అర్థస్ఫురణకు శక్తివంతములుకానని అభిప్రాయపడిరి. నశించునట్టి అక్షరముల చేత అభివ్యక్తమై అక్షరాతీతమైన అర్థమును స్ఫురింపజేయు

నిత్యపదార్థ మొక టున్నదని వారి అభిప్రాయము. ఆ నిత్యపదార్థముకూడ శబ్దజాతికి చెందినదని నిర్ణయించి దానిని వైయాకరణులు 'స్ఫోటః' అని నామకరణముచేసిరి. స్ఫుట్యతే=వ్యజ్యతేవర్ణైః ఇతిస్ఫోటఅనియు, స్ఫుట్యత్యర్థో౽స్మాదితిస్ఫోటఃఅనియు స్ఫోటయత్యర్థమ్ అనియు వర్ణాతిరిక్తోవర్ణాభివ్యంగ్యోర్థ ప్రత్యాయకో నిత్యశబ్దః స్ఫోటః అనియు పూర్వాపూర్వవర్ణానుభావాహితసంస్కారసచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతేస్ఫోటః అనియు వ్యుత్పత్తులు. భర్తృహరి వాక్యపదీయమున (బ్రహ్మకాండ) 'అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్। వివర్తే౽ర్థభావేనప్రక్రియాజగతో యతః' అని వర్ణించెను. సకల జగత్తుయొక్క ప్రక్రియ ఎట్టిదానివలన జరుగుచున్నదో ఆ అర్థభావముగలిగి వివర్తించు బ్రహ్మము అక్షరము. అది తొలుత నిధనరహితమైన శబ్దతత్త్వమే. ఈ స్ఫోటనిత్యము. గుణరూపవంతమైన ప్రకృతిచేత పదార్థరూపముగా విసృతిపొందిన దీ నిత్యమైన శబ్దబ్రహ్మమేనని వైయాకరణుల సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును పాణిని తన సూత్రములందు (అష్టాధ్యాయి) ఆద్యంతరములందు స్పృశించెను. మహాభాష్యమున పతంజలి మహర్షి అక్షరసమామ్నాయమంతము (ప్రతిమండితో బ్రహ్మరాశిః) బ్రహ్మరాశి యని 'కింపునర్నిత్యః శబ్దః అహోస్విత్ కార్యః' అని శబ్దనిత్యత్వమును ప్రస్తావించెను.

సృష్టికి పూర్వము పరమేశ్వరుని సంకల్పాత్మకమైన దృష్టి ("తదైక్షత బహుస్యాంప్రజాయేయేతి") కూడ శబ్దాత్మక తేజమేనని నిశ్చితభావము. అందుచేత బ్రహ్మసూత్రములందు 'ఈక్షతేర్నా౽శబ్దం' అని కలదు. కావున ఉపనిషత్తు 'తేజో

మయీ వాక్' అనిచెప్పి తేజస్స్వరూపశబ్దము సృష్టిబీజ మని చెప్పినది. ఈ భావమునే జయదేవుడు (ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం)అని అష్టపదిలో వర్ణించెను. శబ్దము (వేదము) పరమేశ్వర హృత్కమలమందుండి ఆయన ముఖమునుండి బహిర్గతమైనది. వేదము శబ్దరూపకమైన సృష్టియొక్క వివరణవ్యాఖ్యానము.

శబ్దము పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ – అని నాలుగు విధములు. ఈ నాలుగు రూపములకు జన్యస్థానమేది యన్న విషయములో స్వల్పాభిప్రాయభేద మున్నది. ఇచ్ఛారూపమైన పరాస్థానము సహస్రారమనియు, అది వాయురూపమున మూలాధారమును చేరుననియు కాదిమతము. మధ్యమా స్వరూపశబ్దమే స్ఫోటము.

శబ్దస్వరూపముగావిన బడునదెల్ల శక్తియే. తత్త్వములు లయించినప్పుడే రూపవిహీనమగును. ఆకాశతత్త్వమున్నంత వరకే శబ్దముండును. శబ్దము లయించినప్పుడు పరతత్త్వమే. "యత్కించిన్నాదరూపేణ స్ఫురాయతే శక్తిరేవచ। యస్తత్వాంతో నిరాకారాః స ఏవ పరమేశ్వరః" కావున పరతత్త్వమునకు సన్నిహితమైనది శబ్దబ్రహ్మము. శబ్దబ్రహ్మము ధ్వనిరూపముగా వివృతి పొందునప్పుడే దానియొక్క అర్థస్ఫురణము జరుగుచున్నది. కాబట్టిశబ్దార్థముల అవినాత్వము అందుచేత నేవిశ్వము వర్ణాత్మకమైనది. సృష్టిజీవులయందు చైతన్యమే శబ్దబ్రహ్మము. (చైతన్యం సర్వభూతానాం శబ్దబ్రహ్మేతి మేమతిః। తత్ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహమధ్యగాం। వర్ణాత్మనావిర్భవతి గద్యపద్యాదిభేదతః – శారదాతిలక).

శబ్దబ్రహ్మము కుండలినీ రూపమట. కాబట్టి దానిని మహా మాతృక - మాతృకావర్ణరూపిణి (అక్షరరూపిణి) అని వర్ణించుట జరుగుచున్నది.

అక్షరములు - వర్ణములు—స్థూలాకృతి కలవి. వైఖరీ రూపము కలవి. ఆయా చక్రములందు ఆవిర్భవించునవి మాతృక లనగా అక్షరములకు సూక్ష్మాకారము లన్నమాట.

పరాశబ్దము కుండలిని యందున్నది. మూలాధారము నుండి పైకి నిర్గమించును. పరాశబ్దము పరమాకలయే అనగా ఆత్మయందు విమర్శాశక్తి యన్నమాట సర్వవర్ణములకు మూలస్థానమైనది. దానినుండి పశ్యంతి ప్రభవించినది. ఇచ్ఛాశక్తి అంకుశధారిణియై బీజాకృతిగా నున్న విశ్వమును ప్రదర్శించుటకు నుద్యుక్తురాలైనప్పటి శబ్దస్థితి పశ్యంతి. (మూలాధారమునుండి మణిపూరకము, పశ్యంతిశక్తికి వామా యని పేరు. (వమనాత్ వామా ఇతి) అనగా ఆమె విశ్వమును వమనము చేయునట. (సామాన్యస్పందనము) మధ్యమావాక్కు-జ్ఞానరూపమైనది బుద్ధి సహితమైనది. ఋజురేఖాకృతి కలది. జ్యేష్ఠానామధారిణి. ఇచ్చట వాక్కు- స్వరూపధారణము చేయును. (హిరణ్యగర్భరూప) అనగా మాతృకావర్ణస్వరూప మన్నమాట.(మాతృకాత్వఉపపన్నా) ఇచట విశేషస్పందనమై స్ఫోటమైనది. వైఖరీవాక్కు. క్రియాశక్తిరూపమైనది. రౌద్రి నామధారిణి. త్రికోణాకృతి కలది. మధ్యమాశక్తి అక్షర వాసనాదశయం దుండగా - వైఖరీ అక్షరాకారమునే స్వీకరించి పదపదార్థస్వరూపమైనది.

మంత్రము అక్షరయుక్తమై శబ్దబ్రహ్మాత్మికమే.అది శబ్ద

బ్రహ్మమునకు స్థూలాకృతి చెప్పవచ్చును. సామాన్యశబ్దమునకే చాతుర్యమును ఆవేశమును మాధుర్యమును అనుభవమునకు తెచ్చుశక్తి కలదని జనసామాన్యముకూడ గ్రహించిన విషయము. భిన్నభిన్న వాక్యపదశైలీవిన్యాసములచేత భిన్నభిన్న రసానుభూతులు కలుగుచున్న వికదా మంత్రము మానసిక శక్తిని సముజ్జ్వలము దివ్యముచేయుననుట నిశ్శంకగా నంగీకరింపవలసిన విషయము. దానివలన ఇంద్రియాతీతతత్త్వానుభవము సాధింపవచ్చును. సామాన్యశబ్దము స్థూలమైనది. మంత్రశబ్దము చైతన్యవంతమైనది. మంత్రమునలన దివ్యశక్తి సముద్భవించును. సామాన్యద్రవ్యమునకు బ్రహ్మపదార్థమునకు భేదమున్నట్లు, జీవునకు, బ్రహ్మమునకు భేదమున్నట్లు - సామాన్యశబ్దమునకు మంత్రశబ్దమునకు భేదము కలదు.

మంత్రమును, మంత్రదేవతను తెలిసి మంత్రార్థములో మంత్రదేవతను ధ్యానించుట చిత్తము చేయుచున్నది.

మంత్రమునందు వాచకవాచ్యము లని రెండు శక్తులున్నవి. మంత్రమునకు ఉద్దిష్టమైన దేవతవాచ్యశక్తి, (ప్రతిపాద్య దేవత). మంత్రమే మంత్రమయీ - వాచకశక్తి. ఫలమునందు బీజమున్నట్లు వాచకశక్తియందు వాచ్యశక్తి యున్నది. ఫలమును భేదింపక మున్ను బీజదర్శనము లేనట్లే వాచకశక్తిద్వారముగా వాచ్యశక్తిని చేరవలెను. వాచ్యశక్తి మంత్రమునకు ఆత్మవంటిది. వాచకశక్తి దేహము వంటిది. దేహములేనిదే జీవమునకు స్థానములేదు. జీవములేక దేహమునకు విలువలేదు. ఈ రెండుశక్తుల అన్యోన్యతావిధాన మట్టిది. వాచకశక్తికి ప్రకృతిదేవతా యని వాచ్యశక్తికి అధిష్ఠాత్రి

దేవతా యని నామాంతరములు. ఇవిగాక అభిమాన దేవతా కలదు. అభిమాన దేవత ఋషి. కాబట్టి వాచకవాచ్యసమ్మేళనము వలన ఉద్దిష్టమంత్రచైతన్యసిద్ధి లభించును. చైతన్యహీనమైన సామాన్యశబ్దములు మంత్రములుకావు. మంత్రపురశ్చరణము పార్థనవంటిది కాదు. అంకితము చేసుకొనుటకాదు. అనగా శోకదుఃఖావేశములతో సమర్పించుకొనుట కాదన్న మాట. మంత్రపురశ్చరణకు ప్రథమానుభవము మంత్ర దేవతా కటాక్ష కిరణలేశము. సంపూర్ణ ఫలము మంత్రసిద్ధి. ('యథాభిమతధ్యా నాద్వా' - యోగసూత్రమ్. యదేవాభిమతంత దేవధ్యాయేత్ - వ్యాసవ్యాఖ్య).

వాచక వాచ్యశక్తుల సంబంధమునకు ఉదాహరణముగా మేఘమునకు దానియందున్న జలమునకు గలసంబంధము చెప్పబడుచున్నది. మంత్ర దేవతాకటాక్షమునకై చేసెడు కృషిని సాధన యందురు. ఈ సాధనకు మంత్రసంకేత,యంత్ర సంకేత, పూజా (తంత్ర) సంకేతములు తెలియవలెను.

మహామంత్రములకు హృదయ, కవచ,మాలా, పంజర, అష్టోత్తర, సహస్రనామస్తోత్రములను బాహిరమైన షడంగములు కలవు. ఇవిగాక ఋషి, ఛందో, దేవతా, బీజ, శక్తి, కీలకా - ఇతి - షడంగములు ఆంతరమైనవి కలవు..

మంత్రమందున్న అక్షరములనుబట్టి పిండ కర్తరి.బీజ మంత్రమాలలని పేర్లు. ఏకాక్షర మంత్రములు పిండములు. రెండక్షరములు కలవి కర్తరులు. మూడు మొదలు తొమ్మిది యక్షరములవరకు బీజములు. పదిమొదలు యిరువది వరకు కలవి మంత్రములు. అంతకుపైన నున్నవి మాలలు (మంత్ర

ఏకాక్షరాః పిండకాః, కర్తర్యోద్వ్యక్షరామతాః, వర్ణత్రయం సమారభ్య న వార్ణానధి బీజకాః; తతో దశార్ణమారభ్య యానద్వింశతి మంత్రకాః, తత్ర ఊర్ధ్వగతాః మాలాః; తాసు భేదోన విద్యతే - నిత్యాతంత్రము). మరియొకవిధమైన విభాగ మిట్లున్నది.

"పుందైవత్యాః మంత్రాః స్త్రీ దైవత్యా విద్యా ఇతి మంత్రవిద్యయోః లక్షణ భేదే ప్యస్యాః శివశక్తి సామరస్య స్వరూపత్వాత్ ఉభయాత్మతేతిద్యోత కాయమంత్రాణాం మధ్యే విద్యేత్యుక్తం."

"పుంరూపవాస్మరేద్దేవీం స్త్రీరూపం వాచింతయేత్
అధవా నిష్కళంధ్యాయేత్ సచ్చిదానంద లక్షణం"

(సౌభాగ్యభాస్కరమ్)

మంత్రమును గురించి మరికొన్ని ముఖ్యవిషయములు.

"ఫలాక్షర సూత్రము"నందు "మంత్రాద్యోజయతి" అనగా ఆదియందు ఉచ్చరింపతగిన ఓంకారము సర్వోత్కర్ష ముగా నున్నదని చెప్పబడినది. మాతృకా కోశమున "ఓం కారోవర్తుల స్తారోమంత్రాద్యః ప్రణవోధ్రువః" అని కలదు. (ఓంకారము వర్తులాకారము తారము మంత్రాద్యము ప్రణ నము నిశ్చయము). కాళికాపురాణమున - ఏమంత్రముగాని ప్రణవాది ప్రణవాం తముకాకున్న నిష్ప్రయోజనమని చెప్ప బడినది. (స్రవ్యత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే). శాకటాయన స్మృతియందు దానము, యజ్ఞము, తపస్సు, స్వాధ్యాయము, జపము, ధ్యానము, సంధ్యోపాసన, ప్రాణా యామము, హోమము, పైతృకము,

మంత్రోచ్చారణము, బ్రహ్మారంభాదులు ఓంకారముతో ప్రారంభింప నలెనని యున్నది. (దానయజ్ఞ తపస్స్వాధ్యాయ జపాధ్యాన సంధ్యోపాసనా ప్రాణాయామ హోమదైవ పిత్ర్య మంత్రోచ్చారణ బ్రహ్మారంభాదీని ప్రణవ ముచ్చార్య ప్రవర్తయేత్) కాత్యాయనస్మృతియు 'వేదములకు మొదట, వేదపఠనాంతమందు, యాగహోమాదులందు, శాంతి పౌష్టిక కర్మలందు, ఇతరకామ్య నైమిత్తిక కర్మలందు ఓంకార ముచ్చరింపవలెనని' చెప్పినది. (ప్రణవం ప్రకృత్య బ్రహ్మారంభే విరామేచ యాగ హోమాదిషు శాంతిపుష్టి కర్మసుచాన్యేష్వపి కామ్యనైమిత్తికాదిషు సర్వేషు వినియోగోఽస్య). దాల్భ్య పరిశిష్టమున (బ్రహ్మయజ్ఞో జపో హోమో దేవర్షి పితృకర్మచ అనోంకృత్యకృతం సర్వం నభవేత్సిద్ధి కారకమ్) బ్రహ్మయజ్ఞము జప హోమ దేవఋషి పితృకర్మలు ఓంకార రహితములైన సిద్ధప్రదములుకావని యున్నది. అన్ని మంత్రములు ఓంకారమున నున్న వని శ్రుతి. ఓంకారేణ సర్వాణా స్తంత్రకాణి.

ఆమ్నాయమంత్రము లన్నియు పరమేశ్వరుని ముఖ సంభూతములే. సద్యోజాతముఖమునుండి వేదమాతృకయైన గాయత్రి మొదలుగాగల రెండుకోట్లు మంత్రము లుద్భవించి నవి. ఇవి వైదికమంత్రములని చెప్పబడుచున్నవి. ఇవి పూర్వా మ్నాయమంత్రములు.

వామదేవముఖమునుండి శైవాగమసముద్భవములైన మంత్రములు కోటిప్రభవించినవి. దక్షిణామూర్తి సౌభాగ్య విద్య వంటి మంత్రములు. ఇవి దక్షిణామ్నాయ మంత్రములు.

అఘోరముఖమునుండి పశ్చిమామ్నాయమంత్రములైన వైష్ణవాగమ చోదితమంత్రములు కోటి జనించినవి.

తత్పురుషముఖమునుండి శ్రీవిద్యాఖ్యమైనమంత్రములు రెండుకోట్లు ప్రభవించినవి.ఇవి ఉత్తరామ్నాయమంత్రములు.

ఈశాన ముఖమునుండి ఆత్మానంద ప్రదాయకములైన ఊర్ధ్వామ్నాయమంత్రములు కోటి జనించినవి.

సమయ దక్షిణాచారమున 16 పూర్ణదీక్షామంత్రములును (వసిష్ఠసంహిత) వామాచారమున దశమహావిద్యలను 10 సిద్ధమంత్రములును (క్రమచంద్రిక) మిశ్రమాచారమున 32 పూర్ణదీక్షా మంత్రములు (భాస్కరాచార్య లలితాసహస్ర నామ భాష్యమ్) ముఖ్యములు.

సిద్ధి-తేలికగా లభించునా ? అను ప్రశ్నకు శ్రీమద్భాగవతమున శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవునకు (ఉద్ధవ శ్రీకృష్ణ సంవాదము) సమాధాన మొసగెను. ఈ సిద్ధిని ఉపలబ్ధి చేసుకొను సాధనామార్గమునే శాస్త్రములు చెప్పుచున్నవి. (సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా).

శ్రీవిద్యామంత్రార్థ వ్యాఖ్యానమును శ్రీభగవత్పాదులు బ్రహ్మవిద్యావిలాస మను గ్రంథమునందు చేసిరి.

శ్రీః

శ్రీః

# శ్రీ చక్ర విలసనము

## 'సమయమత' నిర్వచనము

(నాలుగవ అనుబంధము)

సమయ మను చంద్రికల యొక్కయు సమయుని (శ్రీశంభుని) యొక్కయు, పూజను సహస్రకమలమునందు చేయుట సమయమతము. శ్రీశంభువుతో పంచవిధములైన (అధిష్ఠాన, అవస్థా, అనుష్ఠాన, రూప, నామ) సామ్యములు కలది సమయ. శివు లిద్దరు (శివా శివ) సమప్రధానులు.

అధిష్ఠాన సామ్యము : (సమయా, సమయు లిద్దరు) ఆధారచక్రమునకు అధిష్ఠానరూపు లగుటవలన అధిష్ఠాన సామ్యము కలిగినది. 'జనక జననీ మజ్జగదిదమ్' జగదుత్పాదన క్రియయందిరువురు నిష్టపడినవారగుటచేత అనుష్ఠానసామ్యము. ఉభయులకు నృత్యోద్యోతకములైన లాస్యతాండవశబ్దమువలన అవస్థాసామ్యము కలిగినది. "నవాత్మానమ్" "జపాకుసుమ సంకాశౌ మదఘూర్ణితలోచనౌ" అను వాటివలన రూప సామ్యము కలిగినది. ఇరువురును శివులగుట, కామేశ్వరులగుట. నామసామ్యము. ఇట్లే షట్కమలములందు సమయాసమయులకు పంచవిధసామ్యముకలదు. సమయమతమున సహస్రకమలమందే పూజ. సహస్రకమలము బిందుస్థానమగుటవలన — చంద్ర మండలమును చతురస్రరూపముగను, బిందువును పంచవింశతి.

తత్త్వాతీతముగ, షడ్వింశ (26) తత్త్వాత్మక శివశక్తి మేళన రూపమైన సాదాఖ్యరూపముగసంభావింపవలెను. వామకౌలా చారులు పంచవిధసామ్యమును అంగీకరించుటలేదు.

కౌలమతే చంద్రకలాత్మకానాం, షోడశనిత్యానాం ప్రతిదినమేకైకస్యైవ తిథి నిత్యాయాః పూజనం విహితం, సమయమతేతు,షోడశకలాయాః పంచదశకలాస్వంతర్భావాత్ బైందవస్థానే పంచదశకలానాం మహానిత్యాకలాయామంత ర్భావసంభవాచ్చ ప్రత్యహం పంచదశ నిత్యానామారాధనం విహితమ్. (కౌలమతములో తిథినిబట్టి పూజాతతంగము; సమయమతములో నిత్యాకలయందు మిగిలినవి అంతర్భూ తము లని భావించి పూజించుట).

'సమయ' అనగా వేద మని యర్థము. శ్రీదేవి వేదము లందు అర్థరూపముగ నున్నది కావున ఆమెకు 'సమయా' అను నామము కలిగినది. శ్రీదేవిని వేదార్థరూపముగా భావించుట సమయమతము. వేదవిహిత ఆచారము సమయమతము. 'వామో విపరీతో వేదవిరోధ్ధోవా ఆచారః' అనగా వామ కౌళము వేదవిరుద్ధమైనమార్గము.

వేదసమ్మతముగా శ్రీచక్రార్చనాదులు బాహ్యపూజా కలాపమునందు జరుపుట దక్షిణాచారము. ఈ ఆచారమున కామేశ్వరీ కామేశ్వరులు దేవతలు. దక్షిణామూర్తి ఋషి. వేదసమ్మత రాజోపచార దేవోపచారములు. దక్షిణ హస్త ముతో పూజానిర్వహణము. వామాచారులకు భైరవీభైరవులు దేవతలు. పరశురామ దత్తాత్రేయాది కల్పసూత్రములతో పూజావిధానము. వామహస్తముతో పూజానిర్వహణము.

శ్రుతి. "నైతమృషిం విదిత్వానగరం ప్రవిశేత్" ఋషి నెరింగి శ్రీచక్రనగరమును పూజింపరాదు. అనగా బాహ్య పూజ వలదని భావము. ఋషి ఛందస్సు, దేవత మొదలగునవి బాహ్యపూజాయందవసరము. అంతరపూజయందు విశ్వాను సంధానము లున్నవి. కాబట్టి ఋష్యాది జ్ఞాన మక్కరలేదట. శ్రుతి. "యది ప్రవిశేత్, మిథా చరిత్వా ప్రవిశేత్" శివశక్తి మేలనమును (శివచక్ర, శక్తిచక్ర మేలనము) తెలిసి - ఏకాంత మున అంతరపూజ చేయవలయును.

ఈ విషయములే సనత్కుమార సంహితయందు చెప్ప బడినవి.

"బాహ్యపూజాన కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః
సాక్షుద్ర ఫలదా నృణాం ఐహికార్థైక సాధనాత్
బాహ్యపూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః
దిగంబరాశ్చేతిహాసా (పీతవాసా) వామకా స్తంత్రవాదినః.
అంతరారాధన పరావైదికా బ్రహ్మవాదినః
జీవన్ముక్తాశ్చరం త్యేతేత్రిషులోకేషు సర్వదా॥

కౌలు లనగా ఆధారచక్ర పూజారతులు. ప్రత్యక్ష (స్త్రీ) యోని పూజారతులు క్షపణకులు. పై రెంటిని చేయు వారు కాపాలికులును దిగంబరులును. ఇతి హాసులు (పీత వాసులు) భైరవయామళ ప్రామాణ్యము కలవారు. వామకులు వామకేశ్వర తంత్రవాదులు. కేవల చక్రపూజారతులు వేద బాహ్యులు. అంతరపూజా రతులు బ్రహ్మవాదులు.

ఈ సమయమత, కౌళమత వివరములను శ్రీ గౌడపాదాచార్యులవారు సుభగోదయమునం దిట్లు చెప్పిరి.

శ్లో. తవాజ్ఞాయాం విద్యుచ్చయతి నియుతాభాక్షురమ యూ-
స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంథి మభినత్ ।
తతో గత్వాజ్యోత్స్నామయ సమయలోకం సమయయా
పరాఖ్యాసాదాఖ్యా జయతి శివతత్త్వేన మిళితా॥

శ్లో. భవేన్మూలాధారం తదుపరితనం చక్రమపిత
ద్ద్వయం తామిస్రాఖ్యం శశికిరణసమ్మేళనవశాత్ ।
తదేతత్కౌళానాం ప్రతిదినమనుష్ఠేయముదితం
భవత్యావామాఖ్యం మతమపి పరిత్యాజ్యముభయమ్ ।

శ్లో. అమీషాం కౌళానాం భగవతి భవేత్పూజనవిధి
స్తవస్యాధిష్ఠానే తదనుచ భవేన్మూలసదనం ।
అతో గౌహ్యా పూజా భవతి భగరూపేణ చ తతో
నిషిద్ధాచారోఽహం నిగమవిరహో నింద్యచరితమ్ ॥

శ్లో. సహస్రారం బిందుర్భవతి చ తతో బైందవగృహం
తదేతస్మాత్ జ్ఞాతం జగదిదమశేషం స కరణమ్ ।
తతో మూలాధారద్వితయమభవత్తద్దశదళం
సహస్రారాజ్జాతం తదితి దశధాబిందురభవత్ ॥

శ్లో. తదేతద్బిందోర్యద్దశకమభవత్తత్ప్రకృతికం
దశారం సూర్యారం నృపదళమభూన్నేత్రకమలమ్ ।
రహస్యం కౌలానాం ద్వితయమభవన్మూలసదనం
తథాధిష్ఠానం చ ప్రకృతిమథసేవంత ఇహతే॥

శ్లో. అత స్తే కౌలాస్స్యుర్భగవతి దృఢప్రాకృతజనా
ఇతి ప్రాహుః ప్రాజ్ఞాః కులసమయ మార్గద్వయవిదః

మహాంతస్సేనంతే సకలజననీం బైందవగృహే
శివాకారాం నిత్యామమృతఝరికాం బైందవకళామ్.

మిశ్రతంత్రములు:— కౌలాచార, సమయాచారముల మిశ్రమముగా నున్నది.

మిశ్రమమార్గము. దీనిని మిశ్రక మని చెప్పుదురు. "మిశ్రకం కౌలమార్గంచ పరిత్యాజ్యంహిశాంకరి" - అని పరమేశ్వరవాక్యము కాబట్టి మిశ్రకమార్గము కౌలమార్గము పరిత్యాజ్యములే. మిశ్రకమనగా చంద్రకళా విద్యాష్టకము. అనగా చంద్రకళ, జ్యోత్స్నావతి, కలానిధి, కులార్ణవము, కులేశ్వరి, భువనేశ్వరి, బార్హస్పత్యము, దూర్వాసమతము అను తంత్రము లెనిమిది. దూర్వాసకృతమైనది సౌభాగ్య చింతామణి. కౌలమతతంత్రము లరువదినాలు గని వామకేశ్వరతంత్ర చతుశ్శతియందు కలదు.

శ్లో. "చతుష్షష్టిశ్చ తంత్రాణి మాతౄణా ముత్తమానిచ
మహామాయాశంబరంచ యోగినీజాలశంబరమ్
తత్త్వశంబరకంచైవ భైరవాష్టకమేవచ
బహురూపాష్టకంచైవ యామళాష్టకమేవచ
చంద్రజ్ఞానం మాలినీచ మహాసమ్మోహనం తథా
వామజుష్టం మహాదేవం వాతులం వాతులోత్తరం
హృద్భేదతంత్రభేదంచగుహ్యం తంత్రంచ కామికం
కళావాదం కళాసారం తథాఽన్యత్కుండికామతం
మతోత్తరం చ వీణాఖ్యం త్రోతలం త్రోతలోత్తరం
పంచామృతం రూపభేదం భూతోడ్డామర మేవచ
కులాసారం కులోద్దేశం కులచూడామణి స్తథా

అరుణేశం మోదినీశం వికుంఠేశ్వర మేవచ
పూర్వ పశ్చిమదక్షిణం చ ఉత్తరం చ నిరుత్తరం
విమలం విమలోత్తం చ దేవీమతః పరమ్" ॥

ఈ అరువది నాలుగుతంత్రములు వైదికమార్గ దూర ములు. ఇవి అతి సంధానకారణములై వినాశహేతువులగు చున్నవి. ఇవి విద్వల్లోక ప్రతారకములని శ్రీశంకర భగవత్పాదులవారు సౌందర్యలహరి యందు చెప్పియున్నారు. (చతుష్షష్ట్యాతంత్రైస్సకలమతి సంధాయభువనం.)

తంత్ర వివరము

1. మహామాయా శంబరము:-మాయాప్రపంచమునునిర్మించుట. ఉదాహరణకు వస్త్రమును కుండవలెచూపుట.
2. యోగినీజాలశంబరము :— శంబరము మాయావిద్య. యోగులను కూడ మాయామోహితులను చేయునదీ విద్య, ఇది స్మశానవాసాదులవలన సాధింపబడునది. కాబట్టి నింద్యము.
3. తత్త్వశంబరము:-పృథివ్యాదులైన తత్త్వము లందొకదాని యందు మరొకటి చూపించుట. ఇది మహేంద్రజాలవిద్య.

4-11. భైరవాష్టకము :-సిద్ధ, వటుక, కంకాళ, కాల, కాలాగ్ని, యోగినీ, మహాశక్తి, భైరవము లెనిమిది. నిధినిక్షేపములను గుర్తించుట ఫలము. కాపాలికమత సంబంధములై దుష్టములు.

12-19. బహురూపాష్టకము :— "బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండ,

శివదూతి" అను యెనిమిది రూపములుగల శక్తి యొక్క యెనిమిది. తంత్రములు. ఇవి వైదికమార్గదూరములు.

20-27. యమళాష్టకము :—కామ సిద్ధాంబకు యమళయని పేరు. కామసిద్ధాంబ. ప్రతిపాదకములైన తంత్రము లెనిమిది యమళాష్టకము. ఇవి వైదికమార్గ దూరములే. అరువది నాలుగు తంత్రములకు యమళములనుట అర్ధభేదము. అవైదికత్వ కారణముచేత.

28. చంద్రజ్ఞానము :—కాపాలిక మత సంబంధమైన చంద్ర జ్ఞానతంత్రము. ఇది సమయాచారోపాదేయ చంద్రజ్ఞాన విద్యకాదు. అది చతుష్షష్టి తంత్రాతీతమైనది.

29. మాలినీ :— ఇది సముద్రయానోపాయ హేతువు. అవైదికమార్గము.

30. మహాసమ్మోహనము :—మేలుకొన్నవారిని నిద్రపుచ్చుట చేయగలదు. బాలజిహ్వాచ్ఛేదనాదులవలన సాధింప బడుటచేత నింద్యము.

31-32. వామజుష్ట మహాదేవ తంత్రములు :—ఇవి రెండును కేవల వామాచార ప్రవర్తకములు. నింద్యములు.

33-35. వాతుల, వాతులోత్తర, కామికములు:—కర్షణాది ప్రతి ష్ఠాంత విధులు కలవి. కొంత వైదిక భాగముకలిగి - అధికముగా వామాచారము కలవి.

36. హృద్భేదతంత్రము :—ఇది కాపాలికము. షట్కమల భేదనమును, సహస్రారప్రవేశమును కాపాలికమత మార్గమున ప్రతిపాదించును.

37, 38, 39, 40. తంత్ర భేదము, గుహ్యతంత్రము :—పరుల

తంత్రాంగమును రహస్యముగ వెల్లడిగ భేదించునవి.ఇందు ఇందు హింసాప్రసక్తికలదు. నింద్యము తంత్ర భేదము మూడు తంత్రముల సంచయము.

41. కళావాదము :— ఇది వాత్స్యాయనాదికము కామ పురుషార్థమును ప్రతిపాదించునది. పరదారగమనాది నిషిద్ధాచార సంకలితము.

42. కలాసారము :—వర్ణోత్కర్ష విధి ప్రవర్తించు వామాచార విధానము.

43. కుండికామతము :— ఘుటికాసిద్ధిని కలిగించు వామాచారము.

44. మతోత్తరము :—రససిద్ధిని కలిగించు వామాచారము.

45. వీణాఖ్యతంత్రము :-సంభోగయక్షిణి వీణ. ఆయక్షిణిని లోబరచుకొను విధానమును చెప్పునది.

46-47. త్రోతలతంత్రము, త్రోతలోత్తరము | అనునది నాల్గువేల యక్షిణులను చూపించు వామాచారతంత్రములు.

48. పంచామృత తంత్రము :—పృథివ్యాది పంచభూతములకు మృత్యువులేమిని ప్రతిపాదించు తంత్రము కాపాలికము.

49-53. రూపభేదము, భూతోడ్డామరము, కులసారము, కులోడ్డీశము, కులచూడామణి :—ఇవి దిగంబర మతములు. మారణహేతువులు నింద్యములు.

54-58. సర్వజ్ఞానోత్తమము, మహాకాళీమతము, అరుణేశము, మోదినీశము, వికుంఠేశ్వరము :—ఇవి దిగంబరమత ప్రతిపాదకములు.

59-64- పూర్వాది తంత్రములు:—(1) పూర్వపశ్చిమ, దక్షిణము, 2. ఉత్తరము, 3. నిరుత్తరము, 4. విమలము, 5. విమలోత్తమము, 6. దేవీమతము: ఈ ఆరుతంత్రములును క్షపణకసిద్ధాంత ప్రతిపాదకములైనవి.

కౌలమతమున కాల, కుల, నామ, జ్ఞాన, చిత్త, నాద, బిందు, కలా, జీవవ్యూహములని తొమ్మిది వ్యూహములు. ఇవి భోక్త భోగ్య భోగము లని మూఁడు విధము లగుచున్నవి. ఈ నవవ్యూహతాదాత్మ్యమువలన ఆనందభైరవ మహాభైరవులకు తాదాత్మ్యము నవాత్మత్వము కలుగుచున్నది అందుచేత శేషశేషి భావమపేక్షణీయము.

కౌలమతము వారికి త్రికోణమైన ఆధారచక్రమే నిత్యపూజార్హము. ఉత్తరకౌలును ప్రత్యక్షయోని పూజారతులు. ఇది తామిస్రపూజ. మహాభైరవాకారమయిన దిగంబరత్వము నాశ్రయించుట సురామాంస మధుమత్స్యాదులతో వామాచారముగా పూజ మొదలైనవి కలవు.

పరమ పరిశుద్ధమై - ఉపనిషన్మతమైనది శ్రీవిద్య. దీనినే సమయమత మందురు. దీనికి శుభాగమపంచకము ప్రమాణగ్రంథములు. ("నశివేన వినాదేవీ దేవ్యాచన వినాశివః, నైతయోరంతరం నాస్తి చంద్రచంద్రికయోరివ" మమరూపాసి దేవిత్వం న భేదోఽస్తిత్వయామయా.)

సాధనా కల్పలతిక (నీలమణి ముఖోపాధ్యాయునిచేత ప్రకటింపబడినది.) అను గ్రంథమున-భారత దేశము విష్ణుక్రాంత, రథక్రాంత, అశ్వక్రాంత విభాగములుగా చేయబడి భిన్నభిన్న

విభాగములకు భిన్నభిన్న తంత్రములు చెప్పబడినవి. ఈ వివరములు శక్తిమంగళతంత్రమునకూడ కలవు.

విష్ణుక్రాంతము:— వింధ్యపర్వతమునుండి చిట్టగాంగువరకు. ఈ ప్రాంతమునకు 64 తంత్రములు చెప్పబడినవి.

రథక్రాంతము:—వింధ్యమునుండి నేపాలుమీదుగాచీనావరకు. ఈ ప్రాంతమునకు 64 తంత్రములు చెప్పబడినవి.

అశ్వక్రాంతము:— వింధ్యమునుండి ద్వీపకల్పప్రాంతము. ఈ ప్రాంతమునకు 64 తంత్రములు చెప్పబడినవి.

కొన్ని తంత్రములు రెండు మూడు ప్రాంతములకు వర్తించుచున్నవి.

## విష్ణుక్రాంత దేశవిభాగమునకు తంత్రములు

1. సిద్ధీశ్వర
2. కాళీతంత్ర
3. కులార్ణవ
4. జ్ఞానార్ణవ
5. నీలతంత్ర
6. ఫేట్కారి
7. దేవ్యాగమ
8. ఉత్తర
9. శ్రీక్రమ
10. సిద్ధియామళ
11. మత్స్యసూక్త
12. సిద్ధసార
13. సిద్ధిసారస్వత
14. వారాహి
15. యోగిని
16. గణేశవిమర్శని
17. విశ్వ
18. శివాగమ
19. చాముండా
20. ముండమాలా
21. హంసమహేశ్వర
22. నిరుత్తర
23. కులప్రకాశక
24. దేవీకల్ప
25. గాంధర్వ
26. క్రియాసార
27. నిబంధ
28. స్వతంత్ర
29. సంమోహన
30. తంత్రరాజ
31. లలితా
32. రాధా
33. మాలినీ
34. రుద్రయామళ
35. బృహత్ శ్రీక్రమ
36. గవాక్ష
37. సుకుముదిని
38. విశుద్ధేశ్వర
39. మాలినీవిజయ
40. సమయాచార
41. భైరవి
42. యోగినీహృదయ
43. భైరవ
44. సనత్కుమార
45. యోని
46. తంత్రతార
47. నవరత్నేశ్వర
48. కులచూడామణి
49. భావచూడామణి
50. దేవప్రకాశ
51. కామాఖ్య
52. కామధేను
53. కుమారి
54. భూతడామర
55. యామళ
56. బ్రహ్మయామళ
57. విశ్వసార
58. మహాకాల
59. కులోడ్డీశ
60. కులామృత
61. కుబ్జికా
62. తంత్రచింతామణి
63. కాళీవిలాస
64. మాయాతంత్ర

## రథక్రాంత దేశవిభాగమునకు తంత్రములు

1. చిన్మయ
2. మత్స్యసూక్త
3. మహిషమర్దని
4. మాతృకోదయ
5. హంసమహేశ్వర
6. మేరుతంత్ర
7. మహానీల
8. మహానిర్వాణ
9. భూతడామర
10. దేవడామర
11. బీజచింతామణి
12. ఏకజాత
13. వాసుదేవరహస్య
14. బృహద్గౌతమీయ
15. వర్ణోద్ధృతి
16. ఛాయానీల
17. బృహద్యోని
18. బ్రహ్మజ్ఞాన
19. గరుడ
20. వర్ణవిలాస
21. బాలవిలాస
22. పురశ్చరణచంద్రిక
23. పురశ్చరణరసోల్లాస
24. పంచదశి
25. పిచ్ఛిల
26. ప్రపంచసార
27. పరమేశ్వర
28. నవరత్నేశ్వర
29. నారదీయ
30. నాగార్జున
31. యోగసార
32. దక్షిణామూర్తి
33. యోగసర్వోదయ
34. యక్షిణీతంత్ర
35. స్వరోదయ
36. జ్ఞానభైరవ
37. ఆకాశభైరవ
38. రాజరాజేశ్వరి
39. రేవతి
40. సారస
41. ఇంద్రజాల
42. కృకలాసదీపిక
43. కంకాళమాలినీ
44. కాలోత్తమ
45. యక్షడామర
46. సరస్వతీ
47. శారద
48. శక్తిసంగమ
49. శాక్తికాగమసర్వస్వ
50. సంమోహిని
51. ఆచారసార
52. చీనాచార
53. సదామ్నాయ
54. కరాళభైరవ
55. శోధ
56. మహాలక్ష్మి
57. కైవల్య
58. కులసద్భావ
59. సిద్ధితద్ధారి
60. కృత్సార
61. కాలభైరవ
62. ఉద్దామరేశ్వర
63. మహాకాల
64. భూతభైరవ

## అశ్వక్రాంత దేశవిభాగమునకు తంత్రములు

| | | | |
|---|---|---|---|
| 1. భూతశుద్ధి | 17. యోగతంత్ర | 33. కామిని | 49. భూతేశ్వర |
| 2. గుప్తదీక్ష | 18. ధర్మకతంత్ర | 34. మోహిని | 50. గాయత్రి |
| 3. బృహత్సార | 19. తత్త్వచింతామణి | 35 మోహన | 51. విశుద్ధేశ్వర |
| 4. తత్త్వసార | 20. బిందుతంత్ర | 36. సమీరణ | 52. యోగార్ణవ |
| 5. వర్ణసార | 21. మహాయోగిని | 37. కామకేశ్వర | 53. భేరుండ |
| 6. క్రియాసార | 22. బృహద్యోగిని | 38. మహావీర | 54. మంత్రచూడామణి |
| 7. గుప్తతంత్ర | 23. శివధ్యాన | 39. చూడామణి | 55. యంత్రచూడామణి |
| 8. గుప్తసార | 24. శంవర | 40. గుర్వార్చన | 56. విద్యుల్లత |
| 9. బృహత్తోడాల | 25. శూలినీ | 41. గోప్య | 57. భువనేశ్వరి |
| 10. బృహన్నిర్వాణ | 26. మహామాలినీ | 42. తీక్ష్ణ | 58. లీలావతి |
| 11. సిద్ధతంత్ర | 27. మోక్ష | 43. మంగల | 59. బృహచ్చీనా |
| 12. కాలతంత్ర | 28. బృహన్మాలినీ | 44. కామరత్న | 60. కురంబ |
| 13. శివతంత్ర | 29. మహామోక్ష | 45. గోపలీలామృత | 61. జయరాధామాధవ |
| 14. సారాత్సార | 30. బృహన్మోక్ష | 46. బ్రహ్మాండ | 62. ఉజ్జకక |
| 15. బృహత్కంకాళిని | 31. గోపీతంత్ర | 47. చీనా | 63. ధూమావతి |
| 16. గౌరీతంత్ర | 32. భూతలిపి | 48. మహావిరుత్తర | 64. శివ |

మరియు సర్వతంత్రములును కలసి 28 విభాగములుగా నున్నవని యొక అభిప్రాయము. అవి 1. కామికము, 2. యోగజము, 3. చింత్యము, 4. కారణము, 5. అజతము, 6. దీప్తము 7. సూక్ష్మము, 8. జగతి, 9. అంశుమానము, 10. సుప్రభేదము, 11. రవము, 12. మకుటము, 13. విమలము, 14. చంద్రజ్ఞానము, 15. బింబము, 16. ప్రోద్గీతము, 17. లలితము, 18. సంతానకము, 19. సార్వోత్తమము, 20. పారమేశ్వరము, 21. కిరణము, 22. భేదము, 23. వాతూలము, మొదలగునవి.

శ్రీః శ్రీః శ్రీః.



# శ్రీ చక్ర విలసనము

## శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రమ్

(అయిదవ అనుబంధము)

శ్లో॥ హ్రీంకారాసనగర్భితానలశిఖాం సౌః క్లీం కళాబిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధాధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్ ।
వందే పుస్తకపాశమంకుశధరాంస్రగ్భూషితాముజ్జ్వలామ్
త్వాం గౌరీం త్రిపురాంపరాత్పరకళాంశ్రీచక్రసంచారిణీమ్॥

అస్యశ్రీశుద్ధశక్తిమాలామహామంత్రస్య ఉపస్థేంద్రియాధిష్ఠాయీవరుణాదిత్యఋషిః దైవీగాయత్రీచ్ఛందః సాత్త్వికకారభట్టారపీఠస్థిత కామేశ్వరాంకనిలయా మహాకామేశ్వరీ శ్రీలలితాభట్టారికా దేవతా ఐం బీజం క్లీం శక్తిః సౌః కీలకం మమ ఖడ్గసిద్ధ్యర్థే జపే వినియోగః; మూలమంత్రేన షడంగన్యాసమ్ కుర్యాత్.

ధ్యానమ్—

తాదృశం ఖడ్గమాప్నోతి యేనహస్తస్థితేనవై
అష్టాదశమహాద్వీపసమ్రాడ్భోక్తా భవిష్యతి ॥

ఆరక్తాభాం త్రినేత్రామరుణిమవసనాం రత్నతాటంకరమ్యాం
హస్తాంభోజైస్సపాశాంకుశమదనధనుస్సాయకైర్విస్ఫురంతీం
ఆపీనోత్తుంగవక్షోరుహ విలుఠత్తారహారోజ్జ్వ లాంగీం
ధ్యాయే దంభోరుహస్థా మరుణిమవసనా మీశ్వరీ
మీశ్వరాణామ్ ।

లమిత్యాది పంచపూజాం కుర్యాత్, యథాశక్తి మూలమంత్రం జపేత్!

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఓం నమస్త్రిపుర సుందరి, హృదయదేవి, శిరోదేవి, శిఖాదేవి, కవచదేవి, నేత్ర దేవి, అస్త్రదేవి, కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నే భేరుండే. వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతి, త్వరితే, కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే, సర్వమంగళే, జ్వాలా మాలిని, చిత్రే, మహానిత్యే, పరమేశ్వర పరమేశ్వరి, మిత్రేశ మయి, షష్ఠీశమయి, ఉడ్డీశమయి, చర్యానాథమయి, లోపా ముద్రామయి. అగస్త్యమయి, కాలతాపనమయి, ధర్మాచార్య మయి, ముక్తకేళీశ్వరమయి, దీపకళానాథమయి, విష్ణుదేవ మయి, ప్రభాకరదేవమయి, తేజోదేవమయి, మనోజదేవమయి కళ్యాణదేవమయి, వాసుదేవమయి, రత్నదేవమయి, శ్రీరామా నందమయి, అణిమాసిద్ధే, లఘిమాసిద్ధే, గరిమాసిద్ధే, మహిమాసిద్ధే, ఈశిత్వసిద్ధే, వశిత్వసిద్ధే, ప్రాకామసిద్ధే, భుక్తిసిద్ధే, ఇచ్ఛాసిద్ధే, ప్రాప్తిసిద్ధే, సర్వకామసిద్ధే, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మహేంద్రి, చాముండే, మహాలక్ష్మి, సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వా కర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోనే, సర్వత్రికండే, త్రైలోక్యమోహనచక్ర స్వామిని, ప్రకటయోగిని, కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహం కారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి అమృతాకర్షిణి, శరీరా

కర్షిణి, సర్వాశాపరిపూరకచక్రస్వామిని,గుప్తయోగిని, అనంగ
కుసుమే, అనంగమేఖలే, అనంగమదనే, అనంగమదనాతురే,
అనంగరేఖే,అనంగవేగిని, అనంగాంకుశే, అనంగమాలిని,సర్వ
సంక్షోభణచక్రస్వామిని, గుప్తతరయోగిని, సర్వసంక్షోభిణి,
సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహిని,
సర్వస్తంభిణి, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వరంజని,
సర్వోన్మాదిని,సర్వార్థసాధకే,సర్వసంపత్తిపూరణి,సర్వమంత్ర
మయి, సర్వద్వంద్వక్షయంకరి, సర్వసౌభాగ్యదాయకచక్ర
స్వామిని,సంప్రదాయయోగిని, సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే
సర్వప్రియంకరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రదే, సర్వదుఃఖ
విమోచని,సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననివారిణి,సర్వాంగ
సుందరి, సర్వసౌభాగ్యదాయిని, సర్వార్థసాధకచక్రస్వామిని;
కులోత్తీర్ణయోగిని, సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్యప్రదా
యిని, సర్వజ్ఞానమయి, సర్వవ్యాధివినాశిని, సర్వాధార
స్వరూపే, సర్వపాపహరే, సర్వానందమయి, సర్వరక్షాస్వరూ
పిణి, సర్వేప్సితఫలప్రదే, సర్వరక్షాకరచక్రస్వామిని, నిగర్భ
యోగిని, వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణే,
జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వరోగహరచక్రస్వామిని,
రహస్యయోగిని, బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహా
కామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగమాలిని, సర్వసిద్ధి
ప్రదచక్రస్వామిని, అతిరహస్యయోగిని, శ్రీశ్రీ మహాభట్టా
రికే, సర్వానందమయచక్రస్వామిని, పరాపరరహస్యయోగిని,
త్రిపురే, త్రిపురేశి, త్రిపురసుందరి, త్రిపురవాసిని,త్రిపురాశ్రీః,
త్రిపురమాలిని, త్రిపురాసిద్ధే, త్రిపురాంబ, మహాత్రిపుర
సుందరి, మహామహేశ్వరి, మహామహారాజ్ఞి, మహామహాశక్తే,

మహామహాగుప్తే; మహామహాజ్ఞప్తే, మహామహానందే,మహా మహాస్కంధే, మహామహాశయే, మహామహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి నమస్తే నమస్తే నమస్తే నమః. (వామకేశ్వరతంత్రే)

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

జయజయ జగదంబ భక్తవశ్యే
జయజయ సాంద్రకృపానశాంతరంగే
జయజయ నిఖిలార్థదానశౌండే
జయజయ హేలలితాంబ చిత్సుఖాబ్ధే.

శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

ఇది

శ్రీశృంగేరీ జగద్గురు శంకరాచార్య శ్రీచరణ ప్రసాద లబ్ధ ప్రతిభాసమేతుడును, ఆంధ్రదేశాంతర్గత కృష్ణామండల మధ్యస్థ గుడివాడపురస్థానీయుడును, కృష్ణయజుర్వేదాంతర్గత షడశీతిశాఖామధ్యస్థ తైత్తిరీయశాఖీయుడును, ఆపస్తంబ సూత్ర హారితసగోత్రుడును, శారదాచంద్రమౌళీశ్వర ద్వంద్వ కులదేవతావిరాజమాన తుమ్మలపల్లి వంశోద్భవుండును, జ్యో పతి మహాలక్ష్మ్యంబా ప్రథమపుత్రుడును, శ్రీమజ్జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి నామకస్వగురు యదృచ్ఛా లబ్ధచిద్విద్యాదీపిత స్వస్వరూపాభిజ్ఞుడును, సదాశివానంద నాథ దీక్షా నామాంకితుడు నగు రామలింగేశ్వరరావుచే రచింపబడినది.

# ఉదాహరింపబడిన గ్రంథముల పట్టిక


అగ్నిపురాణము
అధ్యాత్మరామాయణము
అన్నదాతంత్రము
అమృతానందోపనిషత్తు
అరుణేశతంత్రము
అరుణోపనిషత్తు
అహిర్బుధ్న్యసంహిత
అష్టాధ్యాయి (పాణిని)
ఆకాశభైరవతంత్రము
ఆగమకల్పద్రుమము
ఆగమద్వైతనిర్ణయము
ఆచారసారతంత్రము
ఇంద్రజాలతంత్రము
ఈశోపనిషత్తు
ఉడ్డీశకతంత్రము
ఉత్తరగీత
ఉత్తరతంత్రము
ఉదయనాచార్యన్యాయకుసుమాంజలి
ఉద్దామకేశ్వరతంత్రము
ఋగ్వేదము
ఏకజాతతంత్రము
ఐతరేయోపనిషత్తు
కంకాళతంత్రము
కంకాళమాలినీతంత్రము
కఠోపనిషత్తు
కణాదవైశేషిక సూత్రములు
కరాళభైరవతంత్రము
కలానిధితంత్రము
కలావాదతంత్రము
కలాసారతంత్రము
క్రమచంద్రిక
కాత్యాయనస్మృతి
కామకలావిలాసము
కామకేశ్వరతంత్రము
కామధేనుతంత్రము
కామరత్నతంత్రము
కామాఖ్యతంత్రము
కామికతంత్రము
కామినీతంత్రము
కారణాగమము
కాలభైరవతంత్రము
కాలాగ్నిభైరవతంత్రము
కాలోత్తమతంత్రము
కాళికాపురాణము
కాళికాశ్రుతి
కాళీకులామృతము
కాళీతంత్రము
కాళీవిలాసతంత్రము
క్రియాసారతంత్రము
కుండికకామతంత్రము

కుబ్జికాతంత్రము
కుమారీతంత్రము
కుమారిలభట్టమీమాంసాభాష్యము
కులచూడామణితంత్రము
కులప్రకాశతంత్రము
కులసద్భావతంత్రము
కులసారతంత్రము
కులామృతతంత్రము
కులార్ణవతంత్రము
కులేశ్వరితంత్రము
కులోడ్డీశతంత్రము
కురంజతంత్రము
కూర్మపురాణము
కృకలాసదీపికాతంత్రము
కృత్సరతంత్రము
కేనోపనిషత్తు
కైవల్యతంత్రము
కైవల్యనవనీతము
కైవల్యోపనిషత్తు
కౌమారితంత్రము
కౌలతంత్రము
గంధర్వమాలిక
గణేశవిమర్శనితంత్రము
గవాక్షతంత్రము
గరుడతంత్రము
గాంధర్వతంత్రము
గాయత్రితంత్రము
గుప్తతంత్రము
గుప్తదీక్షతంత్రము
గుప్తసారతంత్రము
గుర్వార్చనతంత్రము
గుహ్యతంత్రము
గోపలీలామృతతంత్రము
గోప్యతంత్రము
గోపీతంత్రము
గోరక్షసంహిత
గౌడపాదాచార్యుడు త్తరగీతాటీకా
గౌతమీయతంత్రము
గౌతమునిన్యాయసూత్రములు
గౌరీతంత్రము
చండీస్తోత్రము
చంద్రకళాతంత్రము
చంద్రజ్ఞానతంత్రము
చంద్రవిద్య
చాముండాతంత్రము
చిన్మయతంత్రము
చీనాతంత్రము
చీనాచారతంత్రము
చూడామణితంత్రము
ఛలాక్షరసూత్రము
ఛాందోగ్యఉపనిషత్తు
ఛాయానిలతంత్రము
జయదేవునిగీతగోవిందము
జయరాధామాధవతంత్రము
జ్ఞానార్ణవము
జ్ఞానభైరవము
జైమినిపూర్వమీమాంసాసూత్రము
జ్యోతిష్మతితంత్రము

ప్రేమయోగతరంగిణి
పైంగలోపనిషత్తు
ఫేట్కారితంత్రము
బహురూపాష్టకవిద్య
బ్రహ్మయామళము
బ్రహ్మవిద్యావిలాసము
బ్రహ్మసూత్రములు
బ్రహ్మజ్ఞానతంత్రము
బ్రహ్మాండతంత్రము
బ్రహ్మాండపురాణము
బ్రహ్మోపనిషత్తు
బార్హస్పత్యతంత్రము
బాలవిలాసతంత్రము
బ్రాహ్మీతంత్రము
బీజచింతామణీతంత్రము
బృహచ్ఛ్రీనీతంత్రము
బృహచ్ఛ్రీక్రమతంత్రము
బృహత్కంకాళినీతంత్రము
బృహత్సారతంత్రము
బృహత్తోడాలతంత్రము
బృహత్త్రివిక్రమసంహిత
బృహద్యోగినీతంత్రము
బృహద్యోనీతంత్రము
బృహద్గౌతమీయతంత్రము
బృహదారణ్యకఉపనిషత్తు
బృహన్మాలినీతంత్రము
బృహన్నిర్వాణతంత్రము
బృహన్మోక్షతంత్రము
భగవద్గీత

భర్తృహరివాక్యపదీయము
భావచూడామణితంత్రము
భావనోపనిషత్తు
భాస్కరాచార్యలలితాసహస్రనామ
వ్యాఖ్య
భువనేశ్వరితంత్రము
భూతడామరము
భూతలిపితంత్రము
భూతేశ్వరతంత్రము
భూతోడ్డామరతంత్రము
భూతభైరవతంత్రము
భూతశుద్ధితంత్రము
భేరండతంత్రము
భైరవయామళము
భైరవితంత్రము
మంగళతంత్రము
మండలబ్రాహ్మణఉపనిషత్తు
మంత్రచూడామణి
మంత్రతంత్రప్రకాశిక
మంత్రదేవతాప్రకాశిక
మంత్రమహోదధి
మంత్రరత్నవ్యాఖ్యానము
మత్స్యసూక్తతంత్రము
మత్తోత్తరతంత్రము
మహాకాలతంత్రము
మహాకాళిమతతంత్రము
మహాతంత్రము
మహాదేవతంత్రము
మహానిర్వాణతంత్రము

మహానిరుత్తరతంత్రము
మహానలతంత్రము
మహాభారతము (అశ్వమేధ)
మహాభాష్యము (పతంజలి)
మహామాయాశంబరతంత్రము
మహామాలినీతంత్రము
మహామోక్షతంత్రము
మహాయోగినీతంత్రము
మహాలక్ష్మీతంత్రము
మహావీరతంత్రము
మహాసంమోహనతంత్రము
మహిషమర్దనీతంత్రము
మాండూక్యోపనిషత్తు
మాతృకాకోశము
మాతృకోదయతంత్రము
మానసోల్లాసము-సురేశ్వరాచార్య
కృతవార్తికము
మాయాతంత్రము
మాలినీతంత్రము
మాలినీవిజయతంత్రము
మాహేంద్రితంత్రము
ముండకోపనిషత్తు
ముండమాలాతంత్రము
ముక్తికోపనిషత్తు
మేరుతంత్రము
మైత్రిఉపనిషత్తు
మోదినీశతంత్రము
మోహనతంత్రము
మోహినీతంత్రము
మోక్షతంత్రము
యంత్రచూడామణి
యజుర్వేదము
యమళాష్టకము
యక్షడామరము
యక్షిణీతంత్రము
యామళతంత్రము
యోగకుండలిఉపనిషత్తు
యోగతంత్రము
యోగతత్త్వఉపనిషత్తు
యోగశిఖోపనిషత్తు
యోగస్వరోదయతంత్రము
యోగసారతంత్రము
యోగసూత్రములు
యోగార్ణవతంత్రము
యోగినీజాలశంబరము
యోగినీతంత్రము
యోగినీభైరవతంత్రము
యోగినీహృదయము (వామకేశ్వర
ఉత్తరచతుశ్శతి)
యోనితంత్రము
రాజమహేంద్రవరస్థలపురాణం
రాజరాజేశ్వరితంత్రము
రాధాతంత్రము
రామతాపినీఉపనిషత్తు
రామతీర్థకృతమానసోల్లాసటీక
రుద్రయామళము
రూపభేదతంత్రము
రేణుకాపురాణము

రేవతీతంత్రము
లలితాతంత్రము
లలితారహస్యము
లలితాసహస్ర నామావళి
లలితా స్తవరత్నమ్
లలితా స్తవరాజము
లింగపురాణము
లీలావతీతంత్రము
వటుకభైరవతంత్రము
వర్ణవిలాస తంత్రము
వర్ణసారతంత్రము
వర్ణోద్ధృతి
వరాహఉపనిషత్తు
వశిష్ఠసంహిత
వాచస్పతిమిశ్రన్యాయసూచీ
నిబంధన
వాతులతంత్రము
వాతులోత్తరతంత్రము
వామకేశ్వరతంత్రము
వామజుష్టతంత్రము
వాయవ్యసంహిత
వారాహీతంత్రము
వాసుదేవరహస్యతంత్రము
విందుతంత్రము
వికుంఠేశ్వరతంత్రము
విద్యారణ్యశంకరవిజయము
విద్యుల్లతతంత్రము
విమలతంత్రము
విమలోత్తమతంత్రము
విశ్వసారతంత్రము
విశుద్ధేశ్వరతంత్రము
విష్ణుపురాణము
వీణాఖ్యతంత్రము
వేదవ్యాసయోగసూత్రవ్యాఖ్య
వైయాసికన్యాయమాల
వైష్ణవితంత్రము
వైష్ణోపనిషత్తులు
శంకరమిశ్రుల ఉపస్కారము
శక్తితంత్రము
శక్తిమంగళతంత్రము
శాండిల్యఉపనిషత్తు
శాంతిపర్వము (మహాభారతము)
శాకటాయనస్మృతి
శాక్తానందతరంగిణి
శాక్తికాగమసర్వస్వము
శారదాతంత్రము
శారదాతిలక
శివతంత్రము
శివచ్ఛావతంత్రము
శివదూతీతంత్రము
శివసంహిత
శివసూత్రములు
శివాగమతంత్రము
శ్రీక్రమతంత్రము
శ్రీమద్భాగవతము
శ్రీవిద్యారత్నసూత్రాణి
శ్రీశంకరభగవత్పాదగీతాభాష్యము

శ్రీశంకరభగవత్పాదసూత్ర
భాష్యము
శుకసంహిత
శూలినీతంత్రము
శైవోపనిషత్తులు
శోధతంత్రము
షట్చక్రనిరూపణ (శ్రీతత్త్వచింతామణి షష్ఠఃపటలః)
సంవరతంత్రము
సకలజననీస్తోత్రము
సదాచారదీపిక
సదామ్నాయతంత్రము
సనందనసంహిత
సనకసంహిత
సనత్కుమారసంహిత
సన్న్యాసోపనిషత్తులు
సమయాచారతంత్రము
సమీరణతంత్రము
సమ్మోహనతంత్రము
సమ్మోహినీతంత్రము
సరస్వతీతంత్రము
సర్వజ్ఞానోత్తమతంత్రము
స్వచ్ఛందసంగ్రహము
సర్వోదయతంత్రము
స్వతంత్రతంత్రము
సాధనాకల్పలతిక
సామాన్యవేదాంతోపనిషత్తులు
సాయణభాష్యము
సారసతంత్రము
సారాత్సారతంత్రము
సాహిత్యదర్పణము
సిద్ధతంత్రము
సిద్ధితద్దారి
సిద్ధిభైరవతంత్రము
సిద్ధియామళము
సిద్ధిసారతంత్రము
సిద్ధిసారస్వతతంత్రము
సిద్ధీశ్వరతంత్రము
సుకుముదినీతంత్రము
సుభగోదయస్తోత్రము
సూతసంహితాభాష్యము
సౌందర్యలహరి
సౌభాగ్యచింతామణి
సౌభాగ్యభాస్కరము
సౌభాగ్యరత్నాకర
హంసమహేశ్వరతంత్రము
హంసోపనిషత్తు
హఠయోగప్రదీపిక
హృద్భేదతంత్రము

2531

# శ్రీచక్రవిలసనము

## శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| పరిచయం | 13 | ము లసంఖ్యా | ములు సంఖ్యా |
| 2వ పేజి | | | |
| ఉదాహృతగ్రంథముల పట్టిక | | | |
| ౧౩ | | మహిష | మహిషాసుర |
| ౧౫ | | హృద్భేద | హృద్భేద |
| 7 | 7 | తిపుర | త్రిపుర |
| 16 | 16 | చివర (చూడుడు 17 పుట) అని ఉండవలెను | |
| 19 | 12 | శ్రీ తిపుర | శ్రీ త్రిపుర |
| 20 | 17 | అంతర | ఆంతర |
| 22 | 4 | 4 మండలములు | 3 మండలములు |
| 30 | 20 | క్రింద గీత ఉండవలెను | |
| 40 | 8 | సర్వధార | సర్వాధార |
| 43 | 5 | శిఖండాః | శిఖండాః) |
| 43 | 24 | చూడాః | చూ ాః |
| 45 | 12 | మంత్రసంకేత | మం తసంకేత |
| 45 | 2 | ప్రశస్తమ్ | ప్రశస్తమ్॥ |
| 46 | .24 | శుద్ద | శుద్ధా |
| 50 | 22 | స్వత్మా | స్వాత్మ |
| 59 | 20 | తిపురా | త్రిపురా |
| 60 | 1 | శక్తానంద | శాక్తానంద |
| 64 | 21 | మున్న. | మున |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 10 | సంవో: | సందోహ |
| 71 | 19 | చశుర్బాహు | చతుర్బాహు |
| 83 | 7 | రనికా | రసికా |
| 84 | 4 | మనస్సత్వము | వనస్సత్త్వము |
| 91 | 14 | సర్వ్యాదన | సర్వ్యాదన |
| 96 | 19 | స్వాత్త | స్వాత్మ |
| 98 | 11 | రజకా | రసికా |
| .04 | 2 | సార | సాద |
| ι04 | 20 | కాలావస్ఛన్నం | కాలావచ్ఛిన్నం |
| ι08 | 17 | యవస | యవస |
| 108 | 20 | నసించు | నశించు |
| 110 | 22 | ద్రువము | ద్రుమము |
| 112 | 12 | గూడః | గూఢః |
| 118 | 24 | చిద | భిద |
| 119 | 14 | మథయమ్ | ముథయమ్ |
| 120 | 22 | నెగురుట | నెరుగుట |
| 124 | 13 | గ్రం శ్ఛిద్యంతే | గ్రంథిశ్ఛిద్యంతే |
| 125 | 3 | అస్తీర్తో్య | అస్తీత్యే |
| 125 | 11 | దారార్ధ్య | దార్ధ్య |
| 125 | 11 | భవతీత | భవతీతి |
| 126 | 10 | బ్రఖ్యా | ప్రఖ్యా |
| 126 | 23 | ముంభావ | ముల భావ |
| 127 | 12 | పబుద్ద్యా | ప్రబుద్ధ్యా |
| 133 | 22 | గోరకా | గోరక్షా |
| 141 | 5 | విద్యాశంకరాచార్య | శంకరాచార్య |
| 157 | 19 | వహివాసిని | వహ్నివాసిని |
| 158 | 9 | సంబావింప | సంభావింప |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 158 | 12 | బ్రహ్మ్య | బ్రహ్మై |
| 159 | 13 | కనుపింక | కనుపింపక |
| 160 | 13 | దూర్యా | దూర్వా |
| 163 | 12 | వృష్టి | వ్యష్టి |
| 185 | 14 | ప్రాత్తి | ప్రాప్తి |
| 191 | 15 | సర్వక్ర | సర్వత్ర |
| 193 | 8 | అరము | ఆరము |
| 200 | 2 | పళయ | ప్రళయ |
| 205 | 9 | పుష్ఠి | పుష్టి |
| 205 | 14 | సిద్ధ | సిద్ధి |
| 214 | 20 | కులోదేశము | కులోడీశము |
| 215 | 12 | కాలుసు | కాలురు |
| 217 | 48 | కులచూమమణి | కులచూడామణి |
| 221 | పుటపైన శ్రీః ఉండవలెను | | |
| 221 | 6 | సాత్వికకార | సాత్వికకకార |
| 222 | 15 | ప్రాకామ | ప్రాకామ్య |
| 222 | 20 | త్రికండే | త్రిఖండే |
| 222 | 24 | శరిరా | శరీరా |
| 223 | 10 | స్వదుఃఖ | సర్వదుఃఖ |

పెక్కుచోట్ల వాక్య విరమణపుగుర్తులు (ఫుల్‌స్టాప్) లేవు. పాఠకులు గమనింపవలెను.

అచ్చు తప్పులవలన కలిగిన అసంగత్యమును మన్నింపవలెను.

(ప్రకాశకులు)

